


కృష్ణ సమర్పించు జి.వి.ఆర్. పిక్చర్స్

తప్పక చూడండి!

# శభాష్ గోపి





ఫ్యూజి కలర్

నిర్మాత: జి.వి.రాఘవయ్య చౌదరి

దర్శకత్వం మానికొండ మధుసూదనరావు M.A.

స్క్రీన్‌ప్లే జి.హనుమంతరావు

నిర్వహణ జి.ఆదిశేషగిరిరావు B.Sc.




శ్రీ ఫిలింస్

సీడెడ్ నవభారత్ ఫిలింస్ నైజాం శ్రీతారకరామఫిలింస్ కర్ణాటక యస్.వై.కె కంబైన్స్

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 39 జనవరి 1979 సంచిక 1


ఒక విదేశీయుడు మన దేశంలో అయిదు సంవత్సరాలపాటు నివసించి, మళ్ళీ తన స్వదేశానికి వెళ్ళిపోతూ మమ్మల్ని కలుసుకున్నాడు. అతడు మన దేశంలో వున్న అయిదేళ్ళలోనూ అన్ని రాష్ట్రాలలోనూ కొన్ని మాసాలు గడిపాడు. పట్టణాలలోనూ, పల్లెలలోనూ ప్రజల జీవితాన్ని గమనించాడు. వారి మనస్తత్వాలనూ, ప్రవర్తనలనూ పరిశీలించాడు. అతనికి రాజకీయాలతో సంబంధంలేదు. మనిషిని మనిషిగానే చూశాడు కాని తెల్లవాడా, నల్లవాడా, డబ్బు గలవాడా, దరిద్రుడా అనే విచక్షణతో చూడలేదు.

మనల్ని గురించి అంటే తెలుగువారిని గురించి అతడు తెలుసుకున్న దేమిటో చూదామని, మా తెలుగువారి విషయంలో మీ అభిప్రాయాలేమిటి అని అడిగాము. అతడు చెప్పిన విషయాలు ఇవి :

“ఒక ప్రత్యేకమైన జాతిగా మీ అంత మంచివారు లేరు ; మీ అంత దౌర్భాగ్యులు లేరు ; మీ అంత గొప్పవారు లేరు ; మీ అంత సంకుచిత స్వభావులు లేరు; మీ అంత దాతలు లేరు ; మీ అంత దుర్వ్యసనపరాయణులు లేరు ; మీ అంత విశాల హృదయం గలవారు లేరు ; మీ అంత ఈర్ష్యాపరులు లేరు.

"ఇప్పుడు నేను చెప్పిన వానిలో సుగుణాలు ఎక్కువగా. ఒదువు సంధ్యలు రాని అనాగరికులైన పల్లెటూరి ప్రజలలో వున్నాయి. దుర్గుణాలు ఎక్కువగా, చాలా పెద్ద చదువులు చదివి నాగరికులమని చెప్పుకునే వారిలో వున్నాయి.

"మీలో కవులమని చెప్పుకొనే వారిలో చాలామందితో నేను మాట్లాడాను. ప్రతి మహానుభావుడూ కూడా ఆంధ్రదేశంలో చెప్పదగిన కవిని తానొక్కడినేననీ, తక్కినవారంతా కుక్కగొడుగులనీ చెప్పాడేకాని కవిత్వం వ్రాయ గలవాడు మరొకడు వున్నాడని ఒప్పుకోలేదు.

"పత్రికా రచయితలను చాలామందిని పలకరించి చూశాను. ఏ ఒక్కడు కూడా, తనకి తప్ప మరొకడికి పత్రికారచనలోగాని, నిర్వహణలోగాని అను భవం వున్నదనిగాని, ప్రజ్ఞ వున్నదనిగాని, అసలు పత్రికా రచన అంటేగాని, నిర్వహణ అంటేగాని ఏమిటో తెలుసుననిగాని అంగీకరించినట్టు కనపడలేదు.

"చాలామంది పండితులతో కలిసి మెలిసి తిరిగాను. ఒక్కడూ మరొకడికి పాండిత్యం వుందనిగాని, పాండిత్యం అంటే ఏమిటో తెలుసుననిగాని చూచా యగానైనా అనలేదు.

"ఎంతోమంది వ్యాపారస్తులతో ఎన్నో దినాలు గడిపాను. ప్రతి వ్యాపారీ కూడా, అసలు వ్యాపారం అంటే ఏమిటో అర్థంకాని ప్రతివాడూ వ్యాపారంలోకి దిగి వ్యాపారాన్ని పాడుచేస్తున్నాడనీ, అన్ని వ్యాపారాలూ తన చేతిలో పెట్టి, తన అధ్వర్యంలో వ్యాపారంచేస్తే ఎంతో బాగుండునని వాపోయినవాడే.

"సినిమా డైరెక్టరును కదిలించి చూశాను. పాశ్చాత్య ఫిలిములు ఎంతో బాగుండటానికీ, తెలుగు ఫిలుములు అధ్వాన్నంగా వుండడానికీ, కారణం తాను తప్ప మిగతా డైరెక్టర్లందరూ డైరెక్టర్లు అవడమేనని విరక్తి చూపినవాడే.

"నటకులతో కొంత చర్చచేసిచూశాను. ప్రతి నటకుడూ, తనకు తప్ప మరే యితర నటకుడికీ 'నటన' అంటే ఏమిటో తెలియదనీ, యీనాటి ఆంధ్ర ప్రేక్ష కులు అమాయకులు గనుక, తక్కిన నటకులంతా నటకులుగా చెలామణీ అవు తున్నారనీ, ప్రేక్షకులకే గనుక నటన అంటే ఏమిటో కొంచెమైనా తెలిసినట్ల యితే ఆ నటకులందరినీ చెవులు నులిపి క్రింపకి తన్నేవారేనని చెప్పినవాడే.

"తనకు తెలియని సంగతిని గురించి ఎవరైనా అడిగినప్పుడు, ఏ పెద్దమనిషి అయినాసరే నాకు యీ సంగతిని గురించి ఏమీ తెలియదు. ఫలానా వారిని అడగండి అని చెపుతాడు. కాని, ఏ సంగతిని గురించి అడిగినా సరే, ఒక్కొక్కప్పుడు అడక్కపోయినా సరే, దానిని గురించి తనకు సర్వమూ తెలిసినట్లు మాట్లాడడం, తెలుగువారిలో చాలామంది ప్రత్యేకత.

"తమ దేశపు మేలు అనీ, తమ రాష్ట్రపు మేలు అనీ కొన్ని ఆశయాలు మిగతా రాష్ట్రాల ప్రజలలో వున్నాయి. మీ తెలుగువారిలో బహు కొద్దిమందికి తప్ప తక్కినవారికి యీ విషయమే అనవసరం. ప్రజ్ఞగలవాడెవడైనా తమలో కనపడితే, అతడికి తన ప్రజ్ఞను ప్రదర్శించుకోవడానికీ, పేరు పొందడానికీ అవకాశాన్ని కల్పిస్తారు, మిగతా రాష్ట్రాలవారు. మీ తెలుగువారు అలాకాదు. వీడొక పెద్ద మొనగాడు బయలుదేరాడయ్యా అని, అతడు గుండెలు పగిలిచచ్చిన దాకా రాళ్ళు విసురుతారు. చచ్చిన తరువాత భారతదేశంలోనే యింతటి దురంధరుడు లేడని బ్రహ్మరథం పడతారు.

"ఒక మొదలియారు మరొక మొదలియారుకి ఉద్యోగం యిప్పించాడను కోండి. ఉద్యోగం పొందిన మొదలియారు, ఇప్పించిన మొదలియారుకి యావజ్జీవమూ కృతజ్ఞత చూపిస్తాడు. ఒక రామారావు ఒక అన్నపూర్ణయ్యకు ఉద్యోగం ఇప్పించాడనుకోండి. ఆ అన్నపూర్ణయ్య ఏం చేస్తాడో తెలుసా? రామారావు ద్వారా తాను ఉద్యోగం సంపాదించుకో గలిగాననే కృతజ్ఞతా చూపడు, పోనీ, రామారావుచేత ఉద్యోగం యిప్పించుకోవలసిన స్థితిలో తాను వుండవలసి వచ్చిందే అని తన పూర్వస్థితిని నిందించుకోనైనా నిందించుకోడు. పైగా తనకు ఉద్యోగం యిప్పించే స్థితిలో రామారావు ఉన్నాడే అని రామారావుమీద కత్తి నూరుతూ కూచుంటాడు. ఖర్మంచాలక రామారావు మెడే గనక తనకు దొరికిందా, తన చేతిలోవున్న కత్తిని రామారావు మెడమీదబెట్టి కటీక్కని నొక్కుతాడు.

"ఏ జాతివాడైనా, తన తోటివాడికి ఉపకారంచేసి ఆనందించవచ్చును; ప్రత్యుపకారాన్ని పొందవచ్చును; కాని, తెలుగువాడికి ఉపకారం చేసిన ప్రతి తెలుగువాడూ విరోధాన్ని కొనితెచ్చుకున్నట్టే. కొన్ని సందర్భాలలో అపకారాన్ని కూడా అనుభవిస్తాడు.

"తనకు వున్నదానిని ధ్వంసం చేసుకోవడంలోనూ, ఉన్నవారిని చూసి ఏడవడం లోనూ తెలుగువారిలో అధిక సంఖ్యాకులు చూపే ప్రజ్ఞ మరొకరిలో లేదు.

“డబ్బు విషయంలో తెలుగువారికి ఉన్నంత నిర్లక్ష్యము మరెవరికీ లేదు. అలాగని, అంతా దానకర్ణులు కారు. తెలుగు దేశంలో దాతలు లేరని నేను అనను. అసలు విశ్వదాత అని ప్రఖ్యాతి పొందిన మహాపురుషుడు తెలుగు దేశంలోనే జన్మించాడు!

“తమలో తమర్ని ఎద్దేవా చేసుకోమంటే, యితర్లలో తప్పులు ఎన్నమంటే, బాగుపడుతున్నవాడికి ఎసరు పెట్టమంటే, విశేషప్రజ్ఞ చూపించేవారు, తెలుగు వారిలోనే ఎక్కువమంది కనపడతారు.

“మీ జాతిలో వున్న మంచిగుణాలు, లోపాల ఆధిక్యతవల్ల ముందుకు రావడంలేదు.

“ఆ లోపాలను సవరించుకొని, కలసికట్టుగా వున్నట్లయితే దేశంలో మీ రాష్ట్రానికి వున్న బలం మరొక రాష్ట్రానికి వుండదు. సహజసంపద విశేషంగా వున్నందున మీ రాష్ట్రమంత సౌభాగ్యవంతమైన రాష్ట్రం మరొకటి వుండదు.”

విదేశీయుడు చెప్పిన. పై మాటలకి సమాధానం మాకు తోచలేదు. “లోపాలు అందరిలోనూ వుంటాయి. మాలోనూ వున్నాయి. ఐకమత్యం సాధించి, మా లోపాలను సవరించుకోగలమన్న ధైర్యం మాకు వుంది” అన్నాము.

దాట్ల నారాయణమూర్తిరాజు




గాలి రావడానికి భయపడే కొట్టుగది లాంటి గదిలో మసక మసక చీకట్లో, చీకటి ముద్దలా, మూలన పడేసిన మాసిపోయిన గుడ్డలా, గొంతుకిలా కూర్చుని, ముడుచుకున్న కాళ్ళల్లో చేతులు కూడా దూర్చుకుని గెడ్డం ముఖుకుల మీద ఆనించుకుని, కనురెప్పలు మూసుకుని "ఇహంలో ఇంత బ్రతుకూ బ్రతికేను... పరంలోకి నన్నెంత త్వరగా తీసికెల్తావురా భగవంతుడా...." అనే కోరికతో తపస్సు చేస్తున్నవాడిలా కూర్చున్నాడు ఆదిమూర్తి.

ఆ కొట్టుగది తలుపురెక్కలు వకటి తీసి, రెండోది వేసివున్నాయి. వరండాలో వెలుగుతున్న బల్బు తాలూకు కాంతి, చేరేసిఉన్న తలుపు రెక్క గదిలోనికి రానివ్వకుండా అడ్డేస్తోంది. ఆ తలుపు రెక్క తీస్తే ఆ వెలుగు లోనికొచ్చును. కానీ ఆదిమూర్తి ఆ ప్రయత్నమేమీ చెయ్యలేదు. చీకట్లో పుట్టి, చీకట్లో పెరిగి, చీకట్లో బ్రతుకుతున్నవాడిలాగా, చీకటిబ్రతుక్కి అలవాటుపడిపోయిన వాడిలాగా వరండావేపు చూస్తున్నాడు ఆదిమూర్తి.

వరండా చివర మెట్లమీద మనవడూ, మనవరాలూ పెద్ద ఎత్తున గోలచేస్తూ తమ మిత్రబృందంతో 'బొమ్మల పెళ్ళాట' ఆడుతున్నారు. పై మెట్టుమీద కర్ర పెళ్ళికొడుకుని, కర్ర పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టారు. మెట్లక్రింద, మీద లక్కపిడతలు చెల్లాచెదురుగా పడి వున్నాయి. బొమ్మలకు పెళ్ళిచేసే ప్రయత్నంలో ఇద్దరు ముగ్గురు పిల్లల పెళ్ళిపెద్దలు చాలా గాభరాగా హడావిడిగా వున్నారు. ఇంకో ముగ్గురు, తూతూ బాజా వాయిస్తున్నారు. ఆ

తతంగం చాలాసేపట్నించీ జరుగుతోంది. అందరూ కలిసి నిజంగా పెళ్ళి జరిగినప్పడు తిరిగే పెద్దమనుషుల్లా హడావిడిగా తిరుగుతున్నారే తప్ప ఆ బొమ్మలకు పెళ్ళి మాత్రం ఇంతవరకూ చెయ్యలేదు.

"ఒరేయ్ బోడీ, చిట్టీ తిండికి రండర్రా...." ఆ కేక లోన వంటగదిలోంచి వాళ్ళమ్మ వేసింది. తమలో తామందరూ 'పెళ్ళి రేపు జరుపుదామనే నిశ్చయాని' కొచ్చి ఎవరి బొమ్మలు, ఎవరి లక్కపిడతలు ఎవరివి వాళ్ళు పట్టుకుని పారిపోయారు.

"ఏవర్రా....ఎక్కడ చచ్చారు...." పెళ్ళి పెద్దలందరికీ వీడ్కోలు చెప్పి మనవడూ, మనవరాలూ వెళ్ళేసరికి వాళ్ళమ్మ కోపంతో ఇద్దరికీ రెండు వడ్డించేసింది.

"బడొదిలీగానే పుస్తకాలు మూలన పడేయడం....ఇసకలోనూ .... అడ్డమైన వాళ్ళిళ్ళలోనూ దొర్లడం .... చదువు లేదు....సంధ్యా లేదు...." పిల్లలిద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని ఒకేసారి ముఖారీరాగాన్ని అరంభించేరు.

"ఏడ్చేరంటే .... కుమ్మేస్తాను .... నోర్మూయ్యండి .... నోర్మూస్తారా .... రమ్మన్నారా...." ఇద్దరూ చేతులతో నోళ్ళను మూసుకుని ఒకరి వేపు ఒకరు బిక్కచచ్చిపోయి కూర్చున్నారు.

తర్వాత మాటలేం వినబడలేదు ఆదిమూర్తికి. అన్నం తిండానికి ఇద్దర్లో ఎవరో అల్లరిపెడితే వాళ్ళమ్మ మళ్ళీ గుద్దిన గుద్దులు దభీదభీమని వినిపించాయి.

"పిల్లల్నెందుకలా కొడతావు .." ఆ మాట నోటిదాకా వచ్చింది ఆదిమూర్తికి. కానీ అడగలేకపోయాడు. అడిగే పిచ్చి ప్రయత్నమేమీ చెయ్యదల్చుకోలేదు.

"నా పిల్లలు....నా ఇష్టం....మీకెందుకంత బాధ...." ఇలాటి జవాబే వస్తుంది. అవును. ఎవరి పిల్లల్ని వాళ్ళు కొట్టుకుంటారు. చంపుకుంటారు. చీల్చుకుంటారు. మధ్య తనకెందుకు బాధ.... తను వాళ్ళకు తాతనవడూ, వాళ్ళు తనకు కొడుకు పిల్లలు, మనవలవరూ.... మనవల బాగోగులు చూడ్డానికి తను తగడా....తను వాళ్ళకి తాత కాడా.... వాళ్ళ దృష్టిలో తనెందుకింత చెడ్డయిపోయాడు. లోకంలో అందర్లా పెంచిన పిల్లల ఆదరణలో బ్రతకాలని కోరుకోవడం తప్పా? వాళ్ళు రెక్కలు ఎదిగి ఎగరగలిగేవరకూ చూసి సంతోషించడానికేనా తల్లిదండ్రులు. తమకు కాళ్ళూ చేతులూ వంగితే కన్నవాళ్ళ దగ్గరికి చేరడం తప్పా. అలాంటి ఆశలు ఈ తరం తల్లిదండ్రులు పెట్టుకోగూడదా? కని పెంచినదాకానే వాళ్ళ బాధ్యత.

ఇలాగా ఆలోచించడం **ఆదిమూర్తికి** అలవాటే. ఎనిమిదేళ్ళ ఈ ఆలోచన్లు అతని జీవితంలోకి బాధలు మరచిపోవడానికి స్నేహితుల్లా వస్తేస్తున్నాయి. జీవితం అంతా తీరుబడే. ఈ తీరుబడిలో అతనెంతో తృప్తికరమైన జీవితం కావాలని దేవుడికి 'దణ్ణాలు' పెట్టుకున్నాడు. కని పెంచినవాళ్ళని, వాళ్ళ పిల్లల్ని చూస్తూ, గతాన్ని, గతంలో బాధల్ని మరచిపోవచ్చు ననుకున్నాడు.

కానీ -

అతను వూహించినదొకటి. ఎదురైన పరిస్థితి వకటి.

తనెంత కష్టపడి కొడుకుని పెంచాడు. పెద్దమార్కెట్లో కర్రలు మోసి కూలికి వచ్చిన డబ్బుతో కొడుకుని చదివించేడు తను. బాబామెట్ట కొండల దగ్గర 'రాళ్ళ మిషను' దగ్గర రాళ్ళబుట్టలు మోసి కొడుకుని అష్టకష్టాలుపడీ చదివించేడు. ఎండనకా, వాననకా, ఎండలో కరగి, వానలో నీరై వాడి బాగుకోసం అహో రాత్రులు కష్టపడ్డాడు తను. తన పేద తనం వాడికి రాకూడదని, వాణ్ణి ఒక పేదవాడి కొడుకుగా, లోకం చూడకూడదని, వాడు నలుగురిలో దర్జాగా తిరిగితే చూడాలని 'ఫలానావాడు.... వాడు.... మా' అబ్బాయే ..... నని గర్వంగా చెప్పుకోవచ్చని.... ఎన్ని బాధలు పడ్డాడు తను!

ఆదిమూర్తికి వక్కసారి అదేదో సినిమాలో ట్రిక్ ఫోటోగ్రఫీలా కొడుకు కొండల్రావుఐదేళ్ళవాడిస్వరూపం-ముప్పై ఏళ్ళ స్వరూపం రెండూ వక్కసారే కళ్ళముందు కనబడ్డాయి.

ఎంతలో ఎంత ఎదిగిపోయాడు!

కొండల్రావుకి మిల్లులో సూపర్ వైజర్‌గా వుద్యోగం వచ్చినప్పుడు ఎంతగా పొంగిపోయేడు తను. తన ఆశలు తీరినందుకు, తన కలలు పండి ఫలించినందుకు ఇదమిత్థమని తెలియని ఆనందం ఎంత అనుభవించాడు తను. ఇన్నాళ్ళూ తను పడ్డ కష్టాలు ఈదే రాయని, హాయిగా 'రామా కృష్ణా' అనుకుంటూ సుఖపడాలని ఎంతగా కోరుకున్నాడు తను. ఆఖరికి తన కలలు ఏమాత్రం పండాయి? తన ఆశలు ఏమాత్రం తీరినాయి? అన్ని కష్టాలు పడి పెంచిన కొడుకు వుద్యోగం వచ్చాక ఎంతగా మారిపోయాడు. దూరపు చుట్టరికం చూసి తనే దగ్గరుండి పెళ్ళి జరిపించాడు. 'కట్నాలు' ఇవ్వడానికి డబ్బు లేక ఎవరూ పెళ్ళి చేసుకుంటామని ముందుకు రాక వుండిపోతే కుటుంబం మంచిదని, డబ్బులో ఏఁవీలేదని, కొడుకుని వప్పించి ఆ పేదపిల్లనే ఇంటికి కోడలిగా తెచ్చుకున్నాడు. ఆ విషయమంతా మరిచిపోయింది కోడలు. పరాయి వాడికి మొగమాటానికి చూపే కృతజ్ఞతన్నా ఆమెలో లేదు. కొడుకూ సరే సరి!

కొడుకూ కోడలిచేత రోజుకెన్ని మాటలు పడుతున్నాడు తను. ఆకలేస్తే ఆ ఆకలిని చంపుకుని వుండలు చుట్టుకుని చావాలే తప్ప ఆకలని అడగ్గూడదు.

"ఆకలేస్తుంది. అన్నంపెట్టు లక్ష్మి ...." కోడల్ని అడిగితే—

"అప్పుడే తయారయ్యావ్....గంటయ్యింది కావాల తిండితిని....లోకంలో ముసిలోళ్ళందరూ తిండరక్క చస్తుంటే ....ఇరవై నాలుగ్గంటలూ ఆకలని చస్తావ్...." తనని కోడలు సాధింపు.

ఆరోజు తనకి బాగా జ్ఞాపకం వుంది. దగ్గూ, జ్వరంతో శవంలా కదలలేని స్థితిలో విలవిల్లాడుతున్న సమయంలో గొంతెండిపోతుంటే "లక్ష్మి....లక్ష్మి... అని పిలిచేడు తను.

సమాధానం లేదు.

మనవడిని పిలిచేడు. కానీ వాడు విని పించుకోలేదు

ఈ నారి పేగులన్నీ కూడదీసుకుని గట్టిగా పిల్చాడు.

"ఏం....ఎందుకలా చస్తున్నావ్...." గలగలా వచ్చింది లక్ష్మి

"పేగులు తెగిపోతున్నాయి....దగ్గు ....మంచి నీళ్లు...." మెలికతాడులా చుట్టుకుపోతూ అడిగేడు.

"అయ్యో దేవుడా....ఇల్లంతా ఎతుక్కో....ఒక్క చుక్క లేదు....ఎండ లొకటి తినేస్తున్నాయి కొళాయిలు రాలేదు....పనిమనిషిచేత వీధిపంపునుంచి తెప్పిద్దామంటే 'దరిద్రపుగొట్టుది' అది పనెగ్గొట్టింది. పక్కింటికి పంపి ఎవరి చేతైనా తెప్పిస్తా నాగు....దిక్కుమాలిన దగ్గు....నన్ను తినీడానికొచ్చింది గావాల ...." ఆ మాటలనుకుంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది కోడలు. నీళ్లొస్తాయని ఎదురుచూశాడు తను. కానీ గ్లాసెడు నీళ్ళకు దిక్కులేకపోయింది.

"ఈ వెధవ బ్రతుకు బ్రతికేకన్నా.... ఇలాగే గొంతెండి చచ్చినా బావుణ్ను.... పీడ విరగడైపోను...." తన అసమర్థతని తల్చుకొని మెల్లిగా గొణుక్కున్నాడు.

ఆ మాటలు ఎక్కడనుంచి విందో ఏమిటో కోడలు చేతులూపుకుంటూ వచ్చింది.

"ఏవన్నావు ... నేన్చస్తే పీడ విరగడైపోతుందా....అందరికీ నేనే బరువైపోయానా....కోడలని ఆ మాత్రం చూడకండా నోటికెంత మాటొస్తే అంతమాట అనేస్తావా .... నేన్చస్తే....నీ కొడుకుని కూడా నీలాగే ఆడనీడ లేకుండా బ్రతకమన్నావా...." అంటూ ఇష్టం వచ్చినట్టు వాగుతోంది గయ్యాళి కోడలు.

"నిన్నెందుకమ్మా అంటాన్నేను.... ఇంత బాధ భరించేకంటే....మిమ్మల్నందరినీ ఇబ్బంది పెట్టేకంటే నేన్చచ్చినా బావుణ్ణు....నాపీడ మీకుండదనంటున్నాను. ఆ పైవాడు నన్నెంత త్వరగా తీసుకుపోతాడా అని ఎదురుచూస్తున్నానమ్మా....అంతే...."

"ఇంత వయసొచ్చీ మాట మార్చీడం వకటి....అనడం....లేదనడం.... వెధవ బుద్ధి...." ఆ విషయం అక్కడితో ఆగిపోతుందనుకున్నాడు. ఆగలేదు. కొడుకొస్తే చెప్పింది కావాల. తను చెప్పింది ఏమీ వినిపించుకోలేదు తన కొడుకు. మంచీ, మర్యాదా, గౌరవం ఇవేవీ ఆసమయంలోకొడుక్కి గుర్తుకిరాలేదు. 'ముసలాడనే'ధ్యానంకూడా లేకండా ఎన్నిదెబ్బలు కొట్టాడు. రెండుసార్లు చేతితో కొట్టాడు. నేలమీద 'వెల్లకిల' పడిపోయాడు తను. నేలమీద పడ్డవాణ్ణి పైకిలాగి మళ్ళీఇంకో రెండుసార్లు గోడకేసి కొట్టాడు.

మౌనంగా ఆ బాధల్ని భరించడం తప్ప ఏం చెయ్యగలడు తను. "ఏదో కనికరించి కూడెడుతున్నాం....ఇష్టంలేకపోతే బైటకెళ్ళిపో గాని దాన్నేమాత్రం అంటే నేనూరుకోను...." ఆఖరిగా కొడుకు తనకిచ్చిన వార్నింగ్ అది. అప్పణ్ణించే తాను పూర్తిగా మూలన పడ్డాడు.

"తాతా .... తిండికి పిలుస్తోందమ్మ" మనవడి పిలుపుతో ఈ లోకంలోకొచ్చాడు ఆదిమూర్తి.

అప్పటికి బాగా చీకటిపడింది. కొడుకింకా ఇంటికి రాలేనట్టుంది. 'రా

తాతా' అని మళ్ళీ పిలిచి తలుపుచెక్కని పట్టుకుని నిలబడ్డాడు మనవడు.

కడుపులో కరకరమనిఆకలేస్తున్నాది. అయినా మనసులోని బాధ ఆ ఆకల్ని చంపేస్తున్నాది. ఇలాంటి వయసులో ఇలాంటి బాధలు రానేకూడదు. వచ్చాక, ఇలాంటి బాధల్లో బ్రతికేకంటే 'నల్లమందూ, సూనె' కలుపుకుని తాగిచావటం మేలు. అయినా తనకి చావు రాకున్నందుకూ, చావకున్నందుకూ మూలిగాడు ఆదిమూర్తి.

"ఆకలేయడం లేదురా తిననని అమ్మతో చెప్పు" మనవడు పరుగు పరుగున లోనకెళ్ళిపోయాడు.

"తినకపోతే మానీమను ఎవడిమీద కోపం పంచభక్ష్యపరమాన్నాలు కావాల కామోసు" ఆ మాటలు ఆదిమూర్తికి వినబడుతూనే వున్నాయి. కోడలి గయ్యాళితనానికి ఆదిమూర్తికి ఆ సమయంలో జాలివేసింది

అంతవరకూ పడుకొన్నవాడుమెల్లిగా లేచి మూలనున్న చింకిచాప తీసి పరచుకుని మేను వాల్చేడు ఆదిమూర్తి.సన్నగా చలివేస్తోంది. దుప్పటికోసం చేత్తో ఓట్టూ తడిమేడు. తల వెనకాతల మెత్తగా తగిలింది దుప్పటి. విప్పి కప్పుకోబోయిఆగిపోయేడు. ఎన్నాళ్ళబట్టి వుతకలేదో ఆ దుప్పటి కుళ్ళు వాసనవేస్తోంది. ఆ మురికి దుప్పటిని చూస్తుంటే ఆదిమూర్తికివక్కసారి తండ్రి జ్ఞాపకానికొచ్చాడు. తల్లి లేని తనని ఎంత ఇదిగా పెంచేడు. జీవితం చివరి రోజుల్లో వున్న ఎకరన్నర పొలాన్నీ తినేకిచ్చేడు తన పిల్లలచిల్లరి తిరుగుళ్ళు కడతాయని పెళ్ళిచేశాడు. తన నీడలో జీవితపు ఆ చివరి దశని హాయిగా గడపాలనుకున్నాడు.

ఆ రోజు బాగా జ్ఞాపకం వుంది!

బైట చలి!

పాకలో తనూ, కొత్తపెళ్ళాం,కొత్త దుప్పట్లో దూరి వెచ్చగా పడుకున్నారు. పాక ముంజూరులో తండ్రి ఒక్కడూ ఎముకల్ని కొరికే చలిలో కప్పుకోడానికేవీ గుడ్డముక్కైనా లేకుండా వణుకుతూ పడుకున్నాడు.

అర్ధరాత్రెప్పుడో తనని పిలిచాడు.

"ఒరే ఆదీ...ఆదీ. సస్తన్నాను చింకి గుడ్డివ్వరా. సలి సంపెస్తంది. సస్తాను రా"

"సలీలేదూ గాడిద గుడ్డూలేదు మాట్లాడక పడుకో" లోననుంచి తను అరిచాడే తప్ప పెళ్ళాం పక్కలోంచి కదలలేదు.

మర్నాడు ఉదయానికి అంత ఘోరం జరుగుతుందని వూహించనైనా ఊహించలేదు తను. ముసిలిప్రాణం చలి బాధకు తట్టుకోలేక తండ్రి చచ్చిపోయాడు ఆ చచ్చిపోవటానికి కారణం తనుకాదూ.

నిజంగా తనే.

ఆదిమూర్తికి ఒక్కసారి జ్ఞానోదయమైనట్టుంది. నిజమే. తను తన తండ్రి మీద ఏమాత్రం ఆప్యాయత చూపించేడు, ఈనాడు తన కొడుకు తనమీద చూపించడానికి. ఇదింతే. ఈ రివాజిలా సాగిపోవాల్సిందే.

———

నూతన సంవత్సరాన్ని

# ఉజ్వలమైన రీతిలో ప్రారంభించండి!

రేపు మాసపత్రిక చందాదారులుగా చేరడం జీవితాన్ని ఉన్నతంగా రూపొందించే కీలక ఘట్టం! మీరు చందాదారులుగా చేరితే ఈ ప్రత్యేక సందర్భానికి సంకేతంగా ఉజ్వల భవితవ్యానికి నిరంతరం త్రోవచూపే ఈ డైరీ మీకు కేవలం ఉచితంగా లభిస్తుంది.






## ఈ సుందరమైన నూతన సంవత్సర కానుకను స్వీకరించండి!



- ★ ప్రక్కనున్న కార్డుపై సంతకంచేసి మీ చిరునామా స్పష్టంగా వ్రాయండి
- ★ ఈ కార్డును వెంటనే పోస్టుచేయండి. మీరు స్టాంపులు అంటించనవసరం లేదు.
- ★ ఈ కార్డు మాకు చేరగానే మిమ్మల్ని చందా దారులుగా నమోదుచేస్తూ దాదాపు పది రూపాయలు విలువచేసే ఈ డైరీని ఉచితంగా వి. పి. పి. ద్వారా పంపిస్తాము.
- ★ వి. పి. పి. తెచ్చిన పోస్టుమాన్‌కు రేపు చందా నిమిత్తం రు. 25/- చెల్లించి ఈ డైరీని ఉచితంగా స్వీకరించండి
- ★ మీకు 'రేపు' మాసపత్రికను ప్రతినెలా మొదటి వారంలో చేరేలా సంవత్సరంపాటు పంపిస్తాము.

ఇదొక

## అపురూపమైన అవకాశం!




ఏలూరురోడ్
విజయవాడ-520 002.

# జీవితభ్రమణం

శ్రావ్యంగా గొంతెత్తి వీణాసాధన చేస్తూంది త్రివేణి. ఆ గానంలో పూర్తిగా నిమగ్నమయిపోయిన త్రివేణి సర్వం మరచి, అదొక్కటే తన పరమావధిలా రాగాలాపనచేస్తుంది. అలా ఎంతసేపట్నుంచి చేస్తూందో, ఇంకా ఎంతసేపు చేస్తుందో తనకే తెలియనిదానిలా ఏకదీక్షగా సాధన కొనసాగిస్తూంది.

హఠాత్తుగా ఆ మనోజ్ఞగానం ఆగిపోయింది. వీణాతంత్రులు తెగిపోయాయి. త్రివేణి త్రుళ్ళిపడింది. ఆమె మనసులో ఎప్పటికీ మాననిగాయం మళ్ళీ కలుక్కున రేగినట్టయింది.

తన జీవితంలో అతి ముఖ్యస్థానం వీణది. ఆ వీణకీ తన జీవితానికీ ఎంతో దగ్గర సంబంధం ఉందనిపిస్తుంది. ఎన్నో మధుర మంజుల రాగాలు పలికించే వీణ హఠాత్తుగా తెగిపోయినట్టే తనజీవితం కూడా మధ్యలో తగిలిన తట్టుకోలేని ఎదురుదెబ్బతో ఎందుకూ పనికిరానిదయిపోయింది. చివరికి తెగిన వీణలా మూగగా మోడుగా మిగిలిపోయింది.

త్రివేణి లేచి బీరువాలోని కొత్తతీగలు తీసుకొచ్చి వీణకి అమర్చసాగింది. కొత్తతీగలతో వీణకి మళ్ళీ పునర్జీవితం వస్తుంది. కానీ తన జీవితం మళ్ళీ చిగురించడానికి తనకంటూ ఏ కొత్త ఆశలూ మిగలలేదు.

అంతలో "అత్తయ్యా!" అంటూ దడాల్న చేరవేసిన వీధితలుపులు త్రోసుకుంటూ సుడిగాలిలా వచ్చింది శ్రీచరణి.

కూర్చున్న త్రివేణి మెడను వెనుకనుండి రెండుచేతులూ పెనవేసి కౌగిలించుకుంది. "అత్తయ్యా! నీకో మంచివార్త చెప్పనా? అబ్బ నాకీరోజు ఎంత

మాన్యం అచ్యుతలక్ష్మీకుమారి



ఆనందంగా ఉందో తెలుసా?" పట్టలేని ఉత్సాహంతో ఆనందంతో తబ్బిబ్బవుతూ ఆవేశపడసాగింది శ్రీచరణి.

స్తబ్ధతగా కూర్చున్న త్రివేణి శ్రీచరణి రాకతో మళ్ళీ మామూలుగా అయింది. వీణను ప్రక్కనపెట్టి శ్రీచరణి చేతిని పట్టుకుని ముందుకు లాక్కుంటూ "ఏమిటే చరణీ! మరీ అంత పొంగిపోతున్నావు? అదేమిటో కాస్త నిదానంగా చెప్పుమరి?" అంది వాత్సల్యంగా చూస్తూ.

త్రివేణి ఒళ్ళో వాలిన శ్రీచరణి "అదేమిటో చెప్పేయనా అత్తయ్యా? నే నెన్నాళ్ళనుండో ఎదురుచూస్తున్నది, ఆశపడుతున్నది, అదేమిటో నువ్వే చెప్పు చూద్దాం," అంది అల్లరిగా.

"అబ్బ అదేమిటో నాకేం తెలుస్తుంది? చెప్పవే ఆట్టే ఊరించక."

"చెప్పేయనా? చెప్పేస్తున్నాను. రేపు నేను అశోక్‌గారితో కల్సి వాళ్ళ ఎస్టేట్‌కి వెళుతున్నాను." పరవశంగా అంది శ్రీచరణి.

ఉలిక్కిపడింది త్రివేణి. అప్పుడెప్పుడో ఒకసారి శ్రీచరణి తన ఆఫీసర్‌తో కల్సి ఆయన ఎస్టేట్‌కి వెళతానన్నట్టు గుర్తు. కానీ ఆ వెళ్ళడం ఏదో



ఎప్పుడోలే అనుకుంది గాని ఇంతతొందరగానని, ఇంత ఖచ్చితంగా వెళుతుందని అనుకోలేదు. అయినా వెళితేమాత్రం ఈ పిల్లకెందుకింత సంబరం?

"ఆయన వాళ్ళవాళ్ళని చూడ్డానికి వెళుతుంటే కూడా నువ్వెందుకు వెళ్ళాలి చరణీ " అయిష్టంగా చూస్తూ అంది త్రివేణి.

శ్రీచరణి నవ్వింది. "బాగుంది. నువ్వు మరీ అమాయకురాల్లా మాట్లాడుతున్నావేమిటత్తయ్యా? నువ్వు నా ఉద్యోగం ఏమిటో మర్చిపోతున్నావు. మనం అశోక్‌గారి పెర్సనల్ సెక్రటరీలం. అంటే సర్వవేళలా ఆయన్ని వెన్నంటి ఉండాలన్నమాట. అందుకని ఆయనవెంట ఎస్టేట్‌కి వెళ్ళేఛాన్స్ మనకితప్ప ఇంకెవరికీ లేదన్నమాట. తెల్సిందా?" గర్వంగా అంది.

"హు! ఏమిటో ఆడపిల్లకీఉద్యోగం? అయినా ఉద్యోగధర్మంగా ఆయన వెంట వెళుతున్న నీకు ఇంత సంబరం ఎందుకో నాకేం అర్థంకావడం లేదు . ."

తడబడింది శ్రీచరణి. చప్పున ఆమె ఒళ్ళోనుండి లేచి కూర్చుంది. "ఎందుకంటే . ఎందుకంటే?"

"ఎందుకూ?" అనుమానంగా చూస్తూ ప్రశ్నించింది త్రివేణి.

"నాకు ప్రకృతి దృశ్యాలు చూడ్డమంటే ఎంతప్రాణమో నీకూ తెల్సుగా అత్తయ్యా! అందుకే నిజంగా అందుకే నా కంత సరదా!" తన తడబాటు నణచుకుంటూ ఎలాగోలా సర్ది చెప్పేసింది శ్రీచరణి.

"అయితే నువ్వు వెళ్ళక తప్పదంటావా చరణీ?"

"ఎలా తప్పుతుందత్తయ్యా? అసలు నేను వెంట రాకపోతే అశోక్‌గారికి ఆజర్నీ చాలా నిరుత్సాహంగా, నిర్జీవంగా ఉంటుందట." హఠాత్తుగా అనేసిన శ్రీచరణి చప్పున నాలిక్కొరుచుకుని గబుక్కున చూపులు మరల్చుకుంది.

త్రివేణి ఆమెవైపు కలవరంగా చూచింది. "ఏమైనా నువ్వతనితో కల్సి వెళ్ళడం నాకేం బాగనిపించడంలేదు చరణీ!"

"నాకేం భయమత్తయ్యా. నీకు నా మీదున్న అభిమానంవల్ల అలా అనిపిస్తుంది గాని నేనేం పసిదాన్నా?"

"ఏమైనా నువ్వు కత్తిమీద సాములాంటి ఉద్యోగం చేస్తున్నావు చరణీ! వేసే ప్రతిఅడుగూ చాలా జాగ్రత్తగా వేయాలి. ఏ ఉద్యోగధర్మం పేరు చెప్పుకున్నా ఒక ఆడపిల్లా, ఒక మగవాడూ కలసి పనిచేయవల్సి. వచ్చినప్పుడు ఏ క్షణంలో ఏ పరిస్థితి ఏ విధంగా ప్రలోభపడుతుందో, ప్రకృతి ఆకర్షణ ఏ క్షణంలో బానిసలుగా మార్చుకుంటుందో చెప్పలేం."

"అటువంటి ప్రలోభాలు, ఆకర్షణలు నన్నేం చేయలేవు అత్తయ్యా నా సంగతి నీకు తెల్సు. నేను చాలా మొండిదాన్ని. నా మీద నాకు పూర్తిగా నమ్మక ముందత్తయ్యా! అయినా చదువుకున్నదానివి నువ్వుకూడా ఇలా మాట్లాడుతున్నా వేమిటత్తయ్యా?"

"చరణీ! ఆడది చదువుకున్నదైనా చదువుకోనిదైనా మగవాడి సాన్నిధ్యంలో పూర్తిగా కరిగి నీరయిపోతుంది. ఆ బలహీనత ఆడదానికి దేవుడిచ్చిన శాపం. ఇప్పుడాలోచిస్తూంటే మన పూర్వీకులు దూరదృష్టితో చేసిన కట్టుబాట్లే ఎంతో మంచివనిపిస్తూంది. మనం ఇప్పుడు సమానత్వమని, స్వాతంత్ర్యమని అంటూ పురోగమిస్తున్నాం అనుకుంటున్నాంగాని పూర్తిగా మోసపోతున్నాం. స్త్రీ పురుష సమానత్వం, నాగరికత వెల్లితలలు వేసి ప్రేమ పేరిట నాశనమవుతున్న స్త్రీలు ఆ రోజుల్లో నూటికొక్కరైనా ఉన్నారంటావా చరణీ?"

"అత్తయ్యా! మళ్ళీ మొదలుపెట్టావా? అసలు స్త్రీలలోగాని, పురుషుల్లో గాని వివేకులు, అవివేకులు ఆ రోజుల్లోనూ ఉన్నారు, ఈ రోజుల్లోనూ ఉన్నారు. అమాయకులు జీవితంలో ఎదురుపడ్డ అఘాతాలకి తట్టుకోలేక కాలానికి తలవంచి కాలప్రవాహంలో కొట్టుకుపోతారు. కానీ వివేకులు, ఆత్మబలం కలవాళ్ళు అఘాతాలని ధైర్యంగా ఎదుర్కొని కాలానికి ఎదురీది నిలదొక్కుకుని తమ ధ్యేయాన్ని నెరవేర్చుకుంటారు. నీ జీవితంలో ఎదురుపడ్డ అనుభవాలు నా విషయంలో నిన్నలా భయపెట్టున్నాయిగాని, నాకేం కాదు అత్తయ్యా! నేను ధైర్యంగా, నీకు నచ్చేవిధంగా నా జీవితాన్ని తీర్చిదిద్దుకుంటాను. సరేనా?"

"నిజమే చరణీ! నా భయాలు నావి. ఒకప్పుడు మీ అమ్మకూడా నువ్వన్న విధంగానే అంటూండేది కానీ . కానీ ... చివరికి. "

"అబ్బ అత్తయ్యా! మనసుకి కోత పెట్టే గతాన్ని గుర్తుచేయకు. గుర్తుచేసుకోకు. నేనుఅమ్మలాంటి అమాయకురాలినీకాదు. పిరికిదాన్నీకాదు. పోనీ, అత్తయ్యా! ఒకటి చెప్పు. నీకు నా మీద నమ్మకం ఉందా లేదా? మనస్పూర్తిగా చెప్పు."

"ఉంది చరణీ! ఉండబట్టేగదా నీ ఇష్టమొచ్చిన ఉద్యోగం చేస్తున్నా నేనేం అడ్డుచెప్పలేకపోయాను."

"అదే నమ్మకం ఇకమీదట కూడా ఉంచుకుని నన్ను ఎస్టేట్‌కి వెళ్ళనీ అత్తయ్యా!" బ్రతిమాలుతున్నట్టుగా అంది శ్రీచరణి.

"నీ మనసుని నిరుత్సాహపరచడం కూడా నా కిష్టంలేదు చరణీ! అలాగే వెళ్ళిరా. అన్నిటికీ ఆభగవంతుడే ఉన్నాడు." అయిష్టంగానే ఒప్పుకుంది త్రివేణి.

"మా మంచి అత్తయ్య" శ్రీచరణి ఆనందంగా త్రివేణిని కౌగిలించుకుని బుగ్గమీద ముద్దు పెట్టుకుంది.

"ఛీ! పాడుపిల్లా! నీతో ఏదొచ్చినా పట్టలేం." చిరుకోపంగా ఆమెని వదిలించుకుని బుగ్గ తుడుచుకుంది.

"అత్తయ్యా! ఈ రోజే నీ చేతివంట కరువుతీరా తినాలి. మళ్ళీ ఎప్పు డొచ్చి తింటానో ఏమో! కొబ్బరిసాంబారు. పొటోటో చిప్స్ చేయి ఈ రోజు అన్నంలోకి." అంది ఉషారుగా శ్రీచరణి.

"అలాగే!" ముసిముసిగా నవ్వింది త్రివేణి.

"త్వరగా చేయాలిమరి. ఆకలి మండిపోతూంది. రేపుదయమే ప్రయాణం. నేను వెళ్ళి బట్టలవీ సర్దుకుంటాను. వంటకాగానే పిలువ్," అంటూ తన గదిలోకి చిన్నగా పసిపిల్లలా గెంతుకుంటూ వెళ్ళింది శ్రీచరణి.

వెళుతున్న ఆమెవంక చూస్తూ నిట్టూర్చింది త్రివేణి. "పిచ్చిపిల్ల! జీవితం గురించి ఇంతకంటే ఇంకెలా చెప్పాలో తెలియడంలేదు తనకు. ఇంకా ఎక్కువగా చెప్తే సున్నితమైన చరణిమనసు నొచ్చుకుంటుందేమో! భగవాన్! నువ్వే కాపాడాలి ఈ పసిదాన్ని." అనుకుంటూ వంటఇంటివేపు దారితీసింది.

## 2

బీరువా మీదనుండి సూట్‌కేస్ తీసి మంచంమీదకి గిరవాటు వేసింది శ్రీచరణి. హుషారుగా ఈలవేసుకుంటూ బీరువాతెరిచి కొన్నిచీరలు, బ్లవుజులూ ఎంచుకుని మంచంమీద పడేసి బీరువాతలుపు మూసింది. బీరువా తలుపుకున్న నిలువుటద్దంలో ఉన్న శ్రీచరణి ప్రతిబింబంకూడా హుషారుగా ఈలవేస్తూంది.

"ఏయ్ రౌడీపిల్లా! మగరాయుడిలా ఈలవేస్తున్నావా? ఉండు అత్తయ్యతో చెప్తాను." అంది తమాషాగా శ్రీచరణి అద్దంలో కన్పిస్తున్న శ్రీచరణితో. శ్రీచరణికి ఆనందం, హుషారు బాగా అధికమించినపుడు ఇలా తన ప్రతిబింబంతో తనే మాట్లాడుకుంటూ ఉంటుంది అప్పుడప్పుడు.

"నిజంగా నీకంతగా ఆకలి మండిపోతుందా? ఇప్పుడేగా హోటల్ తాజ్ మహల్లో అశోక్‌తో కల్సి పీకలదాకా మెక్కివచ్చావ్? అశోక్ ఇచ్చిన వీడ్కోలు బహుమానాన్నికూడా తీసుకొచ్చావ్?" అద్దంలో శ్రీచరణి చిలిపిగా నవ్వించింది.

అప్రయత్నంగా శ్రీచరణి చేయి బుగ్గను తుడుచుకుంది. ఇంకా అక్కడ

అశోక్ అధరాల ముద్ర ఉన్నట్టేననిపించి మొహం సిగ్గుతో ఎరుపెక్కింది. ఏదో మధురూహ గుండెను ఝల్లుమనిపించగా.

"ఛీ! పో! నీతో మాట్లాడను." అని అద్దంలో శ్రీచరణితో చెప్పేసి వెను దిరిగి బుద్ధిగా చీరలన్నీ చక్కగా మడతపెట్టి మంచంమీద పెట్టి చేతితో సాఫుగా సరిచేసుకుంటూంది. ఇందాక అత్తయ్యతో అన్నమాటలు జ్ఞాపకమొచ్చి తనలో తను నవ్వుకుంది.

"పిచ్చి అత్తయ్య! తనకు నిజంగా ఆకలనుకుని పాపం ఆ వంటింట్లో తన కోరికలు తీర్చడానికి ఎంత హైరానా పడుతుందో ఏమిటో. ఏ విషయం గురించి ఎంతతీవ్రంగా మాట్లాడుతున్నా తనకు ఆకలనగానే చప్పున ఆవాదనలా ఆపేసి తన ఆకలి తీర్చడం కోసం తాపత్రయ పడుతుంది. తనకి అమర్చి పెట్ట డమే ఆమె కానందమట. నిజంగా అత్తయ్యకి తనంటే ఎంత ప్రేమో.

అత్తయ్య తనకి తల్లీతండ్రే కాదు, ప్రాణస్నేహితురాలు కూడా. చిన్నప్పటినుండీ ఆమెనుండి ఏ చిన్నవిషయం తనెప్పుడూ దాచలేదు. మనసు విప్పి అన్నీ చెప్పుకునేది. కానీ ఇప్పుడింత పెద్దవిషయం ఆమెకి చెప్పకుండా దాచినందుకే చాలా బాధగావుంది. నిజంగా చెప్పేస్తే ఇంకేమైనా ఉందా? తన నసలు ఒక్కడుగుకూడా ముందుకి వేయనిచ్చేదా? వెంటనే ఉద్యోగం మానిపించి ఇంట్లో కూర్చోపెడుతుంది. ఆమె భయాలు ఆమెవి మరి. అత్తయ్య జీవిత విశేషాలేమిటో తనకు తెలియవుగాని మొత్తానికి ఆమెకూడా జీవితంలో దగా పడిన వ్యక్తేనన్పిస్తూంది.

కాని తను అటువంటి దగాకి ఎప్పుడూ లోనుకాదని అత్తయ్యకి నిరూ పించాలి. తన ఎంపిక సరైనదని అత్తయ్య గర్వపడాలి. తన అశోక్ ఎప్పటికీ అత్తయ్య ఊహల్లోలాంటి దగా మనిషికాదు. అసలు అతని తల్లిదండ్రులకి తనని పరిచయం చేయడానికే ఎస్టేట్ తీసుకువెళుతున్నాడు. తను అటునుంచి అశోక్‌తోసహా తిరిగొచ్చి అత్తయ్యకతన్ని చూపించి ఈ విషయం చెప్పి సర్ప్రయిజు ఇవ్వాలి. అత్తయ్య ఆనందంలో తబ్బిబ్బవాలి. తన చేతుల్లో పెరిగిన మొక్క మహోన్నతశిఖరాన్ని అందుకుందని గర్వంతో ఉప్పొంగిపోవాలి.

ఊహల్లో తేలిపోతున్న శ్రీచరణి చీరలన్నీ ఒక్కొక్కటిగా సూట్ కేస్‌లో సర్ది పెట్టి మూసేయబోయింది. అంతలోనే ఏదో గుర్తొచ్చినట్టు హ ఠాత్తుగా జాకెట్‌లోనుండి ఒక ఫోటోని తీసి ఎంతో మురిపెంగా, కళ్ళుతిప్పుకోలే నట్టుగా చాలాసేపు చూస్తూండిపోయింది. ఆ ఫోటో ఇందాక అశోక్ బెడ్

రూమ్‌లో అతని బట్టలు సర్దుతున్నప్పుడు, బీరువాలో అడుగున పడిఉన్న ఆల్బమ్‌లో దొరికింది. మూడేళ్ళ పసివాడిగా ఉన్నప్పటి అశోక్ ఫోటో అది. కావాలని ఎంతో ముచ్చటగా అడిగి తీసుకుంది తను.

ఉంగరాల జుట్టుతో, పెద్దపెద్ద కళ్ళతో, కొాపేరులాంటి ముక్కుతో, యాపిల్‌లాంటి అందమైన బుగ్గలతో అచ్చం బొమ్మలా ఎంత ముద్దొస్తున్నాడు అశోక్! అప్పుడతని తల్లితండ్రులు అతన్ని ఒక్క క్షణంకూడా క్రిందికి దింపి ఉండరు. అటువంటి బంగారు బొమ్మలాంటి బిడ్డని చూసుకుని ఎంత అపురూపంగా భావించుకుని మురిసిపోయేరో. అంత అందమైన అశోక్ ఇప్పుడు తనవాడవుతున్నాడు. తను జీవితమంతా పరవశించిపోతూ మురిసిపోతూ ఆడుకోడానికి తనలాంటి, అచ్చు ఈ ఫోటోలో ఉన్నలాంటి బాబుల్ని తనకిస్తాడు.

అనుకోకుండా వచ్చిన ఆ ఊహతో శ్రీచరణి మొహమంతా ఎఱ్ఱగా మందారంలా తయారయింది. బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి పాకిపోయింది. అందమైన చిరునవ్వుతో పెదాలు విచ్చుకున్నాయి.

"ఏమిటే నీలోనువ్వే తెగ నవ్వేసుకుంటున్నావు. వంటయింది. అన్నానికి రా!" అంటూ వచ్చింది త్రివేణి.

"ఆఁ! వస్తున్నాను." తడబడుతూ ఆ ఫోటోను దాచేయబోయింది శ్రీచరణి. కానీ అప్పటికే త్రివేణి చూపులు ఆ ఫోటోను పసిగట్టేసేయి.

"ఏదో ఫోటోలాగుంది. చూడనివ్వు." అంటూ ఆమె చేతిలో ఫోటో అందుకుంది త్రివేణి. యథాలాపంగా ఆ ఫోటోను చూచిన త్రివేణి కళ్ళు ఉలిక్కిపడి మళ్ళీ అంతలోనే ఆ ఫోటోను అకట్టేసుకున్నట్టు ఆ ఫోటోలో అతుక్కుపోయాయి.

హఠాత్తుగా స్థాణువై పోయిన త్రివేణి శిలలా బిగుసుకుపోయింది. ఆమె గుండె లయ తప్పినట్టయింది. తలలో హోరు, నిలువెల్లా కంపనం ప్రారంభమైంది. ఏదో మైకం కమ్ముతున్నదానిలా పక్కకి ఒరిగిపోతూ మంచం కోడును ఆసరా చేసుకుంది. అంతలో "అత్తయ్యా!" అంటూ శ్రీచరణి పట్టుకోవడంతో పడిపోకుండా నిలదొక్కుకుంది. శ్రీచరణి పిలుపుతో, ఆమె స్పర్శతో బాహ్యస్మృతికి వచ్చిన త్రివేణి మంచంమీద కూర్చుంది.

"ఏంలేదమ్మా! కాస్త కళ్ళు తిరిగినట్టుంటేను! కొంచెం మంచినీళ్ళందుకో" అంది హీనంగా. శ్రీచరణి గబగబా మంచినీళ్ళుతెచ్చి ఇచ్చింది. వాటిని గడగడ తాగేసి గ్లాసు పక్కన పెట్టింది త్రివేణి.

"చరణీ! ఈ ఫోటో నీ కెక్కడిదమ్మా?" కంపిస్తున్న స్వరంతో మెల్లగా ఎంతో ఆందోళనని దాచుకుంటున్నదానిలా అడిగింది.

"ఇది అశోక్ గదిలో దొరికింది అత్తయ్యా! ఈ ఫోటో అశోక్ చిన్నప్పటిదట." ఆశ్చర్యంగా చూస్తూ చెప్పింది శ్రీచరణి.

"అశోక్‌దా? నిజంగా అశోక్‌దేనా?" త్రివేణి గుండెల్లో పట్టలేని ఉత్కంఠతో వొణుకుతున్న గొంతుతో అడిగింది.

"నిజంగా అశోక్‌దే అత్తయ్యా! ఆ సంగతి అశోకే స్వయంగా నాతో చెప్పేడు."

"అశోక్! అశోక్!" త్రివేణి పెదిమలు అస్పష్టంగా కలవరించేయి. కళ్ళు గట్టిగా మూసుకుంది. ఆమె కళ్ళనుండి వేడి కన్నీరుబొట్లు చెంపల మీదుగా వర్షించేయి.

"అత్తయ్యా! ఏమిటి? ఏమైంది నీకు?" శ్రీచరణి ఆతృతగా ఆమెని పట్టుకుని కుదుపసాగింది.

రెండు క్షణాల తరువాత మెల్లగా తేరుకుంది త్రివేణి.

"ఏం కాలేదమ్మా! కాస్త తల తిరుగుతున్నట్టుంది. నేను విశ్రాంతి తీసుకోవాలి. నన్నేం మాట్లాడించకు," అని చెప్పేసి మనిషంతా వొణుకుతున్నట్టు నడుస్తూ తన గదిలోకెళ్ళిపోయి తలుపేసుకుంది త్రివేణి. అశోక్ ఫోటో ఆమె చేతిలోనే ఉండిపోయింది. వెళుతున్న ఆమెవంక అవాక్కయిపోయి చూస్తూ నిలబడిపోయింది శ్రీచరణి.

ఇంతలోనే అత్తయ్యకేమైంది? మనసుకి గాని, శరీరానికి గాని ఏ బాధ కలిగినా ఎప్పుడూ తనతో చెప్పకుండా ఉండేదికాదే. తన భోజన విషయంలో ఏ మాత్రం అశ్రద్ధ చూపకుండా తను సరిగా తినదని ఆతృతపడే అత్తయ్య తనని భోజనానికి పిలవడానికొచ్చి అంతలోనే అలా అయిపోయిందేమిటి? అసలు తను భోజనానికి పిలవడానికి కొచ్చిన సంగతే మర్చిపోయినట్టుగా అలా వెళ్ళిపోయిందేమిటి? ఆ ఫోటోను చూచే అలా మారిపోయుంటుంది. అసలు అత్తయ్యకి చిన్నపిల్లలన్నా, చిన్నపిల్లల ఫోటోలన్నా మహాపిచ్చి. అయితేమాత్రం ఇంతగా ఎప్పుడూ అలా అయిపోలేదే. రేపు తన ప్రయాణం సంగతి ఏమవుతుందో? అత్తయ్యకి హఠాత్తుగా వచ్చిన మనస్తాపమో, అనారోగ్యమో తన ప్రయాణానికి అవాంతరం కలిగించదుకదా! జరిగేదంతా ఎంతో చిత్రంగా, చెప్పలేనంత ఆశ్చర్యంగా అన్పించిన శ్రీచరణి కళ్ళు వెడల్పు చేసుకుని చిత్తరువులా ఉండి

పోయింది. త్రివేణి ఒకవిధంగా బాధపడితే, శ్రీచరణి ఇంకోవిధంగా మనసులో చికాకుపడింది. మొత్తంమీద వంటింట్లో వండినవంటకాలు వండినట్టే ఉన్నాయి. శ్రీచరణి రేపేం జరగనున్నదో ననుకుంటూ నిండా దుప్పటి ముసుగేసుకుని పడుకుంది.

తూరుపు తెలతెల్లవారుతూంది. పూజగదిలోనుండి త్రివేణి కంఠం సుప్రభాతాన్ని రాగయుక్తంగా ఆలాపిస్తూంది. మెల్లగా కళ్ళు విప్పింది శ్రీచరణి. అలా నిద్రమంచంమీద ప్రశాంతంగా మెలకువా నిద్రా కాని స్థితిలో నుండి అలా సుప్రభాతాన్ని వింటూ పూర్తి మెలకువలోకివచ్చి సుప్రభాతం పూర్తయేవరకూ అలా పడుకుని వినడం శ్రీచరణికెంతో ఇష్టం. అసలు ఆ భక్తిగీతంలోని పవిత్రత త్రివేణి కంఠంనుండి వెలువడ్డంలో వెయ్యింతలైనటుగా అన్పిస్తుంది.

"చరణీ! చాలా పొద్దుపోయింది. ఊరెళతానన్నదానివి ఈ రోజుకూడా ఇంత మొద్దునిద్రపోతే ఎలా?" అంటూ వచ్చింది త్రివేణి.

శ్రీచరణి ఆమె మొహంవంక తేరిపార జూచింది. పట్టుచీరలో నుదుటన పెట్టుకున్న పెద్దకుంకుమ బొటుతో, జారుగా వేసుకున్న ముడిలోనుండి తొంగి చూస్తున్న పూజాకుసుమంతో, మొహంమీద ఆభరణంలా వెలుగుతున్న చిరునవ్వుతో ఎప్పటిలాగే తనను నిద్రలేపడాని కొచ్చింది త్రివేణి.

ఆమెనలా చూడగానే శ్రీచరణికి రాత్రి తన నావరించిన నిరుత్సాహమంతా ఎగిరిపోయి ఒక్కసారిగా ఎక్కడలేని హుషారువచ్చినట్టయింది.

"హాయ్ అత్తయ్యా! గుడ్‌మార్నింగ్!" అంటూ ఒక్కుదుటున లేచి త్రివేణి మెడచుట్టూ చేతులువేసింది,

"అత్తయ్యా! అబ్బ నా కిప్పుడెంత హాయిగా ఉందో తెలుసా? రాత్రి నీ వాలకానికి ఎంత భయపడిపోయానో, మళ్ళీ మా అత్తయ్యని మామూలుగా చెయ్యి దేవుడా అని ఎంతమంది దేవుళ్ళకి మొక్కుకున్నానో " కళ్ళు గుండ్రంగా తిప్పుతూ చిన్నపిల్లలా అంది శ్రీచరణి.

"ఎంతమంది దేవుళ్ళకి మొక్కుకున్నావే?" నవ్వుతూ అడిగింది త్రివేణి ఆమెను ఆప్యాయంగా నిమురుతూ.

"అబ్బో! మన హిందూదేవుళ్ళని ఇప్పుడు లెక్కపెట్టాలంటే అయ్యేపని కాదులే. సరేగాని రాత్రెందుకలా హఠాత్తుగా మారిపోయావత్తయ్యా" రాత్రంతా నిద్రలేనట్టుగా స్పష్టంగా చెబుతున్న త్రివేణి ఎర్రబడ్డ కళ్ళనూ,

పీక్కుపోయి నీరసంగా కన్పిస్తున్న ఆమె మొహాన్ని చూస్తూ అడిగింది శ్రీచరణి.

"ఏం లేదుచరణీ! రాత్రే చెప్పేనుగా ఒంట్లో బాగుండలేదని. పిచ్చిపిల్లవి రాత్రి నువ్వుకూడా ఏం తినకుండా పడుకుండిపోయావు. పర్లే పద స్నానంచేసి టిఫిన్ చేద్దువుగాని. నువ్వు వెళ్ళడానికి టైమ్ కావడంలేదూ?"

"ఔనౌను. పద అత్తయ్యా! టైమ్ప్రకారం రాకపోతే అశోక్ అస లూరుకోడు." గబగబా బాత్రూమ్వైపు కదిలింది శ్రీచరణి. ఆమెననుస రించింది త్రివేణి. మాటిమాటికీ శ్రీచరణి నోటినుండి అశోక్ పేరు వినాలని, అలా ఆమె అంటూంటే ఎంతో వినసొంపుగా ఉన్నట్టుగా అన్పించింది త్రివేణికి.

శ్రీచరణి స్నానం, అలంకరణ పూర్తిచేసుకుని ఆదరా బాదరా టిఫిన్ [illegible]స్తూండగా ఇంటిముందు కారాగిన శబ్దం విన్పించింది. "అత్తయ్యా! కారొచ్చే సింది!" అంటూ కంగారుగా లేచి చెయ్యి కడిగేసుకుంది.

"అయ్యగారు మిమ్మల్ని తొందరగా తీసుకురమ్మంటున్నారండీ!" అంటూ లోపలికొచ్చేడు కారు డ్రయివరు.

"ఇదో వచ్చేస్తున్నాను," అంటూ "అత్తయ్యా! అత్తయ్యా! నేను వెళు తున్నానత్తయ్యా!" అంటూ త్రివేణి గదిలోకి చూస్తూ కేకవేసింది శ్రీచరణి.

"కాస్త నిలబడవమ్మా! ఏమిటలా నిప్పులమీద ఉన్నట్టు గెంతుతున్నావ్?" అంటూ వచ్చింది త్రివేణి చేతిలో ఏదో బరువైన కవరుతో.

"అశోక్ కోప్పడతాడత్తయ్యా!"

"అశోక్ అంత కోపిష్టిమనిషా? చీటికిమాటికి అగ్నిహోత్రుడిలా మండి పడుతుంటాడా?" చిన్నగా నవ్వుతూ అడిగింది త్రివేణి.

"కాదత్తయ్యా! చాలా మంచిమనిషి. అనుకున్నది జరక్కపోతే మాత్రం అతనంత కోపిషి మనిషి ఇంకెవరూ ఉండరు. కానీ ఒక్కోటైములో ఎంత ఆగ్రహం చూపిస్తాడో, కరినం వహిస్తాడో తరువాత మళ్ళీ అంత మృదువుగా మారిపోతాడు. కొత్తవాళ్ళెవరైనా అతని కోపం చూస్తే చండశాసనుడను కుంటారు. కానీ అతని మనసు నవనీతంలాంటి దత్తయ్యా!" అశోక్ గురించి చెబుతున్న శ్రీచరణి కళ్ళు తమాషాగా మెరవసాగాయి.

ఆసక్తిగా వింటున్న త్రివేణి కంఠం నిండా చెప్పలేనంత కుతూహలాన్ని నింపుకుంటూ "అతను చూపులకెలా ఉంటాడు చరణీ?" అని అడిగింది.

"రాజాది రాజులా అంతెత్తుగా, బలంగా, తెల్లగా అచ్చు హిందీ హీరో రాజేంద్రకుమార్‌లా ఉంటాడత్తయ్యా! ఒకసారిచూస్తే ఆడవాళ్ళయినా, మగ వాళ్ళయినా అతన్ని జన్మలో మర్చిపోలేరత్తయ్యా!" అశోక్‌ను వర్ణించడంలో తన తొందరని మర్చిపోయిన శ్రీచరణి ఆరాధనగా అంది.

"అలాగా?" బుగ్గన చేయిచేర్చుకున్న త్రివేణి ఏదో ఆలోచనలో పడి పోయినట్టు పరధ్యానంగా అంది.

"అతన్నోసారి మనింటికి తీసుకురాగలవా చరణీ?"

"ఇప్పుడా? వీలుకాదత్తయ్యా! మేం ఎస్టేట్ నుండి వచ్చేక తప్పకుండా తీసుకొస్తాను. అతనికి అనుకున్నది టైమ్‌ప్రకారం జరిగిపోవాలి. అనుకున్న ప్రయాణం ఏ కాస్త ఆలస్యమైనా అతనూరుకోడు. అతని పద్ధతది."

"సర్లే చరణీ! అదీ మంచిదే. మీరు తిరిగొచ్చేకే తీసుకురా! అసలు నన్ను చూడ్డానికతను ఇష్టపడతాడో లేదో!" భారంగా నిట్టూర్పుతూ అంది త్రివేణి.

"అటువంటి గర్వం అతనికెప్పుడూ లేదత్తయ్యా! తనను చూడాలను కున్నవాళ్ళని అతను తప్పకుండా కలుసుకుంటాడు."

"అమ్మగారూ! అయ్యగారు కోప్పడతారు. లేటయిపోతూంది." డ్రయివరు తొందరచేశాడు.

"ఆఁ వచ్చేస్తున్నాను. వస్తానత్తయ్యా!" చెప్పులేసుకుంటూ హఠాత్తుగా త్రివేణి చేతిలోని కవరు వంక చూస్తూ "ఏమిటిదత్తయ్యా?" అనడిగింది.

"ఇదా? ఇది ఇది " ఏం చెప్పాలో తెలియనట్టు తడబడింది త్రివేణి.

"ఓ తెల్సిందత్తయ్యా! నీకూ రచయిత్రి కావాలనే బుద్ధిపుట్టినట్టుంది," అంది శ్రీచరణి నవ్వుతూ.

"ఆఁ ఆ! ఔను చరణీ! కథరాశాను. నీకు జర్నీలో కాలక్షేపంగా ఉంటుంది. చదువుతావా?"

"ఓ తప్పకుండా? నేను చదవకుండానా? నీ కథచదివే మొదటి పాఠకురాల్ని నేనే." అంటూ ఆమె చేతిలోని కవరు తీసుకుని హేండ్‌బేగ్‌లో వేసుకుంది శ్రీచరణి.

"మరి వెళ్ళొస్తానత్తయ్యా!"

"వెళ్ళిరా చరణీ! నీ రాక కోసం ఒళ్ళంతా కళ్ళుచేసుకొని ఎదురు చూస్తుంటా." దిగులుగా అంది త్రివేణి.

"పిచ్చి అత్తయ్యా! నేను తప్ప లోకమే లేదు నీకు." ప్రేమగా అంటూ వెళ్ళి కార్లో కూర్చుంది శ్రీచరణి.

కారు స్టార్ట్ అయి కనుమరుగయి పోయేవరకూ చూస్తూ చెయ్యి ఊపుతూ వీధిగుమ్మంలో నిలబడి వుంది త్రివేణి. ఆమె మెదడులో లక్ష ఆలోచనలు, కోటి సందేహాలూ జోరీగల్లా ముసురుకుంటున్నాయి.

## 3

"చరణ్! ఏమిటింతలేటు? ఈ వేళకి మనం కనీసం పదిమైళ్ళయినా చేరుకునుండవల్సింది" వీధివరండాలో నిలుచున్న అశోక్ కారు దిగి మెట్లెక్కి పైకి వస్తున్న శ్రీచరణితో టైమ్‌చూసుకుంటూ విసుగ్గా అన్నాడు.

"సారీ సర్! అసలు నిద్రలేవడమే లేటయిపోయింది."

"ఇదిగో చరణ్! మనం ఇద్దరం మాత్రమే వున్నప్పుడు సార్, గీర్ అని అనొద్దన్నానా?"

"సారీ అశోక్! అలవాటయిపోయింది." నవ్వుకుంటూ లోపలి కొచ్చింది శ్రీచరణి. ఆమె వెనుకే లోపలికొచ్చాడు, అశోక్. డ్రయివర్ అశోక్ సూట్‌కేస్ కార్లో సర్దసాగేడు.

అశోక్ శ్రీచరణి వంక పరిశీలనగా దృష్టి తిప్పుకోలేనట్టుగా చూడసాగాడు.

"ఏమిటలా చూస్తున్నారు? తను కట్టుకున్న సాదా వుల్‌వాయిల్ చీరవంక సిగ్గుపడుతున్నట్టుగా చూసుకుంటూ అంది శ్రీచరణి

"యూ ఆర్ వెరీ నైస్! అండ్ బ్యూటిఫుల్!"

"మీరేం వెక్కిరించ నక్కర్లేదు. మీలాంటి జమీందార్లు ధరించే వజ్రాలనగలు పట్టుచీరల్లోని అందం మాకెలా వస్తుంది?" చురచుర చూస్తూ అంది శ్రీచరణి.

"అరే! నిజం చెప్పినా నమ్మవేమిటి? కావాలంటే నా కళ్ళు పెట్టుకుని చూడు. అయినా చూడు చరణ్! వజ్రాల నగలు, పట్టుచీరల్లో అందం నా కెప్పుడూ కన్పించదు. మనిషి మనో నైర్మల్యం మొహంలో కన్పించటమే అసలైన సౌందర్యం. మనిషికి సౌందర్యాన్నిచ్చేది ఆ మనిషి తాలూకు సంస్కారం, సత్ప్రవర్తనే. నేను ఇష్టపడే ఆ సౌందర్యమే నీలో నాకెప్పుడూ కన్పిస్తుంది.

అతని మాటలకి శ్రీచరణి మొహం ప్రసన్నంగా తయారయింది. "మగవాళ్ళు ఆడవాళ్ళని బుట్టలో వేసుకోడానికి ఈ పొగడ్తలుకూడా ఒకవిధంగా ఉపయోగిస్తారట. మా అత్తయ్య చెప్తుంది. నేనేం మీ బట్రాజు పొగడ్తలకి పొంగిపోనులెండి. పదండి! పదండి. ఇప్పటికే లేటయిపోయిందన్నారు."

"బాప్‌రే! నీతో ఏదన్నా చిక్కే నే! సర్లే ముందాగదిలోకెళ్ళి నీ చీర మార్చి అక్కడున్న చీర కట్టుకుని రా. అదిగదిగో మళ్ళీ మొహం కోపంగా

మారిపోతూంది. నిన్ను చీర మార్చుకోమంటున్నది నాకోసంకాదు. అక్కడున్న అందరికీ, మాఅమ్మా నాన్నగార్లకీ నువ్వు కాబోయే నాభార్యగా కా_స్తహుందాగా కన్పించాలని, అంతే "

"మీ భార్యని అయిన తరువాత అవన్నీ. ఇప్పుడు మాత్రం నన్ను నన్నుగానే ఉండనివ్వండి. మీ భార్యని కాకముందు నేను అతి సామాన్యమైన దాన్నని చెప్పుకోడానికి నేనేం కించపడటంలేదులెండి." అభిమానంగా మొహం ఎఱ్ఱగా చేసుకుంటూ అంది శ్రీచరణి.

"నువ్వు చండిక అంత మొండిదానివి. నీతో ఎలా వేగాలో ఏమిటో "

"నాతో వేగమని నేను మిమ్మల్ని బలవంత పెట్టలేదే "

"అబ్బ ! ఎంత అభిమానం ! అందమైన ఆడపిల్లకి అభిమానం, రోషం ఇంకా అందాన్ని తెచ్చిపెడతాయి. సరే పద పద," అంటూ ఆమె చెయ్యి అందుకో బోయాడు అశోక్.

చప్పున అతని చేతిని విదిలించుకుంటూ, "నేనేం గుడ్డిదాన్నీ చొట్టదాన్నీ కాదు. నడవగలను పదండి," అంది శ్రీచరణి.

"మైగాడ్ ! అదంతా నామీద అలుకే !" నవ్వేడు అశోక్.

డ్రయివింగ్ సీట్లో అశోక్, అతని ప్రక్కన అతనికి ఎడంగా కిటికీకి దగ్గరగా మూతిముడుచుకుని శ్రీచరణీ కూర్చున్నారు. కారు స్టార్ట్‌చేశాడు అశోక్.

కారు బయలుదేరుతున్నంతసేపూ అశోక్ తమ ఎస్టేటుగురించీ, అక్కడున్న పరివారంగురించీ, అక్కడ విశ్రాంతి తీసుకుంటున్న తన తల్లిదండ్రులగురించీ ఒకటొకటే మెల్లగా చెప్తున్నాడు. శ్రీచరణి ఊ, ఆ అనకుండా మౌనంగా కూర్చుంది. ఆమె మౌనం అశోక్‌కీ చిరాగ్గా అన్పిస్తుంది. అసలు శ్రీచరణితో హుషారు వచ్చినపుడు చిన్నపిల్లలా ఎంత గల గలా మాట్లాడేస్తుందో ఆగ్రహంవచ్చినప్పుడు అంత మౌనం వహిస్తుంది.

కారు సిటీనిదాటి చాలా దూరం వచ్చేస్తూంది.

హఠాత్తుగా కారు సడన్ బ్రేక్ వేసి ఆపాడు అశోక్. తూలి పడబోయిన శ్రీచరణి నిలదొక్కుకుని అర్ధంకానట్టు అతనివంక చూడసాగింది.

"అబ్బా !" అంటూ అశోక్ గుండెను చేత్తోఅదుముకుంటూ కళ్ళుమూసుకుని సీటుమీద వెనక్కి వాలిపోయాడు.

"ఏమైంది అశోక్ !" ఆతృతగా అతనికి దగ్గరగా జరుగుతూ అడిగింది శ్రీచరణి.

"గుండెల్లో ఏదో విపరీతమైన నొప్పి ప్రారంభమైంది చరణ్! అబ్బ, భరించలేక పోతున్నాను." విలవిల్లాడిపోతున్నాడు అశోక్.

"అశోక్! అశోక్!" గాభరాగా పిలుస్తూంది శ్రీచరణి.

"మైగాడ్! అబ్బా! నేనేదో అయిపోతున్నాను. నన్ను వెంటనే దయచేసి హాస్పిటల్‌కి తీసుకువెళ్ళు చరణ్! బ్రతకనేమోననిపిస్తుంది చరణ్! ఈ నొప్పి నన్ను ప్రాణం తీసేస్తూంది." గిజగిజ తన్నుకుంటున్న అశోక్ హఠాత్తుగా స్పృహ తప్పిపోయినవాడిలా ఉలుకూపలుకూ లేకుండా వేళ్లాడిపోయాడు.

అతని బాధ చూడలేకపోతున్న శ్రీచరణికి ఏడుపు వచ్చేస్తూంది. నీళ్ళునిండిన కళ్ళతో "భగవాన్! ఇప్పుడెలా? అశోక్! అశోక్! ఒక్కసారి ఇటు చూడు అశోక్!" దాదాపు ఏడుస్తూ అతనిగుండెలమీద చేత్తో తడుముతూ అతని మొహాన్ని ఇటూ అటూ ఊపుతూ పిలుస్తూంది.

హఠాత్తుగా ఆమె పెదిమలను రెండుబలమైన పెదిమలు బల్లూకపు పట్టు పట్టేశాయి. రెండుబాహువులు ఆమెను ఊపిరాడకుండనంత గట్టిగా పెనవేశాయి. ఆతొామయంలోపడిపోయినా శ్రీచరణి జరుగుతున్నదేమిటో తెలుసుకునేలోపునే మామూలుగా మారిపోయిన అశోక్ విజయం సాధించినవాడిలా గలగలా నవ్వేశాడు.

"ఇప్పుడు అలుక పోయిందా చరణ్?" కొంటెగా అడిగాడు.

"అందుకిదా మార్గం? అబ్బ ఎంత హదలబెట్టేశారు, అశోక్!" చిరు కోపంగా చూస్తూఅంది శ్రీచరణి. బదులుగా నవ్వేడు అశోక్.

"అశోక్! నిజంగా మీకేం కాలేదుకదూ? ఎంత భయపడిపోయానో తెలుసా? ఇంకెప్పుడూ ఇలా చేయకండి!" కన్నీళ్ళతో అతనివంక చూస్తున్న శ్రీచరణి మనసులో ఏదో భావం ఆమెను నిలువెల్లా వాణికించగా హఠాత్తుగా అతనిని పెనవేసుకుపోయింది. అతనిచేతులామెని ప్రేమగా నిమిరాయి.

"నువ్విది భరించలేకపోతే నీ మౌనాన్ని నేనూ భరించలేకపోయాను చరణ్! ఇంకెప్పుడూ నామీద అలగవుకదూ?" ఆమె చెవిలో గుసగుసగా అన్నాడు అశోక్. ఆమెను తననుండి విడదీసి ఇంకా వర్షిస్తున్న ఆమె కన్నీళ్ళను కర్చీఫ్‌తో తుడిచేడు.

"ఛ! ఛ! ఇంకా ఏడుస్తున్నావా? ఇంత బేలవైతే ఎలా చరణ్?" ఆమె ఒడిలో తల పెట్టుకున్నాడు అశోక్. అతని క్రాప్‌ను నిమురుతూ, అతని మెడ లోని టైతో ఆడుకుంటూ అతని మొహంవంక ఆరాధనగా చూస్తూ అలా ఎంత సేపుండిపోయిందో శ్రీచరణికే తెలియదు.

హఠాత్తుగా ఉలిక్కిపడింది శ్రీచరణి. "లేవండి! లేవండి! చిన్న పాపాయిలా బజ్జున్నారుగాని." అతని భుజాలు పట్టుకుని లేవదీసింది శ్రీచరణి.

అశోక్ తెల్లబోయినట్టు చూశాడు? "మళ్ళీ ఏమైంది?"

"ఏం కాలేదు. పెళ్ళయేవరకూ దూరం! దూరం!"

"ఏం? నా మీద నీ కామాత్రం నమ్మకంలేదా?"

"నా మీద మీకూ, మీ మీద నాకూ నమ్మకాలుంటాయి. కానీ మన మీద మనకే ఉండవు. ప్రేమించిన మగవాడి సాన్నిధ్యంలో ఆడది తనంతట తనే కరిగిపోతుందట. ఆమె ఎంత వివేకవంతురాలయినా ఆ క్షణంలో విచక్షణ నేదే తెలియదట. మా అత్తయ్య అంటుంది. కానీ నేనంత తొందరగా కరగనని, నా విషయంలో ఏం భయపడవద్దని నే నామెకి మాటిచ్చేను. ఇచ్చిన మాట నిలబెట్టుకోవద్దూ?"

"మీ అత్తయ్యతో మంచి చిక్కొచ్చిందే నాకు. అయితే మీ అత్తయ్య అభిప్రాయాలేగాని, నీకు వేరే స్వంత అభిప్రాయాలుండవన్నమాట."

"ఎందుకుండవు? మా అత్తయ్య అభిప్రాయాలు వింటూంటే వాటిలో ఎంతో నిజముందనిపిస్తుంది నాకు. అంటే ఆమెవీ నావీ దాదాపుగా ఒకే అభిప్రాయాలన్న మాట. నా శ్రేయస్సుకోసమే చెప్పే అత్తయ్యమాటలు వేదవాక్కు నాకు."

"మీ అత్తయ్య అంటే నీ కంత ఇష్టమన్నమాట "

"ఔను. దేవుడికంటేగూడా! అసలు దేవుడే అన్యాయంచేసిన మా అమ్మను చేరదీసి, ఆమె పోయినా, ఆమె కన్న నన్ను కంటికి రెప్పలా ఆరవ ప్రాణంలా కాపాడిన దేవత ఆమె." చెబుతున్న శ్రీచరణి కళ్ళు త్రివేణి పట్ల కృతజ్ఞతతో తడయ్యాయి. ఆమె చెప్పేది మౌనంగా వింటూండిపోయాడు అశోక్.

## 4

"చరణ్! మనం ఎస్టేట్ సమీపానికొచ్చేశాం," అన్నాడు అశోక్ అతని భుజం మీద తలాన్చి కునికిపాట్లుపడుతున్న శ్రీచరణి భుజంమీద తడుతూ. "నిజంగా వచ్చేశామా?" కళ్ళు నులుముకుని అవలించింది శ్రీచరణి.

సాయంకాలం ఐవపుతుంది. నీరెండ ఏపుగా పెరిగిన చెట్ల కొమ్మల మీదనుండి జారిపడుతూంది. ఒత్తుగా దట్టంగా ఉన్న చెట్ల కొమ్మలమీద రకరకాల పక్షుల గుంపులు వింతవింత శబ్దాలతో గోల గోలగా అరుస్తున్నాయి. శ్రీచరణి ఉత్సాహంగా బైనాక్యులర్స్‌తో దూరంగా చూస్తూంది.




"చూడు చరణ్! ఆ దూరంగా అటువైపు కనిపించేవి మన తేయాకు తోటలు. ఇటు ఉత్తరంగా ఉన్నవి పొగాకు మడులు. ఆ గుబురుగా వున్నది సరుగుడుతోట. నాకు ఆ సరుగుడు తోటలో ఒంటరిగా అవి చేసే శబ్దాలు వింటూ గడపటం ఎంతో ఇష్టం. నా చిన్నప్పుడైతే ఆ వింతశబ్దాలకి చాలా భయపడేవాడిననుకో " ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు అశోక్.

"అయితే మనం వచ్చేశామన్నమాట. మరయితే మీ బంగళా కన్పించడంలేదే?" ఆసక్తిగా చుట్టూ చూస్తూ అడిగింది శ్రీచరణి.

"అప్పుడేనా ? మా అమ్మా నాన్నా ఉండే బంగళా చేరాలంటే మనం ఇంకా కనీసం పదిమైళ్ళయినా ప్రయాణంచేయాలి. మనం ఇంకా మొదట్లోనే ఉన్నాం. ఇంకో రెండుమూడు మైళ్ళుపోతే మా గెస్ట్‌హౌస్ వస్తుంది. అంటే మా వాళ్ళు ప్రయాణం మధ్యలో విశ్రాంతి తీసుకోడానికి దీన్నిక్కడ కట్టేరన్నమాట. మనంకూడా ఈ నైట్ ఇక్కడే ఉండిపోయి తెల్లారి వెళ్ళిపోతే బాగుంటుంది."

"ఇక్కడ వుండిపోవాలా?" నిరుత్సాహంగా అంది శ్రీచరణి. ఆమెకి ఎప్పుడెప్పుడు గమ్యస్థానం చేరుకుంటానా, ఎప్పుడెప్పుడు ఆ ఎస్టేటంతా తిరిగి చూస్తానా అని మహా ఆతృతగా ఉంది.

కారు సాగిపోతూంది. చుట్టుపట్ల తోటల్లో పనులు చేసుకుంటున్న వాళ్ళంవరూ సాయంత్రం కావడంతో పనులు కట్టిపెట్టి ఇళ్ళకి వెళ్ళడానికి

ఉద్యుక్తులవుతున్నారు. కారును చూడగానే వాళ్ళందరూ ఉత్సాహంగా పరిగెట్టు కొచ్చి "చినవాబొచ్చేరు! చినదాబొచ్చేరం"టూ గోలగోలగా అరుస్తూ కారుచుట్టూ గుమిగూడేరు.

అశోక్ కారు దిగి "అందరూ బాగున్నారా?" అంటూ చిరునవ్వుతో అందరినీ పలకరించేడు.

"బాగున్నాం బాబూ! అంతా మీ దయ." ఆనందంగా అన్నారందరూ. వాళ్ళందరికీ అశోక్‌పట్ల ఉన్న అభిమానం, గౌరవం, విధేయతా చూస్తున్న కొద్దీ శ్రీచరణికి ముచ్చటగా అన్పించింది. కారు కిటికీలోనుండి బయటికితలపెట్టి కళ్ళు పెద్దవి చేసి వాళ్ళందరివంకా చూడసాగింది.

"ఈ యమ్మెవరు బాబూ?" అనడిగేడు ఒక ముసలతను.

అశోక్ చిన్నగా నవ్వుతూ శ్రీచరణివంక చూచేడు. ఆమెకూడా ఏం చెబుతావన్నట్టు అతనివంక చూసింది.

"రేపు ఆ విషయం నాన్నగారు మీ అందరికీ చెబుతారు," అన్నాడు అశోక్. వాళ్ళందరూ ఆశ్చర్యంగా ఒకరి మొహాలవంక ఒకరు చూసుకొని ఏదో గుసగుసగా గోలగోలగా అనుకోసాగేరు.

"మల్లన్న గెస్ట్‌హౌస్ దగ్గిరే ఉన్నాడా?" ప్రశ్నించేడు అశోక్.

"అవునే ఉన్నాడు దొరా!"

"సరే మీ అందరూ అక్కడికి రండి."

"అట్టానే దొరా! శాన అలసిపోయారు. ఎల్లి ఇశ్రాంతి తీసుకోండి. రంద్రా మనం పోదాం." అందులో అందరికంటే పెద్దగా కన్పిస్తున్న ఒక వయసుముళ్ళిన అతను అన్నాడు.

"ఎల్లండి బాబూ! ఎల్లండి!" అందరూ పొలోమని పోసాగేరు. అశోక్ కారు స్టార్ట్ చేశాడు.

గెస్ట్‌హౌస్ దగ్గిర కారుదిగిన అశోక్‌ను అక్కడ కాపలాఉన్న ముసలి మల్లన్న ఒళ్ళంతా కళ్ళుచేసుకుని ఆప్యాయంగా చూస్తూ—

"రండి చిన్నదొరా! రండి! మళ్ళీ ఎన్నాళ్ళకి చూశాను మిమ్మల్ని! ఇన్నాళ్ళకి ఈ దారి గుర్తుకొచ్చేదా బాబూ మీకు?" అన్నాడు.

"నిన్నెప్పుడూ మర్చిపోలేదు తాతా నేను. నాన్నగారు ఫ్యాక్టరీ బాధ్యతంతా నా కప్పగించేరా మరి. రావడానికి తీరికెక్కడిది. ఇప్పుడు మీ అందరినీ చూడాలనె వచ్చేను" మల్లన్న తాత రెండు భుజాలమీద ఆత్మీయంగా చేతులు వేసి ప్రేమగా అన్నాడు అశోక్.

"ఇప్పటికైనా దయకల్గింది రండి బాబూ రండి!" కళ్లొత్తుకుంటూ లోపలికి దారితీశాడు మల్లతాత.

"దిగు చరణ్!" వింతగా చూస్తున్న శ్రీచరణి చేయి పట్టుకుని దింపేడు అశోక్.

లోపల హాల్లో అతి ఖరీదైన పర్నిచర్ అమర్చి చాలా శుభ్రంగా ఉంది. గదులకి తెల్లని సిల్కు కర్టెన్లు వ్రేలాడుతూ ఫేన్ గాలికి ఎగురుతున్నాయి. అద్దాల కిటికీలు కొత్తగా నీట్ గా నిగనిగలాడుతూ తళుకు లీనుతున్నాయి. ఆ గెస్ట్ హౌస్ చుట్టూ రకరకాల పూలమొక్కలు, క్రోటన్స్ తో చాలా అందంగా ఉంది. ఒక్క చూపులోనే పరిసరాలని గమనించిన శ్రీచరణి మనసు చాలా ఉల్లాసపడింది.

హాల్లో సోఫాలో ఆసీనులయ్యారు అశోక్, శ్రీచరణి. వాళ్ళ దగ్గిర నేలమీదకూర్చుని తమ కష్టసుఖాలన్నీ చెప్పుకోసాగేడు మల్లన్నతాత.

అంతలో అశోక్ వచ్చేడన్న వార్త తెలిసి ఎక్కడనుండో పాతికేళ్ళలోపు అమ్మాయిలు పరుగుపరుగున వచ్చేరు.

"హాయ్ లక్ష్మి! గౌరీ! బాగున్నారా?" పలకరించేడు అశోక్.

"బాగున్నాం దొరా! షేం మీకు గురుతుంటామా? పట్నంసోకులు మరిగిన బాబుకి మేం ఎక్కడానతాం?" శ్రీచరణి వంక ఆశ్చర్యంగా ఈర్ష్యగా చూస్తూ అంది లక్ష్మి.

"ఈ దొరసానెవరు దొరా?" గౌరి అడిగింది.

అశోక్ శ్రీచరణి వంక చూశాడు. వాళ్ళేమన్నా పట్టించుకోవద్దన్నట్టు ఆమెకి కళ్ళతోనే చెప్పేడు.

"నేను మీ సెక్రటరీనని వీళ్ళతో చెప్పలేదాండి." మొహానికి నవ్వు తెచ్చుకుని అంది శ్రీచరణి.

"చెప్పలేదు. ఏదీ ఈసారేగా నిన్ను నా వెంట తీసుకొచ్చింది! వీళ్ళు మల్లన్నతాత మనమరాళ్ళు. గౌరీ, లక్ష్మి. గొప్ప పెంకెఘటాల్లే. ఈమె సెక్రటరీ. అంటే నాకు కావల్సిన ఆఫీస్ తాలూకు పనులన్నిటిలోనూ సహాయ పడేవన్నమాట." వాళ్ళకి వివరించేడు అశోక్. అంతకంటే వాళ్ళతో ఏం చెప్పడానికి అతనికి మనస్కరించలేదు.

"ఓహో! అదో నౌకరీగూడా ఉంటుందన్నమాట. మరి పెళ్ళాన్ని ఇంటి సెక్రటరీ అంటారేమో మరి. మనకేటి తెల్సు "

"ఇక నోరు మూసుకునెల్లండెహె! ఆరికి వంటా అదీ చూడండి." కసురుకున్నాడు మల్లన్నతాత.

"ఆఁ చూడు లక్ష్మీ! కారులో సూట్ కేస్ లుంటాయి. ఇటు తీసుకురా!" ఆజ్ఞాపించేడు అశోక్.

"ఓ!" అంటూ ఇద్దరూ కారుదగ్గిరకి పరుగెట్టి రెండు సూట్ కేస్‌లూ చెరోటీ తీసుకొచ్చేరు.

అశోక్ తన సూట్ కేస్ ఓపెన్‌చేసి మల్లన్న తాతకి ఉన్ని రగ్గు తీసిఇచ్చేడు. "తాతా! నువ్వు చలితో బాధపడ్తావని నీకోసం తీసుకొచ్చేను. బావుందా?" అన్నాడు.

"మా బాబే! మా నాయనే! చల్లగా వర్ధిల్లు తండ్రీ!" దాన్ని మహాప్రసాదంగా అందుకుంటూ కృతజ్ఞతతో కళ్ళలో నీరూరుతుండగా అన్నాడు మల్లన్నతాత.

అంతలో బైట కూలీలందరూ గోల గోలగా గుమిగూడేరు. అశోక్ సూట్ కేస్‌లోనుండి ఒక పెద్ద పేకెట్ తీశాడు.

"లక్ష్మీ! గౌరీ! ఇందులో ఉన్న మిఠాయిలు ఆ కూలీలందరికి పంచిపెట్టండి." మిఠాయిల పేకెట్‌ను లక్ష్మి చేతికిచ్చి మల్లన్న తాతతో విశ్రాంతి తీసుకుంటానని చెప్పి లోపలి గదిలోకెళ్ళిపోయాడు అశోక్. అతన్ని అనుసరించింది శ్రీచరణి.

"లక్ష్మి! నువ్వు వంటపని చూడు. అయ్యగారికి ఆలీసమైపోతాది. గౌరి పంచి పెడతాది ఆటిని." మల్లన్నతాత పురమాయించేడు.

"అట్టాగే తాతా!" లక్ష్మి లోపలికి, మిఠాయిల ప్యాకెట్ తీసుకొని గౌరి బయటికి వెళ్ళేరు.

మల్లన్న తాత మనవరాళ్ళిద్దరూ రాత్రి ఏడు గంట లయ్యేసరికి భోజనం సిద్ధం చేసేశారు. అశోక్, శ్రీచరణి డైనింగ్ టేబిల్ ముందు కూర్చున్నారు. లక్ష్మి వడ్డిస్తుంది.

పదార్థాలు రుచిచూసిన అశోక్ "వెరీఫైన్! చాలా చక్కగా చేశావు లక్ష్మీ!" అన్నాడు మెచ్చుకోలుగా.

"ఊఁ! బస్తీ రుసులు మరిగిన మీకు మాతో పాటు వంటలు కూడా రోత పుట్టిస్తాయేనని జడిసిపోయాను. అదోటి నయమే." మొహం ముడుచుకొని అంది లక్ష్మి.

"అదేమిటి లక్ష్మి?" విస్తుపోయాడు అశోక్.

"ఎట్టాగైనా మీకు మామీద సీతకన్ను పడిపోనాది దొరా!" అంది గౌరి.

"అలా అని ఎవరన్నారు?"

"ఎవరో ఏరేగా అనాలేటి? ఇంత సొష్టంగా తెలుస్తుంటే. ఎప్పుడైనా మాకేటి లేకుండా ఉండేవోరా? ఇలా అంటీ ముట్టనట్టుగా, మే మెవరో తెలనట్టుగా పెవర్తించేవోరా?" నిష్టూరంగా అంది గౌరి.

"నీదంతా పిచ్చే గౌరీ! పాతమొగాలం, చదువురాని చచ్చు మొగాలం మనం. మోజొొకటి పాతబడిపోనాది. ఇప్పుడు దొరగారి మోజంతా చదూకున్న బస్తీ దొరసాన్లు మీద ఉంటాదిగాని మనమీదెందుకుంటాది?" శ్రీచరణిని కక్షగా చూస్తూ అంది లక్ష్మి.

వాళ్ళ వాగుడికి అశోక్‌కి చాలా ఆగ్రహం వచ్చింది. ఒక వంక శ్రీచరణి ఏమనుకుంటుందో, దీన్ని ఏ విధంగా తీసుకుంటుందోనని మనసు ఒకటే పీకసాగింది.

"ఏమిటీ అర్థంలేని వాగుడు? ఇక కట్టిపెడతారా లేదా?" కోపంగా అరిచాడు అశోక్. టక్కున వాళ్ళిద్దరి నోళ్ళూ మూతబడిపోయాయి. అశోక్ శ్రీచరణి వంక చూచేడు. ఆమె బిక్కచచ్చిపోయినట్టుగా వాళ్ళ ముగ్గురి వంకా చూస్తూండి పోయింది. అశోక్ కోపంగా చెయ్యి కడుగేసుకుని లేచి వెళ్ళిపోయాడు.

"మంచోణ్ణే పట్టేవు దొరసానీ! నీ రొట్టివిరిగి నేతిలో పడ్డట్టే," శ్రీచరణి వంక వెక్కిరింతగా చూస్తూ ముసిముసిగా నవ్వుకున్నారిద్దరూ.

## 5

తనకు కేటాయించిన గదిలో ఫోమ్ బెడ్‌మీద కూర్చుని ఆలోచనలో పడింది శ్రీచరణి. ఆమెకు తను బయలుదేరినప్పుడున్న ఉత్సాహం, సంబరం ఈ గెస్ట్‌హౌస్‌కి రావడంతోనే మంత్రంవేసినట్టు ఎగిరిపోయి మనసంతా చేదుగా తయారయింది.

హఠాత్తుగా ఆమెకి తన అత్తయ్య అన్న మాటలు గుర్తుకొచ్చాయి. డబ్బు, హోదా ఉన్న యువకుల మనస్సెప్పుడూ నిలకడగా ఉండదు. ప్రతిక్షణం వాళ్ళ మనస్సు కొత్త కొత్త అందాల కోసం, రుచుల కోసం ఆరాటపడుతుంది. ఏ రకం స్త్రీతో ఎటువంటి అనుభవం దొరుకుతుందోనని వాళ్ళూ వీళ్ళూ అనకుండా తమ ఐశ్వర్యపు ఆకర్షణతో, లేకపోతే అందం, పలుకుబడులతోనైనా ఆకర్షించుకుని, తరువాత దీపం చుట్టూ చేరిన దీపపు పురుగుల గతి వాళ్ళకి ప్రాప్తింప జేస్తారు. ఆడవాళ్ళని తమ వినోదం కోసం భగవంతుడు సృష్టించిన విలాసవస్తువులుగా భావించి వాళ్ళ జీవితాలతో ఆడుకుంటారే తప్ప వాళ్ళ అంతరంగాన్ని గుర్తించరు. గౌరవించరు. అసలు ఆడదానికి ఒక వ్యక్తిత్వం,

హృదయం ఉంటుందన్న విషయాన్నే వాళ్ళు చాలా తేలిగ్గా, నవ్వులాటగా తీసుకుంటారు.

ఆలోచిస్తుంటే అత్తయ్య మాటల్లో ఎంతో నిజముందనిపిస్తోంది శ్రీచరణికి. లేకపోతే అశోక్‌తో వాళ్ళకెటువంటి పూర్వ సంబంధం లేకపోతే వాళ్ళతనిమందు అలా ఎలా మాట్లాడగలరు ? అంటే అశోక్ గూడా అత్తయ్య చెప్పినటువంటి వ్యక్తుల కోవలోకే వస్తాడా ?

తన అశోక్ అటువంటి మనిషంటే శ్రీచరణి మనసు ఎంతమాత్రం అంగీకరించడంలేదు. అసలు ఏ ఆడదీ కూడా తను ప్రేమించిన మగవాడు మోసగాడూ, వంచకుడూ కాడనే అనుకుంటుంది. దైవమంతటి ఉన్నతుడని అనుకుంటుంది. అలా అనుకోకపోయినట్టయితే అసలు పరిస్థితిని ప్రేమవరకూ రానివ్వనే రానివ్వదు. ఈ మాటకూడా అత్తయ్యే అంటుంది.

శ్రీచరణి మనసు ఎటూ తేల్చుకోలేక చివరికి అశోక్‌నే సూటిగా అడుగుదాం అనుకుంటూ లేచి అతని గదివైపు వెళ్ళింది.

గది గుమ్మంలోనే ఆగిపోయింది శ్రీచరణి. అశోక్ మంచంమీద లక్ష్మి, గౌరీ కూర్చున్నారు. వాళ్ళు ముగ్గురూ దేనికో పగలబడి నవ్వుకుంటున్నారు. శ్రీచరణి మొహం వివర్ణమైంది. అక్కడినుండి వెనుదిరిగి వెళ్ళిపోబోయింది ఆమెను అశోక్ చూశాడు.

"ఆగు చరణి ! వెళ్ళిపోతున్నావేం ? రా ఇలా ! ఇప్పుడు చూడు చెరో పది రూపాయలు తీసుకున్న తరువాత లక్ష్మికీ, గౌరికీ నామీద కోపం పోయింది..." అశోక్ మాటలు పూర్తికాకుండానే శ్రీచరణి విసురుగా తన గదిలోకొచ్చి పడింది. ఆమె వెనుకే వచ్చేడు అశోక్. "పిలుస్తుంటే వెళ్ళిపోతావేం చరణ్?" అంటూ.

"ఏంలేదు. నేను వెంటనే మా ఇంటికి వెళ్ళిపోవాలి. నన్ను తక్షణం పంపించేయండి." ఖచ్చితంగా అంది శ్రీచరణి.

అశోక్ బొమలు ముడిపడ్డాయి. "వెళ్ళిపోతావా ? ఏమిటి నిజంగానే ? అసలు నువ్వు నానుండి తప్పించుకుని వెళ్ళగలవా అని ?" ఆమెను తనముందుకి తిప్పుకుంటూ కొంటెగా అన్నాడు అశోక్.

అతని చేతులను విసిరికొట్టింది శ్రీచరణి. "ఏం ? ఎందుకు వెళ్ళలేను. అందరూ మీకు తెల్సినలాంటి ఆడపిల్లలేనని అనుకోకండి. మీ గాలంనుండి తప్పించుకుపోలేక పోవడానికి నేనేం నీతీ నియమం లేని అమాయకపు అడవి



పిల్లని కాను. ఛీ! ఛీ! మా అత్తయ్య మాటలు విని ఉండవల్సింది."
ఆవేశంగా అంది శ్రీచరణి.

అశోక్ కనుబొమలు క్షణకాలం ముడుచుకొని విడివడ్డాయి. "ఓహో! ఇదా నీ అనుమానం? నీ కిలాంటి అనుమానం వస్తుందని, నువ్వూ అందరాడ పిల్లల్లాగే ఆలోచిస్తావని నేనిందాకే అనుకున్నాను. విచ్చలవిడిగా తిరగటానికి జంకూ గొంకూ లేకుండా ఎలాంటివారితోనైనా సరసోక్తులతో మాట్లాడ్డానికి అలవాటుపడ్డ పిల్లలు వాళ్ళు. వాళ్ళు కవ్విస్తుంటే మడిగట్టుకూర్చుని, బుద్ధావతారంలా ఉండటానికి నేనేం జడపదార్థాన్నికాదు. పైగా వాళ్ళలా నేనూ వాళ్ళతో సరదాగా ఉండకపోతే నన్ను వాళ్ళు చవటగా కూడా భావించి వెక్కిరించే ప్రమాదం ఉంది. వాళ్ళతో అలా ఉండటం నాకు మొదట్నుంచీ అలవాటై పోయింది చరణీ! అంతమాత్రాన నేను నీతితప్పినవాణ్ణో, గడ్డిపువ్వుకీ గులాబీకి

మధ్యన ఉన్న వ్యత్యాసం తెలియనివాణ్ణికాదు. ఇంతకాలం నాతో ఇంత దగ్గర అనుబంధం ఉండి, నా గురించి ఎన్నో తెలుసుకున్న నీవుకూడా ఇంత తేలిగ్గా తీసుకోవడం ఛ! ఛ, చాలా బాధగా అన్పిస్తుంది చరణ్!"

అశోక్ ఒకటొకటీ వివరించడంతో శ్రీచరణిలోని ఆగ్రహం, అనుమానం మంచులా కరిగిపోసాగేయి. "తొందరపడ్డాను క్షమించండి." పశ్చాత్తాపంగా అతని వైపు బాధగా చూసింది.

"అదే అంత తొందరగా ఎందుకలాంటి ఊహలకి తావివ్వాలి? అసలు అటువంటి ఊహాలే మనసుండి దూరంగా ఉండాలి."

"నిజమే. కానీ ఏమిటో హఠాత్తుగా మా అత్తయ్య మాటలు గుర్తుకొచ్చి "

"బాప్‌రే! మీ అత్తయ్య భలే దాపురించిందే నా ప్రాణానికి. ఉండు ఆమె నీ సారి తప్పకుండా చూడాలి. చూచి ఇలాంటివన్నీ నీ కోడలికి నూరిపోసి నా కిటువంటి చిక్కులన్నీ తీసుకురావడం నీకేమైనా బాగుందామ్మా? అని అడగాలి."

అతని మాటలకి గలగలా నవ్వింది శ్రీచరణి. "అత్తయ్య కూడా మిమ్మల్ని చూడాలంటుంది. కాంప్ నుండి తిరిగి వెళ్ళేక తప్పకుండా తీసుకురమ్మంది."

"ఎందుకూ! ప్రస్తుతం పరోక్ష శత్రువులమైన మేము ప్రత్యక్షంగా దెబ్బ లాడుకోడానికా? చాలా రాత్రయిందిగాని పిచ్చిబుజ్జిలో ఇలాంటి సిల్లీ ఊహలకి తావివ్వక హాయిగా పడుకో," అంటూ ఆమెనమాంతం ఎత్తి బెడ్‌మీద పడుకోబెట్టి కంఠంవరకూ దుప్పటి కప్పేడు. లైట్ తీసేసి బెడ్‌లైట్ వేసి ఆమె నుదిటిని చుంబించేడు.

"స్వీట్ డ్రీమ్స్‌తో హాయిగా నిద్రపో. గుడ్‌నైట్," అంటూ అక్కడ నుండి వెళ్ళిపోయాడు అశోక్.

పడుకున్న శ్రీచరణికి ఎంత కళ్ళుమూసుకున్నా, అటూ ఇటూ ఊరికే దొర్లినా నిద్రాదేవి కరుణించలేదు. కొత్తప్రదేశం కావడంవల్లేమో ననుకుంది. మాటి మాటికీ అత్తయ్య త్రివేణి గుర్తురాసాగింది. పాపం తను లేక ఒంటరిగా ఎలా ఉందో అత్తయ్య! ఒంటరిగా పడుకోడం అలవాటులేని అత్తయ్యకి కూడా బహుశా నిద్రరాదు. అత్తయ్య ఈ మధ్య రచయిత్రి కావడానికి ప్రయత్ని స్తున్నట్లుంది. బహుశ నిద్రరాని అత్తయ్య ఏదైనా కథరాస్తూ కూర్చుందేమో. అన్నట్టు అత్తయ్య రాసిన కథ తను చదవనేలేదు. ఎలా రాసిందో ఏమిటో కుతూహలంగా లేచివెళ్ళి హాండ్‌బాగ్‌లో దాచిన త్రివేణి ఇచ్చిన కవరు తీసుకొచ్చి మంచంమీద వాలింది.

టేబిల్ లైట్ వెలుగులో కవరులోని కాగితాలు విడదీసి చదవసాగింది శ్రీచరణి.

మధ్య హాల్లోనో ఎక్కడో గోడగడియారం రెండు గంటలు కొట్టిన శబ్దం విన్పించింది. చదువుతున్న శ్రీచరణి కన్నులనుండి కన్నీరు అవిరామంగా వర్షిస్తూ తలగడ తడిపేయసాగింది. ఆమె కన్నీటికి ఆ కాగితాలమీద అక్షరాలు అలుక్కుపోయి తమ ఆకారాలని పోగొట్టుకుంటున్నాయి.

శ్రీచరణి చదవడం పూర్తిచేసి ఆ కాగితాలని కవరుని పక్కన పడేసింది. ఆమె మనసంతా చెప్పలేని భారంగా మొద్దుబారిపోతున్నట్లుగా తయారయింది.

ఒక్కసారి ఆమె మనసునిండుగా త్రివేణి రూపం నిండిపోయినట్టయి ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది. అత్తయ్య ఆశలని నిజం చేయాలి. ఆమె కోరిక జీవితంలో ఒక్కసారైనా తీరేలా కృషిచేయాలి. చేస్తుంది. ఎన్ని కష్టాలైనా, అవమానాలైనా భరిస్తుంది. అత్తయ్య మొహంమీద మనస్పూర్తిగా గర్వంతో నిండిన చిరునవ్వు తను ఒక్కసారైనా చూడాలి. అత్తయ్య కలలు పండించాలి. ఇకనుండీ అదే తన జీవిత లక్ష్యం. ఈ విధంగా తప్ప తనింకేం చేసినా అత్తయ్య ఋణం తీర్చుకోలేదు. అశోక్‌ను తను రేపటినుండే స్టడీచేయాలి. అతన్ని తను తన జీవిత భాగస్వామిగాకాక ఒక వ్యక్తిగా అతని వ్యక్తిత్వమెంతటిదో, అతనిలోని సంస్కారం, మానవత్వం ఎంత నిజమైనదో తెలుసుకోవాలి. ఈ ప్రయత్నంలో తను అశోక్‌ను వదులుకోవాల్సి వచ్చినా ఏమాత్రం వెనుకాడకూడదు.

ఆ ఏడుపు మధ్య తిరుగులేని నిర్ణయాలు చేసుకున్న శ్రీచరణి మెల్లగా నిద్రాదేవి ఒడిలో కొరిగిపోయింది.

## 6

తెల్లవారిన తర్వాత తన గదికివచ్చి చిరునవ్వుతో పలకరించిన అశోక్‌ను అప్పుడే కొత్తగా చూస్తున్నట్టుగా, అతని మొహంలో దేనికో వెదుకుతున్నట్టుగా చాలాసేపు చూస్తూండిపోయింది శ్రీచరణి.

"ఏమిటలా చూస్తున్నావు?" అడిగేడు అశోక్.

"ఏంలేదు. మీలాంటి గొప్ప వంశంవాళ్ళకి అహంకారం, అభిజాత్యం, దురభిమానం ఇవే జీవితమట. చివరి ఊపిరి తీసుకునేవరకూ కూడా వాటిని ఏమాత్రం వదిలిపెట్టరట. ఆ మాట మీ విషయంలో ఎంత నిజమో, ఎంత అబద్ధమో తేల్చుకోలేకపోతున్నాను."

"చంపావ్ పో! ఇదీ మీ అత్తయ్యే చెప్పిందా?"

"మా అత్తయ్యని చూస్తే ఆమె అన్నవన్నీ పచ్చి నిజాలని మీరూ ఒప్పుకుంటారు."

"ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా, దయచేసి నా జీవితంలో కల్లోలాన్ని రేపొద్దని ప్రార్థించడానికైనా మీ అత్తయ్యని చూడాలి. ఇంతవరకూ డబ్బు గల యువకులు, వాళ్ళ మోజులూ అంటూ ఊరికే ఆడిపోసుకునేదానివి. ఇప్పుడు మళ్ళీ వంశాలని తూర్పారబెట్టడం మొదలుపెట్టేవా? ఎవరి విషయాలెలా ఉన్నా నా విషయంలో మాత్రం ఇటువంటి ఆలోచనలు పెట్టుకోవద్దని నీకు చెప్ప లేదూ?" చిరాకు పడ్తున్నవాడిలా అన్నాడు అశోక్. శ్రీచరణి ఆలోచనలో పడిన దానిలా చూస్తూ ఉండిపోయింది.

"ఇక ఆలోచన్లు కట్టిపెట్టి త్వరగా లెములు. అవతల నాన్నగారూ, అమ్మా మనకోసం చూస్తుంటారు. ముందు మన బంగళాకి చేరిన తరువాత మెల్లగా ఎప్పటిలా తిరిగి అన్నీ చూడొచ్చు. ఊ! లే లే!" అంటూ తొందర చేశాడు అశోక్.

కానీ శ్రీచరణి మంచంమీద ముడుచుకుని ముడుకులచుట్టూ చేతులు వేసు కుని కూర్చున్నది కాస్తా అతని తొందర ఏమాత్రం లెక్కలేనట్టు ఒక్క పిసరు కూడా కదలలేదు.

"లేవవేం చరణ్?" కనుబొమలు ముడుస్తూ అడిగేడు అశోక్.

"అశోక్! ఒకమాట!"

"ఏమిటది?" తిరిగి మంచంమీద కూర్చున్నాడు అశోక్.

"నన్ను అక్కడున్న మీ వాళ్ళకి పరిచయం చేస్తారా?"

"ఔను." ఆమెవంక ఆశ్చర్యంగా చూశాడు అశోక్.

"ఏమని చేస్తారు?"

"నా కాబోయే భార్యగా! కొత్తగా అడుగుతున్నావేమిటి?"

"కొత్తకాదు. ఏంకాదు. ప్రస్తుతం నన్నలా ఎవరికీ పరిచయం చేయ కండి. మీ పేరెంట్స్‌కి కూడా. నేను మీ సెక్రటరీని అంతే."

హతాశుడైనట్టుగా చూశాడు అశోక్. "మళ్ళీ ఏం వచ్చింది?"

"ఏం రాలేదు. మీ లాంటి గొప్ప వంశస్థులలో ఏ ప్రత్యేకతలూ లేని అతి సామాన్యురాలికి ఎటువంటి స్థానం ఉంటుందో, వాళ్ళు మనిషిగా గుర్తించి

గౌరవించగలరో లేదో తెలుసుకోవాలని ఉంది. నాది పిచ్చి ఆలోచనే అనుకోండి. కానీ నా పిచ్చి నా కానందం."

అశోక్‌కి కాస్త కోపంవచ్చింది. "అంటే నువ్వు మా తల్లిదండ్రులను అవమానిస్తున్నావన్నమాట."

"అది అవమానంగా అనుకుంటే నేనేం చేయలేను. కానీ అది అవమానంకాదు. నేను పరిచయమయేది మీ పేరెంట్స్‌కే కాదు. మీ బంధువులకీ, పరివారానికి అందరికీ. తీరా పెళ్ళయిపోయినతర్వాత ఆఁ! మా చినబాబు భార్య పెళ్ళికాకముందు ఎందుకూ కొరగానిది. చినబాబు చేసుకోబట్టే ఆమె కీ భోగం అని వాళ్ళు అనుకుంటుంటే అది వినడం నాకూ, మీకూ గూడా బాధగానే ఉంటుంది. అందుకనే వాళ్ళ అంతరంగా లెటువంటివో, పెద్దవాళ్ళపట్ల వాళ్ళ భావనలు, ఆలోచనలు ఎలా ఉంటాయో తెలుసుకోవాలని ఉంది."

"తెలుసుకుని నువ్వేంచేయగలవు? నీ నిర్ణయాన్ని మార్చేసుకుంటావా?"

"ఏమో ఏంచేస్తానో నాకే తెలియదు."

శ్రీచరణి తీసుకొచ్చిన ఈ ప్రస్తావన అశోక్ మనసుకి చాలా కలవరంగా, చికాగ్గా అన్పించింది. "నువ్వో తలతిక్క మనిషివి. ఏ క్షణంలో ఏ పురుగు నీ బుర్రలో ప్రవేశిస్తుందో నీకే తెలియదు. నువ్వు చండికలాంటి దానివని నేను మొదటే అనుకున్నాను. సరే! త్వరగా పద. నీ ఇష్టప్రకారమే అవుతుందిలే." అంటూ అసహనంగా అక్కడనుండి వెళ్ళిపోయాడు అశోక్.

లేచి స్నానం అదీ ముగించి తయారయింది శ్రీచరణి. టిఫిన్ చేస్తుండగా "గుడ్! నీ పిచ్చి కుదిరిందన్నమాట," అన్నాడు ప్రసన్నంగా ఉన్న ఆమె మొహాన్ని చూస్తూ అశోక్.

టిఫిన్ పూర్తిచేసి కారు బైటకి తీశాడు అశోక్. అందరికీ చెప్పి శ్రీచరణి కూర్చున్న తరువాత కారు స్టార్ట్ చేశాడు. కారు చాలా మెల్లగా పోతూంది. రోడ్డుకి అటూ ఇటూ ఉన్న పెద్ద పెద్ద చెట్లను కూలీలు గొడ్డళ్ళతో కొడుతున్నారు. కారును చూడ్డంతోనే వాళ్ళు ఒక్కక్షణం పనాపి ఆనందంగా చేతులూపసాగేరు. కారుని మెల్లగా తోలుతూ అశోక్‌కూడా చేతులూపేడు.

కూలీలు మళ్ళీ పనిలో నిమగ్నమయి ఏకదీక్షగా తమ పని కొనసాగించసాగేరు. ఇంకా ఎండ తీక్షణం కాకముందే బాగా కష్టిస్తూ పనిచేస్తున్న వాళ్ళ శరీరాలనుండి చెమట దారగా కారుతూ నల్లగా మురికిగా ఉన్న వాళ్ళ శరీరాల

మీద జిడ్డుతో కలసిపోయి క్రిందకి కారసాగింది. వాళ్ళనుండి దూరమవుతున్న కారులోనుండి తల వెనక్కు తిప్పుతూ చూడసాగింది శ్రీచరణి.

"ఆ కూలీల పిల్లలు వాళ్ళను ఛీదరించుకుని అసహ్యించుకుంటే ఎలా ఉంటుంది అశోక్?" హఠాత్తుగా అడిగింది శ్రీచరణి.

ఉలిక్కిపడ్డాడు అశోక్. "ఎందుకసహ్యించుకుంటారు?"

"ఎందుకసహ్యించుకోరు? వాళ్ళ తల్లిదండ్రులు వాళ్ళకి కూలి జీవితాల్నే తప్ప, చదువులూ, ఉద్యోగాలూ ఉన్న మంచి జీవితాన్నివ్వలేరుగా? వాళ్ళకి సుఖంగా బతకడానికి ఏ మార్గాన్నీ చూపించలేరుగా? సంఘంలో గౌరవస్థానాన్ని కల్పించలేరుగా?"

"అందుకని అసహ్యించుకుంటా చరణ్?" నవ్వేడు అశోక్.

"ఈ మధ్య నీ బుర్రే మరింత విపరీతంగా ఆలోచిస్తూంది? వాళ్ళ జీవిత పరిధి అంతవరకే. తమ పిల్లల్ని గొప్పవాళ్ళగా చూడాలన్న ఆశలు వాళ్ళకీ ఉంటాయి. పరిధిని అధిగమించి ఒక్కమెట్టు పైకి ఎక్కించగల శక్తి వాళ్ళకి ఉండదు. వాళ్ళు తమ పిల్లలకి ఇవ్వగలిగింది ప్రేమానురాగాలూ, మమతాభిమానాలు మాత్రమే. వాటితోనే ఉన్నంతలో పిల్లల్ని ప్రాణాధికంగా పెంచుతారు. అలా పెంచలేని తల్లిదండ్రులని కూడా పిల్లలు అసహ్యించుకోకూడదు చరణ్! ఎందుకంటేవాళ్ళు పుట్టడం తల్లిదండ్రులు కనడం వాళ్ళచేతుల్లో ఏంలేదు కనుక."

"ఒకవేళ తమని కని తమకీ హీనస్థితిని కలిగించినందుకు పిల్లలు తల్లిదండ్రులని అసహ్యించుకుంటే అప్పుడు వాళ్ళ మనసులెలా ఉంటాయంటారు?"

"పిల్లలకోసమే కష్టించి రక్తాన్ని కరిగించి వాళ్ళని పెంచడం కోసమే బ్రతికే తల్లిదండ్రులు పిల్లల నిరసనని ఏమాత్రం భరించలేరు చరణి! ఆ బాధ తట్టుకునే శక్తి ఆపేద గుండెలకి ఉండదు. ఒకవేళ నిజంగా అటువంటి పిల్లలే ఉంటే వాళ్ళు క్షమించ రానంతటి దుర్మార్గులన్నమాట."

"అలా పైన నిలబడి చెప్పడం చాలా తేలిక అశోక్! అన్నివిధాలా వడ్డించిన విస్తరిలాంటి జీవితంలో ఉన్నారు మీరు. అందని ద్రాక్షలా ఊరించే అందమైన జీవితాన్ని అందుకోలేక, తమని వెన్నంటి పోని దరిద్ర జీవితంలో ఇమడలేక పాపం ఆ కూలీల సంతానం ఎంత యాతన ననుభవిస్తున్నారో మీకేం తెలుస్తుంది? తమ నికృష్టపు జన్మకి కారణమైన తల్లిదండ్రులను తిట్టుకోకేం జేస్తారు? మీరూ అటువంటి స్థితిలో ఉండి ఉంటే తెలిసేది?"

"చరణ్! నేను అనుకున్నదీ ఆచరించేదీ ఒకటే. నిజంగా నే నీ కూలీల కంటే కూడా దుర్భరమైన స్థితిలో ఉన్నా సరే నాకు జన్మనిచ్చి న న్నీలోకంలో ప్రవేశింపజేసిన తల్లిదండ్రులను మాత్రం ఎప్పటికీ అసహ్యించుకోను." ధృఢంగా అన్నాడు అశోక్. అలా అన్న అశోక్‌మాటల్లో ఎంతో నిజాయితీ, ఆత్మబలంఉన్నట్టనిపించేయి శ్రీచరణికి.

మెల్లగా ఆమె మొహంలోకి మెరుపులాంటి వెలుగేదో పాకివచ్చి ఆమె మొహాన్ని ప్రకాశింపజేసింది. తేలిగ్గా నిట్టూర్చింది శ్రీచరణి సీటుమీద వెనక్కివాలుతూ.

## 7

కారు శ్రీనిలయం ముందాగింది. చుట్టూ రకరకాల పూలమొక్కలతో ఉన్న అందమైన తోటలో, పట్టుకుచ్చులాంటి లాన్‌తో సువిశాలంగా, అందంగా ఉన్న ఆ బంగళావంక కళ్ళు విప్పార్చుకుని చూసింది శ్రీచరణి. కారు ఆగీ ఆగగానే లోపలినుండి పదీపదిహేనుమంది బిలబిల్లాడుతూ వచ్చేరు. మెల్లగా కారుదిగి అందర్నీ చిరునవ్వుతో పలకరించేడు అశోక్.

"మీరు నిన్ననే వస్తారనుకున్నాం చినబాబూ?"

"ఈసారి చాలా రోజులుకి వచ్చేరు అశోక్ బాబూ!"

"నాన్నగారు ఇందాకట్నుంచీ మీకోసం చూస్తున్నారు. పదండి బాబూ!" సంబరంగా అందరూ అన్నిమాటలూ అంటూ తమ ఆనందాన్ని వ్యక్తం చేయసాగేరు.

"అలాగా పదండి!" లోపలికి నడిచేడు అశోక్. అతని వెనుక శ్రీచరణి. అక్కడున్న అందరూ లోపలికెళ్ళేరు.

అందరూ శ్రీచరణిని వింతగా చూడ్డం గమినించిన అశోక్.

"ఈమె నా సెక్రటరీ! పేరు శ్రీచరణి" అంటూ ఆమెను వాళ్ళకి పరిచయం చేశాడు.

"ఇదుగో ఈయన మేనేజర్. వీళ్ళిద్దరూ గుమస్తాలు, ఇతను వంట మనిషి, వీళ్ళు నౌకర్లు, ఇదిగో ఈ అమ్మాయి మేనేజర్‌గారి అమ్మాయి విమల. నీలాగే చలాకీ అయినపిల్ల. చదువుకున్న పిల్లగూడా. నీకేం కావల్సినా ఈ అమ్మాయిని అడుగు." అంటూ అక్కడున్న పరివారాన్నందరినీ ఒక్కొక్కరినీ శ్రీచరణికి పరిచయంచేశాడు అశోక్.

అక్కడ వాళ్ళందరికీ అశోక్ తనవెంట సెక్రటరీని తీసుకురావడం,

తమందరికీ పరిచయంచేయడం ఏమీ కొత్తకాదు. అయితే ఆ సెక్రటరీ మగవాడైతే, ఈమె ఇరవైఏళ్ళ అమ్మాయి. అంతే తేడా! ఈ ఆడ సెక్రటరీ వాళ్ళ మనసుల్లోకి కాస్త కుతూహలాన్ని తొంగిచూచేలా చేసింది.

ఆ బంగళానంతటినీ కళ్ళు విప్పార్చుకుని చుట్టూ కలయజూచింది శ్రీచరణి. ఊహకందనంత ఖరీదైన, అందమైన ఫర్నిచర్‌తో అధునాతనంగా ఎంతో అపూర్వంగా ఉందనిపించింది. సినిమాల్లో చూచే రాజభవనం లాంటి బంగళా అది. క్రింద పరచిన కార్పెట్ విలువలో పదోవంతు ఖరీదుచేయదు తన బ్రతుకు. నిజంగా అశోక్ ఇంతటి ఐశ్వర్యవంతుడా? అంతలోనే ఆమె మనస్సులో ఏదో ముల్లులాంటి బాధ తలుక్కుమంది.

"చినబాబూ! నాన్నగారు మిమ్మల్ని తీసుకురమ్మంటున్నారు." లోపల నుండి వచ్చిన నౌకరు చెప్పేడు అశోక్‌తో.

"ఆఁ వస్తున్నాను. పద చరణ్! నువ్వు విశ్రాంతి తీసుకో! విమలా ఈమెకి గది చూపించు." గబగబా అనేసిన అశోక్ ఆ వచ్చిన నౌకరు వెంట లోపలికి వెళ్ళి అక్కడినుండి పైనఉన్న తండ్రి రాఘవవర్మగారి గదికి వెళ్ళేడు

రాఘవవర్మగారూ తల్లి ప్రతిమాదేవిగారూ సోఫాలో కూర్చుని అశోక్ కోసమే ఎదురుచూస్తున్నారు.

అశోక్ వంగుని తల్లిదండ్రుల పాదాలకి వినమ్రంగా నమస్కరించేడు. ప్రతిమాదేవిగారు అతని భుజాలను పట్టుకుని లేవదీసి తను ఇంకొంచెం వెనక్కి జరిగి ఇద్దరికీ మధ్యన కూర్చుండజేసింది. ఆప్యాయంగా అతని చెంపలు ఒళ్ళు నిమురుతూ "బాబూ! ఎన్నాళ్ళయిందిరా నిన్ను చూచి? ఇన్నాళ్ళూ ఈ అమ్మ గుర్తు రాలేదటరా? ఎంత చిక్కిపోయావు? బాగా పాడయిపోయావురా నాన్నా! ఏం మునిగిపోయిందనో వ్యాపారం వ్యాపారం అంటూ బిడ్డని తరిమి నాకు దూరం చేశారు." భర్తని నిష్ఠూరంగా చూస్తూ నీళ్ళునిండిన కళ్ళతో తన కంటే బాగా ఎత్తు పెరిగిపోయిన కొడుకు శిరస్సు వంచి ప్రేమగా నుదుటిని చుంబించింది.

"చిన్నప్పటినుండీ వేరే చెడు తలంపులు లేకుండా వ్యాపార దక్షత, వ్యవహార పరిష్కారాలు తెలుసుకుంటాడని అక్కడికి పంపించేనుగాని ప్రతిమా వాడిని దూరం చేసుకోవాలనిగాదు. కానీ వాడు మనల్ని పూర్తిగా మర్చిపోయి అక్కడే స్థిరపడిపోతున్నాడు." గంభీరంగా అన్నారాయన.

"మర్చిపోయి కాదు నాన్నగారూ! ఈ మధ్య వర్కర్స్ స్ట్రయిక్ అదీ

మొదలుపెట్టడంవల్ల చాలా చిక్కులు ఏర్పడి అనుకున్న టైమ్‌కి రాలేక పోయాను. క్షమించండి నాన్నగారూ!" ఇబ్బందిగా అన్నాడు అశోక్.

ప్రతిమాదేవి కొడుకు ఇబ్బందిని గ్రహించినట్టు "చాల్లెండి. వాడు వచ్చీ రాగానే నిష్ఠూరాలు మొదలుపెడితే ఎలా?" అని కొడుకు తలను ప్రేమగా నిమురుతూ "నాన్నా! అడ సెక్రటరీని తీసుకొచ్చేవట. నిజమేనా?" అంది.

"ఔనమ్మా! చాలా మంచి అమ్మాయి."అంటూ ఫ్రిజ్‌లోనుండి కోకో కోలాలు తీస్తున్న పనిమనిషిని చూచి "రాములమ్మా! సెక్రటరీ నొకసారి నేను రమ్మన్నానని చెప్పి తీసుకురా," అన్నాడు.

"అట్టాగే దొరా!" వెళ్ళిపోయింది రాములమ్మ.

"మగవాళ్ళెవరూ దొరకనట్టు ఆడపిల్లని వేసుకున్నావేమిటోయ్ సెక్రటరీ కింద?" కనుబొమలు ముడుస్తూ అడిగేరు రాఘవవర్మగారు.

"ఉద్యోగాల విషయంలో ఆడేమిటి? మగేమిటి నాన్నగారూ? ఇంటర్వ్యూకి వచ్చినవాళ్ళలో ఆ అమ్మాయే ఆ ఉద్యోగానికి యోగ్యురాల్లా కనిపించింది. వేసుకున్నానంతే."

రాఘవవర్మగారు తిరిగి ఏదో అనబోయేంతలో శ్రీచరణి, ఆమె వెనుక రాములమ్మా వచ్చేరు. శ్రీచరణి దృష్టి రాఘవవర్మగారిమీద క్షణకాలం నిలిచి పోయింది. ఆరడుగుల ఎత్తు, అంతకు తగిన లావుతో నిలువెత్తుగా పోతపోసిన విగ్రహంలా దృఢంగా గంభీరంగా ఉన్నారాయన. కళ్ళు తీక్షణంగా ఎదుటి వాళ్ళు ఎంతటివాళ్ళయినా వాళ్ళ గుండెలోతుల్లోని విషయాలు సైతం పసిగట్టేసే టట్టుగా ఉన్నాయి. నల్లగాపున్న గుబురుమీసాల్లోనుంచి నాలుగవవంతుకి పైగా తెల్ల వెంట్రుకలు తొంగిచూస్తున్నాయి. ఖరీదైన దుస్తుల్లో, వ్రేళ్ళకు వజ్రపు టుంగరాలతో అతి ఠీవిగా ఎదుటివాళ్ళ గుండెలను ఝల్లుమనిపించేట్టుగా ఉన్నారు.

"ఇదిగో ఈ అమ్మాయే నా సెక్రటరీ.శ్రీచరణి! చరణ్! వీరే మా అమ్మగారూ, నాన్నగారూ!" పరస్పరం పరిచయంచేశాడు అశోక్.

శ్రీచరణి యథాలాపంగా నమస్కరించింది. అందులో భక్తిభావంగాని, గౌరవంగాని పిసరంతకూడా లేదు.

శ్రీచరణిని నిలువెల్లా పరిశీలనగా చూశారు రాఘవవర్మగారు. ఆ అమ్మాయిలోని అపురూపమైన అందం ఆయన మనస్సుని ఉలికిపడేట్టు చేసిం దొక్క క్షణం. ఏదో ఆలోచనలో పడిపోయినట్టు ఆయన కనుబొమలు గంభీరంగా ముడిపడ్డాయి.

"చక్కగా ఉన్నావు.ఇలా కూర్చోమ్మా!" ఆమెను వాత్సల్యంగా చూస్తూ తన పక్కకుర్చీ చూపించింది ప్రతిమాదేవిగారు. ఆ కుర్చీలో కూర్చుంటూ ఆమెను చూచింది శ్రీచరణి. ఖరీదైన పట్టుచీరలో, వజ్రాల నగల అలంకరణతో, పెద్ద కుంకుమబొట్టుతో నిండుగా, అందంగా లక్ష్మీదేవిలా ఉంది ఆమె. ఆమెవంక పూజ్యభావంతో చూస్తున్న శ్రీచరణి మనసులో హఠాత్తుగా త్రివేణి మెదిలి ఆ పూజ్యభావం కాస్తా ఎగిరిపోయి ఈర్ష్య భగ్గున మండింది.

శ్రీచరణి మీదనుండి దృష్టి మరల్చి అశోక్‌ను చూస్తూ, "ఊ! ఎంతవర కొచ్చింది మన ఫ్యాక్టరీ? అసలు వర్కర్స్ ఎందుకు స్ట్రయిక్ చేయ వల్సివచ్చింది? నువ్వేవిధంగా శాంతింపజేశావ్?" అనడిగేరు రాఘవవర్మ గారు.

ప్రతిమాదేవిగారు భర్తను కసురుకున్నట్టుగా చూస్తూ, "ఏమిటండీ బిడ్డ ఆ చిక్కులతోనూ, సమస్యలతోనూ అసలే వేగిపోయివస్తే ఇక్కడ మీరు కూడా వాటినే అడుగుతున్నారు? ఫ్యాక్టరీ విషయాలు మాట్లాడుకోటానికి ఇక సమయం లేనేలేదేమిటి?" అంది.

"నా బుర్రెప్పుడూ వాటిగురించే ఆలోచిస్తూంటుంది. సరే కొడుకుతో ఏం మాట్లాడేసుకోవాలో మాట్లాడేసుకో!" నవ్వుతూ అన్నారు.

"నాన్నా! నీకు వయసు ముప్పయివరకూ ఉంది. ఇంకా ముదిరిపోతే ఏం బాగుంటుంది చెప్పు?" కొడుకువంక చూస్తూ మృదువుగా అంది ప్రతిమాదేవిగారు.

అశోక్ నవ్వేడు. "బాగుంది. వయసు ముదరకుండా మనమేం పట్టుకోలేంగా అమ్మా?"

"అలా వేళాకోళంగా దాటవేసెయ్యకు అశోక్. సుహాసిని బి.ఎ. పూర్తి చేసింది. మామయ్య తొందర పడ్తున్నాడు. నువ్వా ఏమీచెప్పవు. ఆడపిల్లని వాళ్ళు ఎంతకాలం ఇంట్లో పెట్టుకూర్చుంటారు చెప్పు?"

"అమ్మా!" ఇబ్బందిగా కదులుతూ అయిష్టంగా చూశాడు అశోక్.

"అసలు మనం వచ్చినప్పుడల్లా పెళ్ళి, పెళ్ళి అంటున్నామనే వాడసలు రావడం మానేస్తున్నాడు," అన్నారు రాఘవవర్మగారు కల్పించుకుంటూ.

"అలా అని పెళ్ళిమాట ఎత్తకుండా ఎలా ఉండగలమండీ? మన ఆశ లన్నీ వాడిమీదే కదా! పోనీ మామయ్య కూతురిని చేసుకోవడం ఇష్టంలేకపోతే

చెప్పెయ్యిబాబూ! బలవంతం ఏమీ లేదు. నాగపూర్‌లో జడ్జీ విజయ్‌చంద్రగారి అమ్మాయి ఎంతో బాగుంటుంది. వాళ్ళు ఫోటోకూడా పంపించేరు. పోనీ అది నచ్చుతుందేమో చూడు. ఫోటో తీసుకొస్తాను." లేవబోయింది ప్రతిమాదేవి గారు.

"అమ్మా!" ఆమె చెయ్యిపట్టుకుని వారించేడు అశోక్. "ఇప్పుడేం నాకు ఫోటోలవీ చూపించొద్దమ్మా. నేను తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను. మీతో చెప్పాచెయ్యకుండా దొంగపెళ్ళి మాత్రం చేసుకోను. మీతో చెప్పి మీ అంగీకారంతో, మీ ఆశీర్వాదంతోనే చేసుకుంటాను. సరేనా?" అంటూ శ్రీచరణి వంక చూస్తూ 'చూడు పరిస్థితి ఎలా ఉందో! ఇప్పుడేంచేయమంటావు?' కళ్ళతోనే అడిగేడు.

'దయచేసి తొందరపడొద్దు.' కళ్ళతోనే జవాబిచ్చిన శ్రీచరణి అప్రయత్నంగా రాఘవవర్మను చూసింది. అతని కళ్ళు తననే గమనిస్తున్నట్టు పసిగట్టిన శ్రీచరణి చూపులు క్రిందికి వాలిపోయాయి.

"హు! ఆ శుభసమయం ఎప్పుడొస్తుందో ఏమిటో!" అని ప్రతిమాదేవి గారు నిట్టూరుస్తూ శ్రీచరణితో, "చూడమ్మా! వీడి మొండితనం. వాడున్నది మాకొక్కడు. వీడి పిల్లాపాపలతో ఆడుకునే అదృష్టంకోసం మా మనసులెంత తహతహలాడుతున్నాయో వీడికెలా తెలుస్తుంది?" అంది.

"అమ్మా! నా కాకలి మండిపోతూంది." ఆమె ధోరణిని తప్పించే ఉద్దేశంతో కడుపు రాసుకుంటూ గారాబంగా అన్నాడు అశోక్.

"అయ్యో! నా మతి మండిపోను. అపరాహ్ణం వేళయింది. నా కా సంగతి గుర్తేలేదు. ఉండుబాబూ ఇప్పుడే భోజనాల ఏర్పాటు చేసివస్తాను," అంటూ లేచింది ప్రతిమాదేవిగారు.

ఆమెవెంట లేచి తన గదికి బయలుదేరింది శ్రీచరణి. 'హమ్మయ్య' అనుకున్నాడు అశోక్. ఏదో ఆలోచనలో నిమగ్నమయిన రాఘవవర్మగారు గుబురుమీసాలను సవరించుకుంటూ తల పంకించేరు.

## 8

మధ్యాహ్నం భోజనాలైన తర్వాత తనకివ్వబడిన గదిలోఫేన్‌కింద మెత్తనిబెడ్ మీద పడుకున్న శ్రీచరణికి ఏమీ తొయ్యకుండాపోయింది. షెల్ఫ్‌లో పుస్తకాలన్నీ తీసి ఒకటొకటి తీసి చూసి పక్కన పడేస్తూంది గాని ఏ ఒక్కదానిమీదా మనసు నిమగ్నం కాలేకపోతూంది. ఇప్పుడు తను చెయ్యవలసిందేమిటి? అన్న

ప్రశ్న మనసును తొలుస్తోంది. అశోక్‌తో మాట్లాడితేనన్నా కాస్త కాలం గడుస్తుందేమో ననుకుంది గాని అశోక్ అసలు కంటికే కనిపించడంలేదు. అతనితో మాట్లాడ్డానికి అక్కడున్న ఎంతమందో తహతహలాడ్తూ అతన్నో క్షణంకూడా వదలడంలేదు.

సాయంత్రం నాలుగవుతూండగా మేనేజర్‌గారి అమ్మాయి విమలను తీసుకుని ఆ ఎస్టేట్‌లో అక్కడకు దగ్గిరిగాఉన్న తోటలను చూడ్డానికి బయలుదేరింది శ్రీచరణి. మొదట వాళ్ళు కొబ్బరితోటలోకి వెళ్ళేరు. అక్కడున్న పని వాళ్ళకు శ్రీచరణిని పరిచయంచేసింది విమల. అందులో ఒకతన్ని చెట్టు ఎక్కించి బొండాలు దింపించింది అతను బొండాలు కొట్టివ్వగా ఇద్దరూ తాగేరు. ఆ నీరు తియ్యగా, రుచిగా ఉన్నాయనుకుంది శ్రీచరణి. విమల అక్కడున్న కొబ్బరిచెట్ల పేర్లు, రకాలు చెబుతూ, ఏడాదికి ఎంత దిగుబడి, వస్తుందో వివరిస్తూంది.

అక్కడనుండి కబుర్లు చెప్పుకుంటూ మధ్య మధ్య పూలమొక్కలతో, అడవితీగెలతో నేత్రపర్వంగా ఉన్న దృశ్యాలు చూస్తూ, నడవసాగేరు విమలా శ్రీచరణీ.

వాళ్ళు ద్రాక్షతోట సమీపంవరకూ వచ్చేరు. కబుర్లు చెబుతున్న విమల హఠాత్తుగా ఆగిపోయింది అక్కడ కారు ఆగిఉంది.

"పెద్దయ్యగారు వచ్చినట్టున్నారమ్మా!" అంది జంకుగా.

"ఏం వస్తే? మనంకూడా ద్రాక్షతోట చూడ్డాని కొచ్చేమంటే కోప్పడతారా?" అడిగింది శ్రీచరణి.

"ఆయన ఎదురుగుండా మనం తిరిగిచూడ్డం బాగుండదు కదమ్మా?"

"అలాగని ఆయన రూల్స్ ఏమైనా పెట్టేరా!"

"రూల్స్ అవీ ఏంకాదమ్మా! ఆయన ఎదురుగుండా మేం ఎవరం తిరగం. ఆయన ముందునుంచి నడవాలంటేనే మాకెంతో బెదురుగా, భయంగా ఉంటుంది. ఈయనెంత పెద్దపులిలాంటి మనిషో చినబాబంత సరదామనిషి. చిన్నా పెద్దా అనకుండా అందరితో కలుపుగోలుగా, స్నేహంగా ఉంటారు. అందుకే ఆయ నంటే ఇక్కడున్న అందరికీ ఎంతో ఇష్టం. ఆయన వచ్చేరంటే పండుగ వచ్చి నంతగా సంబరపడతారు."

"అది సరే. మరి పెద్దాయనంటే మీ అందరూ ఎందుకు భయపడతారో నాకర్థం కావడంలేదు ఆయన మీకు ఎంత యజమానైతే మాత్రం మీరు పని

చేస్తున్నారు కాబట్టి ఆయన మిమ్మల్ని పోషిస్తున్నారు. మీ మధ్య అంతస్థు భేదాలేతప్ప ఆయనా మీరూ మనుషులేగా! ఏ దెయ్యాన్నో, భూతాన్నో చూసినట్టు ఎందుకు భయపడాలి?"

"అమ్మా!" తొట్రుపడినట్టుగా చూసింది విమల.

అంతలో అటువైపుగా ద్రాక్షతోటలోనుండి తోటమాలిని ఏవో అధికారంగా ప్రశ్నిస్తూ, ఆజ్ఞలు జారీచేస్తూ గంభీరంగా నడిచివస్తున్నారు రాఘవవర్మగారు. ఆయన వీళ్ళనిచూచి ముందు ఆయనే పలకరించేరు.

"ఈ అమ్మాయికి తోట చూపించడానికి తీసుకొచ్చేవా విమలా?" అంటు ఔనన్నట్టు తలూపింది భయంగా విమల.

"సరే! ఇంటిదగ్గిర అమ్మగారు నీకోసం చూస్తున్నారు. నువ్వు వెళ్ళు. ఈ మెకి నేను తోట చూపిస్తానులే.

"అయ్యగారూ!" తెల్లబోయింది విమల.

"వెళ్ళు! వెళ్ళు!"

"సరే నయ్యగారూ!" అక్కడనుండి వెళ్ళడానికి కదిలింది విమల. తమందరికీ హడల్ పుట్టించే అయ్యగారు తమక్రింద పనిచేసే ఒక అమ్మాయికి స్వయంగా తోట చూపించబోవడం చెప్పలేనంత ఆశ్చర్యంగా, ఊహకందనంతటి విచిత్రంగా ఉందామెకి.

"పద!" అన్నారు రాఘవవర్మగారు దర్పంగా ముందుకి దారి తీస్తూ! శ్రీచరణికి కూడా కాస్త ఆశ్చర్యంగా ఉన్నా బొమ్మలా ఆయన్ను అనుసరించింది.

ద్రాక్ష పందిళ్ల నిండా విరగబూసి గుత్తులుగుత్తులుగా వ్రేలాడుతున్నాయి. ఆ పందిళ్లకు కాస్త దూరంగా తోటమాలి ఉండడానికి కాబోలు కాటేజిలాంటిది ఉంది.

"తింటానికి కొన్ని గుత్తులు కోయించమంటావా?" ఏ సంబోధనా లేకుండా అడిగేరు రాఘవవర్మగారు.

"వద్దు!" తల అడ్డంగా ఊపింది. తను ద్రాక్షతోటను ఎప్పుడూ చూడకపోవడంతో కళ్ళు పెద్దవిచేసుకొని చూస్తూంది.

"తోట ఎలా వుంది? బావుందా?"

"చాలా బాగుంది"

"ఇంత విస్మయత్వంగా చూస్తున్నావు ఈ తోటలూ, పంటలూ, సిరులూ చూస్తూంటే నీలో ఆశ మరింత గట్టిగా నాటుకుపోతుంది కదూ?" వ్యంగ్యంగా అడిగేరు రాఘవవర్మగారు, గుబురుమీసాలు సవరించుకుంటూ. ఉలిక్కిపడ్డట్టు చూసింది శ్రీచరణి.

"మీ భోగభాగ్యాలు చూసినంత మాత్రంలో నాకెందుకు ఆశ పుట్టాలి?" చురుగ్గా చూస్తూ అంది.

"ఎందుకా?" గలగల నవ్వేరు రాఘవవర్మగారు. "నీ మనసు నడుగు, చెప్తుంది. అది సరే మీ నాన్నగారు పేరేమిటన్నావ్?"

"నేనేమీ ఇంకా మీతో అనలేదే! అసలు మీరడిగినా నేనేం చెప్పలేను."

"ఏం?"

"నాకు నాన్నగారే లేరు."

"అదెలా? చనిపోయారా?"

"ఊహూ!" తల అడ్డంగా ఊపింది శ్రీచరణి. ఆమెలో ఆయనమీద కచ్చ లాంటిది బయలుదేరింది. "మాలాంటివాళ్ళకి తండ్రులు ఉండరు. మేము కళావంతులం."

"మైగాడ్!" తుళ్ళిపడ్డారు రాఘవవర్మగారు. రెండు క్షణాలవరకూ ఏమీ మాట్లాడలేకపోయారు. క్రమంగా ఆయన కళ్ళు ఎర్రబడ్డాయి. పళ్ళు పటపట మన్నాయి. ఆయనలోని మార్పుని శ్రద్ధగా కనిపెడ్తున్న శ్రీచరణి నిర్లక్ష్యంగా తలెగరేసింది.

ఆమెవంక నిరసనగా చూస్తూ "ఓహో! అదన్నమాట సంగతి. నువ్వింకా ఏ మామూలు పేదపిల్లవో, నిన్ను అదుపులో పెట్టుకోమని మీ తండ్రికి ఉత్తరం రాద్దామనుకుంటున్నాను కానీ నాకా శ్రమ తప్పించావ్?" అన్నారు.

"పేదవాళ్ళంటే మీ కంత కోపం ఎందుకు బాబూ?"

"వాళ్ళంటే వొట్టికోపమే. కానీ మీలాంటివాళ్ళంటే అంతకు వెయ్యి రెట్లు అసహ్యంకూడా!" కంపరంగా అన్నారు రాఘవవర్మగారు.

"మేం ఏం తప్పుచేశామని?" తనలో కలుగుతూన్న ఆగ్రహాన్ని బలవంతంగా అణుచుకుని ఎంతో ఓర్పుగా అడిగింది శ్రీచరణి.

"ఏం తప్పా? ఇప్పుడు నువ్వు చేస్తున్నదేమిటి? నువ్వుకూడా ఎందుకు ఉద్యోగానికి ఎగబడాలి? మీకెందుకు ఉద్యోగాలు?"

"ఏం! మేమెందుకు ఉద్యోగాలు చెయ్యకూడదు? మేం ఉద్యోగాలు చేస్తే కూడా తప్పేనా?"

"మీరు ఉద్యోగాలు చెయ్యడంలో లేదు తప్పు. ఉద్యోగాల పేరు చెప్పి మనసులో పెద్ద ప్లానుపెట్టుకుని మాలాంటి డబ్బున్నవాళ్ళకి గాలం వెయ్యడం తప్పు." ఆగ్రహంగా అన్నారు.



"బాగుంది. మా పొట్టకూటికి మేము ఉద్యోగాలు చేస్తాము. అంతమాత్రంలో మా కులం పేరు విని మీ నీడను చూసి మీరే జడుసుకుంటే ఎలా? మీరు మామూలుగా అందరి విషయం ఊహిస్తూ అలా అంటున్నారో, లేక పూర్వానుభవంతో అంటున్నారో నాకు తెలియడంలేదు "

"ఏమన్నావ్? నా పూర్వానుభవం గురించి మాట్లాడేటంత ధైర్యమా నీకు? నా సంగతి నీకు పూర్తిగా తెలియదు. నేను తలుచుకుంటే నిన్నేమైనా చెయ్యగలను." కర్కశంగా అరిచేరాయన. అంతులేని ఆగ్రహంతో ఆయన కనుబొమలు పైకిలేచి వికృతంగా ఉన్నాయి. పదును పెట్టిన కత్తిఅంచులా మెరుస్తున్నాయి ఆయన కళ్ళు.

శ్రీచరణ్ తిరిగి ఏదో అనబోయేంతలో అక్కడికి చరణ్! అని పిలుస్తూ గబగబా రాసాగేడు అశోక్.

"నీ సంగతి తరువాత తేలుస్తాను." కొడుక్కి వినపడకుండా మెల్లగా అన్నారు రాఘవవర్మగారు.

అశోక్ దగ్గరికి వచ్చేడు. "నేను వస్తుంటే విమల ఎదురుపడి చెప్పింది. తోట చూపించే శ్రమ మీ కెందుకు నాన్నగారూ? నేను చూపించి తీసుకు వస్తాను, మీరు పదండి." అన్నాడు.

"సరే! త్వరగా వచ్చేయండి." గంభీరంగా అడుగులు వేసుకుంటూ వాళ్ళను దాటి వెళ్ళిపోయారు రాఘవవర్మగారు.

ఆయన కారు స్టార్ట్ అయిన శబ్దం విన్పించిన తరువాత అశోక్ శ్రీచరణిని చూస్తూ, "నాన్నగారు అంత కోపంగా ఉన్నారేమిటి చరణ్! మన సంగతేమైనా ఆయన దగ్గిర కదిపేవా?" అనడిగేడు.

శ్రీచరణి నవ్వడం మొదలుపెట్టింది.

"నేను అడుగుతుంటే ఏమిటా నవ్వు?" విసుగ్గా అడిగేడు అశోక్.

"నవ్వకేం చెయ్యమంటారు అశోక్. మీ గొప్పవాళ్ళ మనసులు ఎంత గొప్పగా ఉంటాయో అర్థమైన తరువాత?" నవ్వాపుకుంటూ అంది.

"అంటే" కనుబొమలు ముడుస్తూ అడిగేడు అశోక్.

"అంటేనా? మనం వస్తున్నప్పుడు దారిలో మీరు నన్ను కాబోయే భార్యగా మీవాళ్ళకి పరిచయం చేస్తానంటే ఏమన్నాను?"

"సామాన్యుడికి మా వాళ్ళ మనసుల్లో ఎటువంటి స్థానాలుంటాయో తెలుసుకోవాలన్నావు!"

"అన్నానా? మరప్పుడు మీరేమన్నారు. మా వాళ్ళని అవమానిస్తున్నావు అని అన్నారు. ఇప్పుడు చూడండి. మేం కళావంతులం అని చెప్పగానే మీ నాన్న గారు మండిపడ్డారు. నేను మీ ఆస్తిపాస్తుల కోసం ఏదో పెద్ద ప్లానుతో మీకు గాలంవెయ్యడం కోసమే ఉద్యోగాని కొచ్చినట్లు మాట్లాడేరు. కులం పేరు వినగానే ఇంతగా జడుసుకొనే మీ వాళ్ళ మనస్తత్వాన్ని ఏవిధంగా తీసుకోవాలో కాస్త చెప్పండి."

"ఓ మైగాడ్! ఎంత పనిచేశావు చరణ్? అలా అని ఎందుకు చెప్పేవు? ఏదో మెల్లగా చెప్పి ఒప్పిద్దామనుకున్నాను. మొదటికే మోసం తెచ్చిపెట్టేవు. ఛీ! ఛీ! వేళాకోళానికైనా ఒక హద్దు వుండాలి."

"వేళాకోళం కాదు అశోక్, నిజమే!"

"ఛీ! నోర్ముయ్! నా దగ్గిరకూడా ఎందుకు అబద్ధం." కోపంగా అన్నాడు.

"అబద్ధంకాదు అశోక్! నిజంగా నేను కళావంతుల పిల్లనే. ఈ విషయం మీకు ముందే తెలిసుంటే నాపట్ల ఇంత మమకారాన్ని పెంచుకునుండేవారు కాదా! ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నారా ?"

"చరణ్!" అయోమయంగా చూస్తూ పిలిచేడు అశోక్.

"అశోక్! నేను మిమ్మల్ని పెళ్లిచేసుకోమని ప్రాధేయపడ దల్చుకోలేదు. మీరు నన్ను చేసుకోవాలని గట్టిగా నిర్ణయించుకున్నప్పుడు మీ తల్లితండ్రుల అయిష్టాన్ని నేనేమాత్రం ఖాతరు చేయను. ముందు మీరుమీ గుండెలమీద చెయ్యి వేసుకొని ఒక కళావంతుల పిల్లను భార్యగా చేసుకోడానికి సిద్ధంగా ఉన్నారో లేదో తేల్చుకోండి. అది తేల్చుకున్న తరువాతనే మళ్ళీ మీరు మన ప్రేమగురించీ పెళ్ళిగురించీ మాట్లాడండి." ఖచ్చితంగా అంది శ్రీచరణి.

"చరణ్"! ఏదో చెప్పబోయాడు అశోక్.

"ఇప్పుడు మీరేమీ చెప్పొద్దు. త్వరపడి నిర్ణయాలు చేసుకోవడం ఎవరికీ మంచిదికాదు. బాగా ఆలోచించుకున్న తరువాతే మీరొక నిర్ణయానికి రండి. పదండి పోదాం."

ఆమె వెనుక ఏదో ఆలోచనలో పడిపోయినవాడిలా మెల్లగా నడవసాగేడు అశోక్.

* * *

## 9

"అశోక్! నువ్వా పిల్లని ఉద్యోగంనుండి వెంటనే తీసెయ్యాలి!" కొడుకుని తన గదికి రప్పించి అధికార పూర్వకంగా అన్నారు రాఘవవర్మగారు. అక్కడున్న ప్రతిమాదేవిగారు, అశోక్ కూడా ఉలిక్కిపడ్డారు.

"అదేమిటండీ? ఆ అమ్మాయి మంచి అమ్మాయిలాగే కన్పిస్తుంది." అన్నారు ప్రతిమాదేవిగారు. ఆయన ఆమె మాట విన్పించుకోనట్టు అశోక్ వంక చూసేరు.

"ఆ అమ్మాయి పనిలో ఏ లోటుపాట్లు కనిపించలేదు నాన్నగారూ! ఏ కారణం లేకుండా తీసెయ్యడం బావుండదు. అదీగాక మళ్ళీ మనకి పనిలో సమర్థవంతమైన వ్యక్తి అంత తొందరగా దొరక్కపోవచ్చు."

"ఉద్యోగాల కోసం ఎంతోమంది ఇంతకు వెయ్యిరెట్లు సమర్థులైన పని తెలిసిన కోటానుకోట్లమంది పడిగాపులు పడుతున్నారు అశోక్! నీ కుంటి సాకులు నా దగ్గిర చెప్పకు. వెంటనే ఆ అమ్మాయిని మాన్పించి ఎవరైనా యువకుణ్ణి వేసుకో!"

ఇబ్బందిగా కదిలేడు అశోక్." ఇంత సడన్‌గా తీసెయ్యడం వీలుపడదు నాన్నగారూ !"

"అశోక్ !" కోపంగా అరిచేరు రాఘవవర్మగారు !

"అబ్బ ! మీరూరుకోండి." కల్పించుకుంది ప్రతిమాదేవిగారు. "వాడికి నచ్చినవాళ్ళను, అనుగుణంగా నడుచుకునేవాళ్ళను వేసుకుంటాడు." వాడి ఆఫీసు, వాడు క్రింద ఉద్యోగులగురించి మనం కల్పించుకుంటూ ఆంక్షలు విధించడం ఏంబాగుంటుంది చెప్పండి. వాడి మనసు నొచ్చుకోదూ ! ఇంకా ప్రతి చిన్నదీ మనిష్టప్రకారమే వాడు చేయాలనుకోడానికి వాడింకా పసివాడేం కాదుగా !"

"ప్రతిమా ! నీకు తెలీదూరుకో !" అన్నారు రాఘవవర్మగారు.

"ఏమిటండీ తెలియనిది? మీకు మొదటినుండి గట్టిగా, అధికారంగా చెప్పడమే తప్ప మృదువుగా చెప్పడం చేతకాదు." అంటూ అశోక్ వైపు వాత్సల్యంగా చూస్తూ, "నువ్వు వెళ్ళి విశ్రాంతి తీసుకో నాన్నా! మీ నాన్నగారితో నీకేమిటిగాని," అంది. ఆమె అలా అన్నదే తడవుగా బ్రతుకు జీవుడా అనుకుంటూ అక్కడనుండి బయటపడ్డాడు అశోక్.

"ప్రతిమా ! నేను వాణ్ణి మందలించడానికి రప్పిస్తే నువ్వేమిటి అలా దాట వేసేశావు ?"

"మందలించడానికి వాడేం తప్పు చేశాడండీ ?"

"తప్పుచేశాడని కాదు ప్రతిమా ! అలా వాడికి ఆడపిల్లలతో పరిచయం, స్నేహం శృతిమించి మన వంశానికి మచ్చ తీసుకొచ్చేలా పరిణమిస్తుందేమో నని నా భయం. అందుకని అటువంటి వాటిని మొగ్గలోనే తుంచివేస్తే మంచిది."

"చాలూరుకోండి. ఆడపిల్లలకి ఉద్యోగాలిచ్చినంత మాత్రాన నా కొడుకు వాళ్ళ కొంగుపట్టుకు తిరిగేటంత అల్పుడు కాదు. మనం వాడిమీద ఆమాత్రం నమ్మకం లేకుండా ఉన్నామని వాడనుకుంటే వాడి మనసు ఎంత బాధపడుతుంది? అయినా వంశం, సాంప్రదాయం గుర్తులేనివాడు, విచక్షణ తెలియనివాడు కాడు అశోక్. వాడు వంశానికి మచ్చ తెచ్చేపని ఎప్పటికీ చెయ్యడు. వాడిమీద నా కా మాత్రం నమ్మకం వుంది." కొడుకు పట్ల ఎనలేని విశ్వాసంతో అంది ప్రతిమాదేవిగారు.

# 10

స్నానంచేసి వచ్చిన శ్రీచరణి అద్దంముందు నిలబడి జడవేసుకుంటుంది. అక్కడికి విమల వచ్చింది. ఆమె రాక అద్దంలో చూచిన శ్రీచరణి వెనుదిరిగి నవ్వుతూ "రా విమలా !" అంది.

"మిమ్మల్ని పెద్దమ్మగారు రమ్మన్నారమ్మా !" అని చెప్పింది విమల.

"నన్నా ? ఇప్పుడాయన ఎక్కడున్నారు ?"

"ఆరి గదిలోనే ఉన్నారమ్మా !"

"సరే, వస్తున్నాను పద." జడవేసుకోవడం పూర్తిచేసిన శ్రీచరణి దాన్ని వెనక్కు విసురుగా వేసుకుంటూ ఆమె వెంట నడిచింది.

రాఘవవర్మగారు తనగదిలో సోఫాలో ఠీవిగా కూర్చుని పైప్ కాలుస్తూ ఆలోచనా నిమగ్నులై ఉన్నారు. గదిలో కడుగుపెట్టిన శ్రీచరణినీ, విమలనూ చూస్తూ శ్రీచరణి నుద్దేశించి "రా రా! నీ కోసమే చూస్తున్నాను," అన్నారు. శ్రీచరణి చుట్టూ చూసింది. అక్కడ ఆయన తప్ప ఇంకెవరూ లేరు. ప్రతిమాదేవిగారి జాడే లేదు. ఆమె ఆ సమయంలో పూజామందిరంలో ఉంటుంది. ఆమె పూజ ఇపుడప్పుడే తేలేదికాదు. సరిగ్గా రెండు మూడు గంటలకు, తక్కువ గాకుండా చేస్తుంది పూజ

"విమలా! నువ్వు వెళ్ళి పనిచూసుకో!" విమలకి ఆజ్ఞాపించారు రాఘవ వర్మగారు. విమల తలూపుతూ అక్కడనుండి వెళ్ళిపోయింది. ఒంటరిగా అక్కడ మిగిలిన శ్రీచరణికి మొండి ధైర్యం, తెగింపూ వచ్చేశాయి. ఈయన నన్నేంచేస్తారు? కాకపోతే మాటలతో బాధిస్తారేమో! తనకూ వచ్చు మాటలు. అసలు మాటల బాణాలు వదలాలనేగా తనుద్దేశమూను.

కూర్చున్న రాఘవవర్మగారు శ్రీచరణిని ఆపాదమస్తకం కంటగింపుగా పరిశీలించేరు. ఆయన ఆమెను కూర్చోమనలేదు.

"ఊ! ఇప్పుడు చెప్పు నీ అసలు ఉద్దేశమేమిటో !" తీక్షణంగా చూస్తూ అడిగేరు.

"ఉద్దేశ మేముంది. అందరిలా ఉద్యోగాని కొచ్చేను. ఉద్యోగం చేసుకుంటున్నాను. అంతే."

"హాయిగా, దర్జాగా కాలిమీద కాలు వేసుకుని నీ ఈ అందంతో సంపా దించుకునే రాజబాట లాంటి మార్గముండగా, పొట్టకూటికి మాత్రమే సరిపోయే ఈ ఉద్యోగాని కెందుకొచ్చినట్టు?"

"ఎవరిష్టం వాళ్ళది."

"ఓహో! నీకు ఉద్యోగం చెయ్యడమే ఇష్టమన్నమాట. మీలాంటి వాళ్ళు ఉద్యోగాల ముసుగు వేసుకుని నీతిగా ఉన్నాము అని చాటుకోడంతో కూడా మగవాళ్ళకి ఆకర్షణ, మరింత అసక్తి కలిగించే విద్య ఉందన్నమాట. మరయితే మా వాడినే ఎందుకు పట్టుకున్నావు. వాడు తప్ప నీకు ఉద్యోగాలిచ్చే వాళ్ళు దొరకలేదన్నమాడ."

"నాకు దొరక్కాకాదు. నాలాంటి సెక్రటరీ ఆయనకే దొరకక్క ఇంటర్వ్యూ కొచ్చిన అంతమందిలో నన్ను పట్టుకున్నారు."

"నీ రొట్టెవిరిగి నేతిలో పడ్డట్టు నీ ప్లాను సక్సెస్ అయిందని సంబర పడ్డావన్నమాట."

"అప్పుడే ఎక్కడ సక్సెస్ అయింది? ఉద్యోగం దొరికింది అంతే. సక్సెస్ కావడానికి ఇంకా చాలా చేయవల్సిఉంది." వెటకారంగా చూస్తూ కవ్విస్తున్నట్టుగా అంది శ్రీచరణి.

"ఏమన్నావ్?" పళ్ళు పటపట కొరుకుతూ తనలో కలిగిన అంతులేని ఆగ్రహాన్ని తమాయించుకున్నారు రాఘవవర్మగారు.

"మీలాంటి వాళ్ళు డబ్బుకోసమే ఏ పని చేసినా చేస్తారు. మా వాడిని వదిలి పెట్టెయ్యడానికి నీకెంత కావాలో చెప్పు. నువ్వెంతడిగినా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను."

"ఇవ్వడానికి మీరు సిద్ధంగా ఉన్నా, తీసుకోవడానికి నేను సిద్ధంగా లేను. ఉన్నకొలదీ డబ్బు సంపాదించుకోవాలనే పిచ్చి తాపత్రయం మీలాంటి వాళ్ళకే గాని పొట్ట పోషించుకోవడం కోసమే పాటుపడే మాకుండదు. వదిలిపెట్టమని నాతో చెప్పడం దేనికి? మీ వాడితోనే చెప్పండి." సవాల్ చేస్తున్నట్టుగా అంది శ్రీచరణి.

"హద్దుమీరి మాట్లాడుతున్నావ్!" కఠినంగా అరిచేరు.

"ఆడపిల్లననైనా చూడకుండా ముందు మీరు నా విషయంలో హద్దు మీరిన తరువాతనే నేనూ హద్దుమీరవలసి వచ్చింది."

"నీకూ నాకూ పోలికా?" రాఘవవర్మగారి కళ్ళు ఎర్రబడ్డాయి.

"కాక? అంతరం, కులాల భేదాలు తప్పిస్తే మనిద్దరం మనుషులం. కోపం తెచ్చుకోడానికి, బాధపడ్డానికి ఇంకా మిగతా అన్ని అనుభూతులకి మనిద్దరికీ ఒకే విధమైన మనసులున్నాయి. అయితే అంతస్థు, అధికారం ఉంది గనుక

మి మాట చెల్లుతుంది. నా మాట చెల్లదు. అంతే తేడా!" తిరస్కారంగా చూస్తూ అంది శ్రీచరణి.

"హుఁ! మీలాంటి వాళ్ళకి ముందు వచ్చేవి మాటలే. వాటిని ఏ సందర్భంలో ఎలా ఉపయోగించాలో మీకు బాగా తెలుసు. ఇటువంటి మాటల గాలంతోనే మావాణ్ణి అమాయకుణ్ణి చేసి నేర్పుగా బుట్టలో వేసుకున్నావు ...."

"రామ.... రామ. మీ కొడుకు అమాయకుడా? అతనిలో ప్రవహిస్తున్నది మీ రక్తమేగా. తను కావాలనుకున్న ఆడపిల్లని నేర్పుగా వలపన్ని ఆమెని వశపర్చుకుని ఆనక అవసరం తీరాక అతి లాఘవంగా అవతలపడేసే అతి తెలివి మీనుండైనా సంక్రమించి ఉండదంటారా?"

రాఘవవర్మగారిలోని ఆగ్రహం తాడి ప్రమాణాన లేచింది. అమాంతం పీక నులిమి అవతలపారెయ్యాలన్నంత కోపంతో చివ్వున సోఫాలోనుండి లేచేరు.

"ఛీ! పాతకీ! నన్నే అవమానించడానికి తయారయ్యావా? మా వంశ గౌరవం నాశనం చెయ్యాలనుకున్న నిన్ను నేను బ్రతకనివ్వను. ఎందుకూ పనికిరాని నువ్వు నన్నిష్టమొచ్చినట్టు వాగుతూ ఇంత దారుణానికి పూనుకుంటావా?" ఉద్రేకపడసాగేరు రాఘవవర్మగారు.

"ఆగండాగండి రాఘవవర్మగారూ! ఎందుకూ పనికిరానా నేను? మీ అబ్బాయి నన్ను వదిలిపెట్టకుండా ఉంటే నేను మీకు వారసులనివ్వడానికి తప్పక పనికి వస్తాను. ఇక వంశం మాటకొస్తే నా వల్ల వంశానికి మచ్చ ఏర్పడితే ఏర్పడొచ్చేమోగాని, నేను కన్న మీ వంశాంకురాలు మాత్రం మీ వంశాన్ని తప్పక నిలుపుతారు." మొండిగా తలెగరేస్తూ కసిగా ఒక్కొక్క మాట పట్టి పట్టి వాడి బాణాల్లా విసిరింది.

రాఘవవర్మగారు హఠాత్తుగా తుళ్ళిపడ్డారు. ఆయన శరీరం ఒక్కసారిగా గగుర్పొడిచింది. గుండె ఒక్కసారి ఆగి తిరిగి కొట్టుకుంది. మనసంతా చెప్పలేని అలజడికీ, కలవరానికీ లోనయి వికారంగా తయారయింది. శ్రీచరణిని అప్పుడే చూస్తున్నట్టు వింతగా, కొత్తగా ఏ దెయ్యాన్నో, భూతాన్నో చూసినట్టు చూస్తూ "నువ్వు.... నువ్వు అసలెవరు?" అనడిగేరు పొడారిపోతున్న గొంతుతో.

చిద్విలాసంగా నవ్వింది శ్రీచరణి. "నేను నేనే! అశోక్‌గారి సెక్రటరీని."

రాఘవవర్మగారు తిరిగి ఏదో అనబోయేంతలో ప్రతిమాదేవిగారు హారతి పళ్ళెం తీసుకుని అక్కడికి వచ్చింది.

"ఓ! శ్రీచరణీ! ఇక్కడే వున్నావామ్మా? ఇదిగో ప్రసాదం తీసుకో."

అంటూ రెండు అరటిపళ్ళు, పటికిబెల్లం చేతుల్లోపెట్టింది ప్రతిమాదేవిగారు. శ్రీచరణి భక్తిగా హారతి కళ్ళకద్దుకుని ప్రసాదం తీసుకుంది.

ప్రతిమాదేవిగారు భర్తకికూడా హారతి ఇవ్వబోతూ ఆగి, "అదేమిలా ఉన్నారు ?" అనడిగింది.

"ఏం లేదమ్మా ! పాపం పెదబాబుగారికి ఇందాకట్నుంచీ దాహంతో నోరెండి పోతూందట. కాస్త మంచినీళ్ళివ్వండి," అని చెప్పేసి రీవిగా అడుగులేసుకుంటూ అక్కడినుండి బయటకు నడిచింది శ్రీచరణి.

"ఇక బాబుకి చెప్పడం అయిపోయింది. ఈమెకి చెబుతున్నారా ఉద్యోగం మానేయమని. ఏం చాదస్తమండీ బాబూ మీది?" అంది ప్రతిమాదేవి.

"అదేంకాదూరుకో ! కాస్సేపు నన్ను ఒంటరిగా ఉండనియ్యి." అన్యమనస్కంగా కసురుకున్నారు భార్యని రాఘవవర్మగారు.

## 11

రాత్రి ఏడూ, ఎనిమిది అవుతూండగా అశోక్ రమ్మని కబురు పంపగా అతనిగదిలో కడుగుపెట్టింది శ్రీచరణి. గుమ్మంలోనే ఆగిపోయిన శ్రీచరణి కళ్ళు తిప్పుకోలేనట్టుగా చూస్తూండిపోయింది ఆ గదిని.

ఆ గది ఆ బంగళాలో ఉన్న గదులకంటే ఎంతో ప్రత్యేకంగా, అద్భుతంగా ఉందనిపించింది. నీలంరంగు లైటుకాంతిలో దివ్యంగా మెరిసిపోతూంది. అక్కడున్న కిటికీలకు, ద్వారాలకి నీలంరంగు పట్టుతెరలు ఉన్నాయి. సోఫా కవర్లుకూడా పట్టువే, నీలంవే. ఆ గదిలో ఆ వంశీకుల ఫోటోలు పెద్ద పెద్ద పూలదండలు వ్రేలాడదీసి ఉన్నాయి. ఎంతో ఖరీదైన చాలా కొత్త ఫేషన్‌లో ఉన్న డ్రెస్సింగ్ టేబుల్, ఒక వైపు టేబుల్‌మీద అమర్చిన టెలివిజన్ ఆ ఇంటి ఐశ్వర్యాన్ని, ఆ గది సొంతదారుని కివ్వబడిన విలువను చాటి చెప్తున్నాయి. శ్రీచరణిని అన్నిటికంటే ఎక్కువగా ఆకర్షించినది ఏమంటే కిటికీకి దగ్గరగా రోజ్‌వుడ్‌తో చేసిన గుండ్రంగా ఉన్న వేదికలాంటి బల్ల, దానిమీద పరచబడిన ముఖమల్‌గుడ్డపై అతి పదిలంగా, ఎంతో అపురూపంగా ఉన్న అతి ఖరీదైన వీణా ! ఆ వీణను మీటడానికి ఆమె మనసు ఎంతో ఉబలాట పడుతూంది.

కథల్లోనూ, కలల్లోనూ మాత్రమే ఉండే దేవలోకం మనకి దూరంగా ఎక్కడో లేదు. ఆ దేవేంద్రలోకం, ఆ ఇంద్రభవనం, నందనవనం ఇవన్నీ ఐశ్వర్యవంతుల ఇళ్ళలోనూ, వాళ్ళ పాదాలముందే ఉన్నాయనిపించింది శ్రీచరణికి.




"అక్కడే ఆగిపోయావేం ? రా చరణ్!" మంచంమీద అడ్డంగా పడుకున్న అశోక్ పిలిచేడు. ఆశ్చర్యంలోనుండి, ఆ అనుభూతిలోనుండి కోలుకోలేనట్టుగా మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చింది శ్రీచరణి. ఏర్ కండిషన్డ్ చేయబడ్డ ఆ గది ఎంతో చల్లగా, హాయిగా ఉంది.

అశోక్ ఆమెకి మంచమ్మీద తన ప్రక్క చోటు చూపించేడు.

"ఏమిటలా విచిత్రంగా చూస్తున్నావ్ చరణ్?"

"మీ గదినే. ఇందులో ప్రవేశిస్తేనే కలల్లో తేలిపోయినట్టుంటుంది. ఇటువంటి గదిని నే నెప్పుడూ చూడలేదు."

అశోక్ అందంగా నవ్వేడు. "నిజం! అయితే రాణీగారికి తమగది నచ్చినట్టేనన్నమాట."

శ్రీచరణి ఉలిక్కిపడి అతనివంక చూసింది. "అంటే ?"

"అంటే ఏముంది? నిన్న నీవు చెప్పేవుగా నన్ను ఆలోచించుకుని నా నిర్ణయం ఏదో చెప్పమని! నిన్ను నేను చేసుకోడానికి నిర్ణయించుకున్నాను. నీ కులం, తల్లిదండ్రులు ఎవరైనా నాక్కావలసింది నీ గుణం. అది నాకు పూర్తిగా తెలుసు. నాకు నీతో, నీ గుణంతో తప్ప ఇక పేటితో సంబంధం లేదు. అసలు నిన్ను నేను ప్రేమించేముందు నువ్వేకులందానివీ, నిన్ను ప్రేమించొచ్చా, ప్రేమించకూడదా అని ఆలోచించలేదు. ప్రేమకి సహజంగా అంకురార్పణ జరిగి అది సహజంగా పెరిగి పుష్పిస్తేనే అందం, ఆనందం. నాకు నీవు కావాలి చరణ్! నే నీరోజే నాన్నగారితో చెబుతాను." ఆవేశంగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని చుంబిస్తూ అన్నాడు అశోక్.

"ఆగండాగండి అశోక్‌గారూ! మీ రప్పుడే తొందరపడి మీ నాన్నగారితో చెప్పేయకండి. ఇంకా నాకు కొంత వ్యవధి కావాలి. అప్పుడు చెబుదురుగాని. అసలింతకీ మీ నిర్ణయం తిరుగులేనిదేనా? లేక అవసరంకోసం పెళ్లి చేసుకుని ఆ తరువాత మోజుతీరగానే వదిలిపెట్టేసి డబ్బుబలంతో నా నోరు నొక్కేసే నిర్ణయమా?"

నివ్వెరపోయాడు అశోక్. "నేను నీ కలా కన్పిస్తున్నానా చరణ్! అసలు డబ్బుగలవాళ్ళంటే నీకెందుకింత కక్ష. ఎవరో ఏదో చేస్తే మొత్తం డబ్బున్న వాళ్ళందరూ దుర్మార్గులేనా?"

"ప్రశ్నలు అలా ఉంచండి. ముందు నే నడిగిందానికి జవాబు చెప్పండి. ఒక వేళ మీ నాన్నగారు ఒప్పుకోకుంటే ఏంచెస్తారు?"

"ఒప్పిస్తాను. లేకపోతే మా అమ్మగారు తప్పక ఒప్పిస్తారు. నా ఇష్టాన్ని, మా అమ్మగారి మాటని మా నాన్నగారు కాదనరు"

"కాదులెండి. ఇటువంటి వాటిలో పెద్దవాళ్ళు చాలా పట్టుదలగా ఉంటారు. ఒకవేళ కాదంటే అప్పుడు మీరేంచేస్తారు?"

"బహుశా ఇక జీవితంలో పెళ్లిమాట తలపెట్టనేమో చరణ్! అయినా ఏమిటి మనలో మనమే ఇలా తర్జనభర్జన పడడం?"

"ఆగండి. పెళ్లి మానుకుంటారుగాని నాకోసం ఇదంతా విడిచి రాలేరన్న మాట."

"అదంత మాటల్తో అయ్యేపని కాదేమో చరణ్! ఎందుకంటే వంశానికి నేనే ఆధారం "

"వంశం!" పగలబడి నవ్వింది శ్రీచరణి.

"వంశం అంటే నీకు వేళాకోళంగా ఉందిగాని చరణ్ మావాళ్ళు ఎంతో ప్రాణప్రదంగా భావించుకుంటారు. అన్నట్టు రాత్రి మా నాన్నగారు నిన్ను పనిలో నుంచి తీసెయ్యమన్నారు. అసలు ఆయనతో తగాదాలు ఎందుకు పెట్టుకున్నావో, ఏమిటో నాకేం అర్థంకావడంలేదు. పైగా ఎంతో ఆశ్చర్యంగా కూడా ఉంది."

"మెల్లగా మీకే తెలుస్తాయి అశోక్! తొందరెందుకు?"

"అది సరే. నా నిర్ణయం విషయంలో నీ మనసు కుదుటపడ్డట్టేనా? నా నిర్ణయాన్ని నమ్ముతావా?"

"అప్పుడేనా? ఇంకా కొన్ని ప్రశ్నలకి మీ నుండీ సమాధానం రావాలి. నా సందేహం తీరాలి. అప్పుడు."

అశోక్ ఆమె తలమీద చిన్నగా మొట్టేడు. "ఏమిటో నీ భేతాళప్రశ్నలూ నీవూనూ. మళ్ళీ ఈ బుర్రలో ఏ కొత్త తిక్క రేగిందో. నీతో మహ ప్రాణ సంకటంగా ఉంది నాకు" అన్నాడు.

అశోక్ మాటలేవీ శ్రీచరణి చెవుల్లో సోకలేదు. ఆమె దృష్టి అంతకు క్రితమే అక్కడకు కాస్త దూరంలోఉన్న వీణమీదపడి నిలిచిపోయింది. మెల్లగా లేచి అక్కడికి వెళ్ళి వీణతీగెను మీటింది.

"అశోక్! మీకు వీణ వచ్చునా?" అనడిగింది

అశోక్ నవ్వేడు. "నా మొహం నాకేం వచ్చు. నా కెందుకో చిన్నప్పటి నుండీ వీణంటే మక్కువ. దానిమీద ఇష్టాన్ని వదులుకోలేక ఇంట్లో తెచ్చి పెట్టుకున్నాను. అప్పుడప్పుడు నా ఉహాసుందరి నా ఊహల్లో దాన్ని వాయిస్తూ నా మనసుకి ఆహ్లాదాన్ని చేకూరుస్తుంది."

"ఊహల్లోనా?" నవ్వింది శ్రీచరణి. "అయితే కొన్న తరువాత దీనితో పనే పడలేదన్నమాట. పాపం ఈ వీణ ఎంత చిన్నబోతుందో."

"ఎందుకు పడలేదు. ప్రతి సంవత్సరం నా పుట్టినరోజుకి వీణావాద్యగాళ్ళని రప్పించి వాయించుకుంటూ నా సరదా తీర్చుకునేవాడిని. రెండుమూడేళ్ళనుండి పుట్టినరోజుకి ఇక్కడకి రాక ఆ అదృష్టం కూడా లేదనుకో."

"ఐసీ!" హఠాత్తుగా ఏదో ఆలోచనలో పడిపోయింది శ్రీచరణి.

అశోక్ కూడా లేచివచ్చి ప్రేమగా వీణను నిమరసాగేడు.

"మళ్ళీ మీ పుట్టినరోజు ఎప్పుడొస్తుంది అశోక్?"

"ఎప్పుడోనా? రేపే!"

"అయితే రేపు మీ పుట్టినరోజు సందర్భంగా వీణ వాయించే అదృష్టాన్ని నా కివ్వగలరా?" ఉత్సాహంగా అంది శ్రీచరణి.

అశోక్ సంభ్రమంగా చూశాడు. "చరణ్! నీకు నీకు వీణ వాయించడం వచ్చన్నమాట."

"వచ్చు!

"మరి నాతో ఇన్నాళ్ళూ చెప్పలేదేం?"

"బాగుంది. మీకు వీణ ఇష్టమని నాకేం తెలుసు." నవ్వింది.

"ఆహా! ఏమి నా భాగ్యము! రేపు పుట్టినరోజు అన్ని పుట్టినరోజుల్లాంటిది కాదు చరణ్! అబ్బ! నా కెంత ఆనందంగా ఉందో తెలుసా?" సంభ్రమానందాలతో అమాంతం శ్రీచరణిని ఎత్తేసి గిరగిరా తిప్పసాగాడు అశోక్.

* * *

## 12

తెల్లవార్జామున నాలుగు అవుతూండగా హఠాత్తుగా మెలుకువ వచ్చింది శ్రీచరణికి. ఆ తరువాత ఆమెకి ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. ఆలోచనలు మాత్రం జోరీగల్లా ఒకదానిమీద ఒకటి ముసురుకుంటున్నాయి ఆమె మనోఫలకంమీద వరసగా త్రివేణి, అశోక్, రాఘవవర్మగారు, ప్రతిమాదేవిగారూ మెదలసాగేరు తన ప్రయత్నం సక్సెస్ అవుతుందో లేదో. ఆనందంతో, అంతులేని సంతృప్తితో చిరునవ్వు చిందించే అత్తయ్య మొహాన్ని చూచే అదృష్టం తనకుంటుందో ఉండదో।

అశోక్। అబ్బ। అతనికి తనంటే ఎంత ప్రేమ అతన్ని తను వదులుకునే పరిస్థితి ఏర్పడితే తన జీవితమే వృథా అన్నమాట భగవాన్। తను ఊహిస్తున్న దానికి అశోక్ మనసు విరుద్ధమైనదని నిరూపించకు. తన ఊహలు, అంచనాలు నిజం కావాలి అప్పుడే తన జీవితానికి ఒక పరమార్ధం, విలువ ఉంటాయి.

రాఘవవర్మగారిని తను ఒంటరిగా, అతి ధైర్యంతో ఎదుర్కొంటుంది. ఎంత పనైనా చేయగల అతి కర్కశులైన ఆయనకు ప్రత్యర్థిగా నిలిచింది. తన ఈ సాహసం యొక్క పర్యవసానం ఎలా ఉంటుందో. తను అనుకున్న విధంగా ఆయన మనసుని ఉలిక్కిపడేలా చేసిన ఆందోళనకి లోనుచేస్తుంది. అదే తనకు విజయసూచకమేమో

ప్రతిమాదేవిగారు చాలా మంచి మనిషి భర్తకంటె ఎంతో విశాల హృదయురాలు సంస్కారవంతురాలు అసలు విషయం తెలిసిన తరువాత ఆ విశాలత్వం, సంస్కారం ఎలా ఉంటాయో చూడాలి

ఆలోచనల్తో అటూ ఇటూ దొర్లిన శ్రీచరణి మంచం పక్కనున్న కిటికీ తెరిచి చూసింది. పిల్లగాలులు మందంగా వీస్తూ అప్పుడప్పుడే తోటలో వికసిస్తున్న పరిమళాలను మోసుకొస్తూ ఆహ్లాదం కలిగిస్తున్నాయి వింత వింత పక్షులు చెట్లమీద వాలుతూ కిలకిలలాడుతున్నాయి దట్టంగాఉన్న చీకటి తెరలు క్రమక్రమంగా పలచబడుతున్నాయి ఇక తెల్లవారడానికి ఎంతో వ్యవధి లేదన్నమాట అనుకుంది శ్రీచరణి ఆమెకు హఠాత్తుగా అశోక్ బర్త్‌డే ఆరోజేనన్న సంగతి గుర్తుకొచ్చింది మనసులో ఏదో చిలిపి ఊహ మెదిలి పెదవులు చిరుదరహాసంతో విచ్చుకున్నాయి.

శ్రీచరణి మెల్లగా లేచి తన గదిదాటి బయటకొచ్చింది పనివాళ్ళ

అప్పుడప్పుడే మేలుకుంటున్నారు. శ్రీచరణి చకచకా మెట్లెక్కి మూడో అంతస్తులో ఉన్న అశోక్ గది చేరుకుంది. మెల్లగా తలుపు తోసింది. దగ్గరికి చేరవేసిఉన్న ఆ తలుపులు తొయ్యగానే తెరుచుకున్నాయి మెల్లగా సడిచేయకుండా లోపలకు వెళ్ళింది శ్రీచరణి.

అశోక్ గాఢనిద్రలో ఉన్నాడు. నిద్రలో ఏ తీపికలలు కంటున్నాడో పెదవులమీద చిరునవ్వు దోబూచులాడుతూంది.

మెల్లగా అతని మొహంమీద వంగుని కవ్విస్తున్న ఆ పెదిమలమీద గాఢంగా ముద్దుపెట్టుకుని మునిపంటితో చిన్నగా కొరికింది ఉలిక్కిపడి కళ్ళు విప్పేడు అశోక్।" ఎదురుగా చిలిపిగా నవ్వుతున్న శ్రీచరణి కనిపించింది అశోక్ మొహం కాంతివంతమైంది

"విష్ యూ హేపీ బర్త్ డే అశోక్।"

"థాంక్స్। అడక్కుండానే బర్త్‌డే ప్రజంటేషన్ అందరికంటే ముందిచ్చినందుకు వెరీ వెరీ థాంక్స్," ఆనందంగా అంటూ ఆమె చెయ్యిపట్టుకుని ముందుకి ఒక గుంజు గుంజేడు యధాలాపంగా నుంచున్న శ్రీచరణి తూలి అతనిమీద పడింది క్షణం ఆలస్యం చేయకుండా అతని చేతులు ఆమెను చుట్టివేసి ఊపిరాడకుండా చేశాయి

"అబ్బ,వదలండి అశోక్। ఏమిటీ చిలిపితనం'" చిరుకోపంగా అంది శ్రీచరణి.

"ఊ। ఇందాకటి నీ చిలిపితనానికి జవాబు." తన పట్టునేమాత్రం వదలకుండా ఆమె చెవిలో గుసగుసగా అన్నాడు అశోక్

"ఇలా అయితే నేను మీతో మాట్లాడకుండా వెళ్ళిపోతానంతే "

"అలాగేం' అయితే వెళ్ళు చూద్దాం ఎలా వెళ్ళగలవో?" కొంటెగా నవ్వేడు.

"అయ్యయ్యో। ఎవరో వస్తున్నారు " కంగారుగా అంది తలుపువంక బెదురుగా చూస్తూ శ్రీచరణి

చప్పున ఆమెని వదిలిపెట్టేశాడు అశోక్ శ్రీచరణి వెక్కిరింతగా నవ్వుతూ అతనికి అందనంత దూరంగా వెళ్ళి నిలబడింది.

"పాపం। అయ్యగారు పుట్టినరోజుపూట ఫూల్ అయిపోయారు "

"దొంగా। అసలు నమ్మకపోదును. కానీ ఈ రోజు అమ్మ వస్తుంది నన్ను నిద్రలేపడానికి అమ్మే వచ్చిందేమో ననుకున్నాను " అన్నాడు అశోక్.

"అయితే ఈ రోజు ఆమె బదులు నే నొచ్చి లేపేనన్నమాట పాపం ఆవిడ బాధపడతారేమో।" పశ్చాత్తాపపడుతున్నట్టుగా అంది శ్రీచరణి

"ఫరవాలేదు. మా అమ్మ అంత సంకుచితురాలేంకాదు. తన తరువాత ఈ డ్యూటీ తీసుకోవల్సినదానివి నువ్వేగా మరి!"

"మీ పుట్టినరోజుకి ఏ అట్టహాసాలు ఏం కన్పించడంలేదేమిటి? ఇంకా నేను ముందురోజునుంచే ఘనమైన ఏర్పాట్లవీ చేస్తారనుకున్నాను," అంది శ్రీచరణి.

"నా కటువంటి అట్టహాసాలంటే కిట్టదు చరణ్. చాలా సింపుల్‌గా జరిగి పోవాలంతే. ఉదయమే మా అమ్మగారు నన్ను నిద్ర లేపుతారు. ఆమె స్వహస్తాలతోనే తలంటుతారు. తరువాత కొత్త దుస్తులు వేసుకుని ఆమెతో పాటు పూజామందిరానికి వెళతాను. ఆమె ప్రక్కన బుద్ధిగా కూర్చుని ఆమె పూజ ముగిసేంతవరకూ చేతులు జోడించి నేనూ కూర్చుంటాను. ఆ తరువాత అమ్మే నా నోట్లో మొదట దేవుడి ప్రసాదం వేస్తుంది. నా చేతుల్తో నేను ఈ ఎస్టేట్‌లో వుండే పనివాళ్ళందరికీ మిఠాయిలూ, కొత్త బట్టలూ పంచి పెడతాను. మిత్రుల మధ్య కూర్చుని భోజనం చేస్తాను. ఆతరువాత రాత్రి నా కిష్ట మైన వీణాగానం వింటూ నిద్రపోతాను. ఇంతే ఈరోజు ప్రత్యేకత. ఇంతకు మించి ఇంకేంలేదు చరణ్!"

"అలాగా!" బుగ్గన చేయి చేర్చుకుని కుతూహలంగా వింటున్న శ్రీచరణి అంది.

"నాదో కోరిక. ఈరోజు అమ్మతోపాటు నేను పూజగదిలో ఉండే సమయంలో నువ్వూ దగ్గరుండాలి. ప్లీజ్, కాదనకు చరణ్!" ప్రతిమాలే ధోరణిలో అన్నాడు అశోక్.

"అలాగే!" ఏ కళనుందో వెంటనే ఒప్పుకుంది శ్రీచరణి. "మీ అమ్మగారు వస్తారేమో! తనకంటె ముందు వచ్చి మిమ్మల్ని మేల్కొలిపినందుకు మనసు చిన్నబుచ్చుకుంటారేమో. వస్తాను," అంది.

అశోక్‌కి కూడా అది నిజమే ననిపించి "సరే చరణ్!" అన్నాడు.

శ్రీచరణి అక్కడినుండి బయటకు నడిచింది.

## 13

దివ్యశోభలతో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ పూజామందిరాన్ని చూచి కళ్ళు తిప్పుకోలేకపోయింది శ్రీచరణి. వెలుగుతున్న దీపపు ప్రమిదలతో ఆర్చిలా ఉంది దానిలోపల బంగారంతో చేసిన సింహాసనం, సింహాసనంమీద

ఆసీనులైనట్టున్న శివపార్వతుల బంగారపు ప్రతిమలు, వెండిదీపపు సెమ్మెలలో వెలుగుతున్న జ్యోతులు ఎంతో శోభాయమానంగా ఉన్నాయి. ఆ మందిరానికి సమీపంగా ప్రతిమాదేవి పీఠంమీద మఠంవేసుకుని భక్తిగా కళ్ళు అర మోడ్పులుగా చేసుకుని కూర్చుని దైవాన్ని ప్రార్థిస్తూంది. ఆమె ఎదుట నాలుగుపళ్ళేలనిండా పెద్ద పెద్ద రాసులుగా వివిధ రకాల పువ్వులున్నాయి. ఒకవైపు కొబ్బరికాయలు, అరటి గెలలు ఉన్నాయి. ఆమె ప్రక్కన అశోక్ నిలబడి చేతులు జోడించేడు. అతని ప్రక్కన నిలబడ్డ శ్రీచరణి అబ్బుర పడుతున్నదానిలా చూడసాగింది.

ప్రతిమాదేవిగారి పూజ ప్రారంభమైంది. ఏవో శ్లోకాలను వల్లెవేస్తూ పళ్ళెంలోని పూలను, అక్షంతలను, గంధాన్ని దేవుడికి సమర్పించసాగింది. క్రమంగా పళ్ళాలలోని పూలు సింహాసనాన్ని, శివపార్వతులని కప్పివేస్తూ గుట్టగా కాసాగాయి. దేవుడికి టెంకాయలు, అరటిపళ్ళు, ద్రాక్ష మొదలైన ఫలాలన్నీ నైవేద్యం పెట్టింది. పూజ ముగించిన ప్రతిమాదేవి గంటవాయిస్తూ కర్పూరం వెలిగించి హారతిచ్చింది. ఆ హారతిని కొడుక్కి, శ్రీచరణికీ ఇచ్చి పూజా పుష్పాలను చెరొకటి ఇచ్చింది.

వాళ్లు వాటిని కళ్ళకద్దుకుని అశోక్ చెవివెనుక, శ్రీచరణి జడలోనూ తురుముకున్నారు. ప్రతిమాదేవిగారు కొడుకునోట్లో ప్రసాదాన్ని ప్రేమగా వేసింది. శ్రీచరణి చేతిక్కి ఒక ద్రాక్షగుత్తి, చిన్న కొబ్బరిచెక్క ఇచ్చింది.

రాఘవవర్మగారు లోపలికొస్తూ అశోక్‌ను, అతని ప్రక్క నిలబడిన శ్రీచరణిని చూచి భ్రుకుటి ముడివేశారు.

"అశోక్! ఈమె నీకు సెక్రటరీయా లేక సి.ఐ.డీ.యా ?" తీక్షణంగా అడిగేరు.

"అదేమిటి నాన్నగారూ ?" తెల్లబోయాడు అశోక్.

"లేకపోతే ఏమిటిరా? ఎవరి నెంతలో ఉంచాలో అంతలో ఉంచాలి. లేకపోతే నెత్తినెక్కి కూర్చుంటారు." శ్రీచరణివంక నిరాశగా చూస్తూ అన్నారు.

"ఇప్పుడేమయిందండీ?" ప్రతిమాదేవిగారు అయోమయంగా చూశారు.

"ఏం కాలేదు. ముందు జాగ్రత్తకోసం చెప్తున్నానంతే. అయినా అశోక్ నీకు పూజగదిలో పూజ చేసుకుంటున్నప్పుడు కూడా సెక్రటరీ అవసరం ఉంటుందటరా? ఒక్క క్షణం వదిలిపెడితే నీ సెక్రటరీని ఎవరైనా ఎత్తుకు పోతారా?" వ్యంగ్యంగా అన్నారు రాఘవవర్మగారు.

శ్రీచరణి ఆయనవంక చురుగ్గా చూసింది. అశోక్‌కి వెంటనే ఏం చెప్పాలో అర్థంకాలేదు.

"సెక్రటరీ కూడా మనిషేకదండీ! మనిషిగా ఆమెక్కూడా దైవదర్శనం చేసుకోవాలని ఉండడంలో తప్పులేదు గదా! ఎంత మీరు మాకు జీతా లిచ్చినా, మీ అధికారం మామీద ఎంతున్నా మనుషులం యంత్రాల్లాగా మారలేం కదండీ!" మృదువుగానే అయినా సూటిగా చెప్పింది శ్రీచరణి.

ప్రతిమాదేవిగారు కల్పించుకుంది. "ఏమిటండీ మీరు! చిన్నపిల్ల బాధ పడితుంది. అయినా వాడి పుట్టినరోజు పూట వాడిష్టమైనట్టు ఉండనివ్వండి. తనతో సెక్రటరీని పూజామందిరానికి తీసుకొచ్చినంతమాత్రంలో ఏం ప్రమాదం ముంచుకొచ్చిందీ?"

"ప్రతిమా నీకు తెలీదు."

"ఏమిటండీ తెలియనిది." అని భర్తమాట తీసేస్తూ శ్రీచరణివంక తిరిగి "ఆయనొట్టి చాదస్తం మనిషమ్మా! ఆ మాటలనేమీ పట్టించుకోకు. దైవదర్శనం చేసుకోడానికి అందరూ అర్హులే. అందులో తప్పేంలేదు." అన్నారు ఆమెని అనునయించే ధోరణిలో.

"ఫరవాలేదు. నేనేం బాధపడ్డంలేదులెండి. అలా మాట్లాడ్డం బహుశా ఆయనకి అలవాటేమో! ఆ మాత్రం వాటికి బాధపడేంత సున్నితమేం కాదు లెండి నా మనసు. మీ అబ్బాయిగారికి తెలుసు నా మనసెంత మొండిదో." నిర్లక్ష్యంగా తలెగరేస్తూ అంది శ్రీచరణి.

అక్కడేం మాట్లాడ్డానికి కుదరదని రాఘవవర్మగారు కోపంతో మొహం కందగడ్డ కాగా అక్కడినుండి విసవి సానడిచి వెళ్ళిపోయారు.

ఆయన వెళ్ళిపోవడంతో అశోక్ మనసు కుదుటబడింది.

"అమ్మా! చరణికి వీణవాయించటం తెలుసట," అన్నాడు అశోక్.

ప్రతిమాదేవిగారు శ్రీచరణివంక ఆదరంగా చూసింది. "నిజమేనామ్మా? అయితే ఇకనేం. నాకూ వీణావాద్యమంటే మక్కువే. ఇప్పుడే ఈ మందిరంలోనే దైవంమీద ఏదైనా మంచి భక్తిగీతం పాడు తల్లీ!" అంది.

"అలాగేనండి. తప్పకుండా పాడతాను. రాత్రి మీ అబ్బాయిగారి గదిలో వీణను చూచేక అంత అందమైన వీణను మీటడానికి నా మనసు కూడ తహతహలాడుతోంది. అసలు వీణను చూస్తేనే నా మనసు చెప్పలేని పరవశానికి లోనవుతుంది," అంది శ్రీచరణి.

"అలాగా! కళాకారుని మనసు ఇలాగే స్పందిస్తూంటుందట తల్లీ! ఇప్పుడే తెప్పిస్తా నుండు," అంటూ అక్కడున్న నౌకరుతో అశోక్ గదిలోఉన్న వీణను తీసుకురమ్మని పురమాయించింది.

రెండు క్షణాల్లో అక్కడకు రప్పించబడింది వీణ. దైవమందిరానికి కాస్త ఎడంగా నేలమీద పరువబడిన తివాసీమీద పొందికగా కూర్చున్న శ్రీచరణి వీణను ఆప్యాయంగా సవరిస్తూ ఒళ్ళోకి తీసుకుంది.

తీగెలను శ్రుతిచేస్తూ మంద్రంగా, మృదువుగా చక్రవాకరాగంలో ఎత్తుకుంది. చిన్నగా పిల్లతెమ్మెరలా మొదలైన గానం మెల్లగా ఉన్నకొలదీ స్థాయి పెరుగుతూ వచ్చి ఆ ఇంటినంతటినీ కమ్మని సుగంధ పరిమళంలా ఆక్రమించుకో సాగింది. మృదుమధురంగా, అతి మనోజ్ఞంగా గలగల పారే సెలయేరులా ఆ ఇల్లంతా ప్రతిధ్వనిస్తూ ఎటువంటి కఠినమనసులనైనా ఏవో దివ్యలోకాల్లో విహరింపజేసేలా వుంది. ఆ గానానికి, ఆ రాగానికి తోడు శ్రీచరణి గొంతు కూడా ఎంతో మధురంగా, రసజ్ఞతగా ఉంది.

పరవశంతో కళ్ళుమూసుకుని వింటున్న ప్రతిమాదేవిగారు తన్మయంగా తన డతొమీద చేత్తో తాళం వేయసాగింది.

చకితుడై చూడసాగాడు అశోక్. ఈమె తనకు తెలిసిన శ్రీచరణి కాదనిపించింది. ఏ దివ్యలోకాల్లోనుండో దిగివచ్చిన తనెప్పుడూ చూడని ఏ అప్సరసో అనిపించింది. ఆమెతో తనకింత దగ్గిర అనుబంధం ఉండి కూడా ఆమెలోని ఈ కళా నైపుణ్యాన్ని, ఈ గానమాధుర్యాన్ని గుర్తించలేక పోయాడు. బాహ్య సౌందర్యంతోపాటు అపూర్వమైన ఈ కళా సౌందర్యం కూడా కలబోసిన ఈ పుత్తడిబొమ్మ తన స్వంతమవబోతున్నందుకు తనెంత అదృష్టవంతుడో! అంతులేని ఆరాధనతో ఆమెవంక తన్మయత్వంగా చూశాడు అశోక్.

పక్కగదిలో అస్థిమితంగా పచార్లుచేస్తున్న రాఘవవర్మగారు శ్రీచరణి పాటకి తత్తరపడుతున్నారు. ఆయన మనసులో అడుగుపొరల్లోనుండి ఏదో కలుక్కుమని ఒకటే సలుపు పెడుతూంది. మనఃస్థితి అంత అల్లకల్లోలంగా ఉన్నా కూడా నిరాటంకంగా, మధురంగా సాగిపోతున్న ఆ గానవాహిణికి ఆగలేనట్టు తనుకూడా అక్కడినుండి పూజామందిరం ద్వారం దగ్గిర కొచ్చి ఆగిపోయారు. అలా వీణముందు కూర్చుని గానంలో లీనమైపోయిన శ్రీచరణి ఆయన కళ్ళకి అపర సరస్వతిలా కనిపించింది. ఆ స్థానంలో, ఆ భంగిమలో మరెవరో హఠాత్తుగా మెదిలి తనలో తనే తుళ్ళిపడ్డారు రాఘవవర్మగారు.

క్రమంగా పాట పూర్తిచేసింది శ్రీచరణి.

"అబ్బ! ఎంత బాగా, ఎంత హాయిగా పాడేవమ్మా!" ఆనందంగా చూస్తూ ఆమె తలని వాత్సల్యంగా నిమురుతూ అన్నారు ప్రతిమాదేవిగారు.

"నేను పాడిందేముందండీ! అసలు నేను నేర్చుకున్నదే చాలా స్వల్పం. మా అత్తయ్య నాకంటె బాగా పాడుతుంది." ద్వారంవద్ద నిలబడ్డ రాఘవవర్మ గారిని కంటి చివర్లనుండి పరికిస్తూ అంది శ్రీచరణి.

"అలాగా?" అంది ప్రతిమాదేవిగారు.

"అమ్మా! నువ్వూ, చరణ్ మాట్లాడుతూ ఉండండి. కింద అందరూ నాకోసం కాచుకునుంటారు. పాట మైకంలో పడి వాళ్ళందరినీ మరిచిపోయాను. వాళ్ళకి మిఠాయిలూ, బట్టలూ పంచిపెట్టి వస్తాను" అన్నాడు అశోక్.

"మంచిది, వెళ్ళిరా నాయనా!" అన్నారు ప్రతిమాదేవిగారు.

అశోక్ అక్కడనుండి వెళ్ళిపోయాడు. మెల్లగా లోపలికి వచ్చేరు రాఘవవర్మగారు.

"మీరు వెళ్ళిపోయారుగాని, ఈ అమ్మాయి ఎంత బాగా పాడిందనుకున్నారు? ఈమె చేతుల్లో ఉన్న ఆ వీణ సజీవరూపం దాల్చినట్టయింది." సంభ్రమంగా అన్నారు భర్తతో ప్రతిమాదేవిగారు.

"నే నెక్కడికీ వెళ్ళలేదు. పక్కగదిలోనుండి నేను కూడా విన్నాను. ఆఁ ఇదిగో అమ్మాయ్! మీ అత్తయ్య ఇంతకంటే బాగా పాడుతుందన్నావు. ఎవరామె? ఆమె పేరేమిటి?" తనలోని ఆత్రాన్ని ఏమాత్రం కన్పడనీయకుండా సౌమ్యంగా అడిగేరు రాఘవవర్మగారు.

"మా అత్తయ్య పేరు త్రివేణి. వీణా కచ్చేరీలు కూడా చేస్తూంటుంది." రాఘవవర్మగారి మొహాన్ని, అందులో మారే భావాల్ని గమనిస్తూ అంది శ్రీచరణి.

రాఘవవర్మగారి మనసు కొయ్యబారినట్టు అయిపోయింది. మాటలకోసం తడుముకుంటున్నవాడిలా, "ఆమె ఇపుడు ఎక్కడ ఉంది?" అన్నారు.

"మా ఊళ్ళోనే! బ్రతికే ఉందిలెండి." వ్యంగ్యంగా అంది శ్రీచరణి.

"అయ్యో! అదేం మాటమ్మా! పదికాలాలకీ అటువంటి కళాకారులు బ్రతికే ఉండాలి," అని శ్రీచరణితో చెప్పి భర్తవంక చూస్తూ "ఏమండీ, ఆమె నొకసారి ఇక్కడికి పిలిపించి వీణా కచ్చేరి ఏర్పాటుచేద్దామా" అనడిగింది ప్రతిమా దేవిగారు.

"కానీ మా అత్తయ్య ఎక్కడికీ రావడండీ! అలా కచ్చేరీ లివ్వడం మానుకుని చాలా సంవత్సరాలే అయింది."

"ఏమమ్మా అలా!" ఆశ్చర్యంగా అడిగింది ప్రతిమాదేవిగారు.

"ఏముందండీ? ఒక నయవంచకుడి మూలంగా మా అత్తయ్యలోని మహత్తర విద్య అడుగంటిపోయి ఎందుకూ కొరగానిదైపోయింది. ఒక మోసగాడి వంచనకి బలైపోయిన అత్తయ్య తనలోని కళని సమాధిచేసేసి చావలేక ఒకే ఒక్క ఆశతో బ్రతుకుతూంది. బయటకి రాదు. ఎవరితోనూ నవ్వుతూ మాట్లాడ్డం నేను చూడలేదు. జీవచ్ఛవంలా బ్రతుకుతూంది," రాఘవవర్మగారివంక చూస్తూ కసిగా అంది శ్రీచరణి.

ఆయన చూపులు అసహనంగా కదల్తున్నాయి.

"మీ అత్తయ్యలోఉన్న ఆ తీరని ఆశేమిటో నీకు తెలుసా అమ్మా?" ప్రతిమాదేవిగారు అడిగింది.

"ఎందుకు తెలియదండీ? తన కొడుకు చిన్నప్పుడే తప్పిపోయాడట. ఎప్పుడైనా కన్పిస్తాడేమోనని ఆమె ఆశ. నీ కొడుకు ఎక్కడున్నా పట్టి, కట్టి, కొట్టి తీసుకొస్తానని శపథం చేసి బయలుదేరానండి నేను."

"మంచిదానివే." నవ్విందామె. "మరయితే అందుకేమైనా ప్రయత్నిస్తున్నావా?"

"ఇంకా ఏది? ఆ ప్రయత్నం ఇప్పుడే మొదలుపెట్టాలనుకున్నా!" రాఘవవర్మవంక వారగా చూస్తూ కవ్విస్తున్నట్టుగా నవ్వింది శ్రీచరణి.

రాఘవవర్మగారి మొహం గంభీరంగా మారి అతి భీకరంగా తయారయింది. అక్కడినుండి విసవిసా నడుచుకుంటూ వెళ్ళిపోయారు. ప్రతిమాదేవిగారు అర్థంకానట్టు చూడసాగింది వెళుతున్న భర్తవంక.

## 14

రాత్రి పదీ పదకొండవుతుంది సమయం. శ్రీచరణి మంచమ్మీద పడుకుని ఏదో పుస్తకం చదువుకుంటూంది. తలుపుమీద ఎవరో తట్టిన చప్పుడు విన్పించడంతో లేచి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా అశోక్ నిలబడి ఉన్నాడు. అతన్ని చూచి విస్తుపోయింది శ్రీచరణి.

"అశోక్! మీరా? ఈ వేళప్పు డేమిటిలా?"

"నేనే చరణ్! ఏం చేయను. మనస్సు నీ తలపులతో పిచ్చివాణ్ణి చేస్తుంటే

రాకుండా ఉండలేకపోయాను చరణ్!" అంటూ ఆమెను త్రోసుకుంటూ వచ్చి మంచంమీద కూర్చున్నాడు. తలుపు మూసి వచ్చింది శ్రీచరణి. "చరణ్!" అంటూ ఆమెని ఆవేశంగా మీదకు లాక్కొని పెదవులమీద గబగబా ముద్దులు పెట్టేసుకున్నాడు.

శ్రీచరణి అతని పట్టునుండి బలవంతంగా విడివడి దూరంగా జరిగింది. "అశోక్! ఈ వేళప్పుడు రావడమేగాక పైగా ఈ పనులేమిటి? పెళ్ళయేవరకు ఇలాంటివి నాకు గిట్టవని చెప్పలేదూ?" తీక్షణంగా అడిగింది.

"అదే! ఆ పెళ్ళే! అయేదెప్పుడు చరణ్? ఇంకా ఎన్నాళ్ళు నేను దూరంగా ఉండాలి? ఇందాక నువ్వలా అపర సరస్వతిలా వీణ వాయిస్తూంటే నా మనసులో ఎన్నెన్ని కోరికలు, అనుభూతులు జనించేయో ఎలా చెప్పను నిన్ను పెనవేసుకొని పూర్తిగా నాలో కలుపుకోవాలని, నిన్ను అమాంతం? ఎత్తుకుని ఏ దూరతీరాలకో పారిపోవాలని ఇలా ఎంత పిచ్చిపిచ్చిగా అనిపించాయో నీ కెలా చెప్పను? నీకోసం నా మనసు తహతహలాడిపోతుంది. చరణ్! నీకోసం ఎంతో ఆరాటపడుతూంది "

"క్షమించండి అశోక్! నాకింకా కొంత టైమ్ కావాలి. మీ గురించి నా మనసూ ఆరాటపడుతూంది. అయినా తొందరపడలేను."

అశోక్‌కి కోపం వచ్చింది. "ఇంకా ఎంత వ్యవధి కావాలి చరణ్? జీవితం ముగిసిపోయేటంత కావాలా? అసలు నీకు వ్యవధి ఎందుకు కావాలి? ఏమిటీ జాప్యం? అసలు నీ ఉద్దేశమేమిటి? పోనీ నా గురించి ఇంకా ఏమైనా తెలుసు కోవాలనుకుంటున్నావా? చెప్పు చరణ్! నా గురించి నువ్వేం తెలుసుకోవాలి? మా తల్లిదండ్రులతో నువ్వెందుకు చెప్పనియ్యవు?" ఆవేశంగా ఆమె భుజాలు కుదుపుతూ అడిగేడు అశోక్.

"చెబుతాను అశోక్! ఈరోజు మీకు పూర్తిగా చెబుతాను. లేకపోతే నా మనసు కూడా ఒంటరిగా ఈ బాధను భరించలేకపోతూంది. నేను చెప్పే ముందు మిమ్మల్నొకటి అడగాలి అశోక్!"

"అడుగు చరణ్! సందేహం ఎందుకు?"

కొన్ని క్షణాలు ఏదో ఆలోచనలో పడిపోయినట్టు మౌనంగా శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది శ్రీచరణి.

హఠాత్తుగా అంది. "నేను కళావంతుల పిల్లనైనా మీరు చేసుకోడానికి సిద్ధంగా ఉన్నారు కదూ అశోక్?"




"అవును?"

"సరే అయితే. ఇది చెప్పండి. ఒక కళావంతులింట్లో పుట్టిన పడతి తను నీతినియమాలతో ఉంటూ కూడా ఒకసారి పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఒక తప్పుచేసి ఒక బిడ్డని కన్నది. తత్ఫలితంగా సంఘంచేత వెక్కిరించబడింది. ఆ బిడ్డ పెరిగి పెద్దవాడైన తరువాత ఆ తల్లిని అసహ్యించుకోకుండా ఉంటాడా లేక ఆమె ఏ పరిస్థితులవల్ల కాలుజారి తనకు జన్మ నివ్వవలసివచ్చిందో అర్థం చేసుకుని క్షమించి ఆదరిస్తాడంటారా? అతడేవిధంగా చెయ్యడం న్యాయం?"

"అదతని సంస్కారాన్ని బట్టి ఉంటుంది."

"పోనీ సంస్కారవంతుడైన వ్యక్తి ఏం చేస్తాడు?"

"తన కన్నతల్లిని అర్థంచేసుకుని గౌరవించడానికే ప్రయత్నిస్తాడు చరణ్! ఇవన్నీ ఎందుకడుగుతున్నావో, వీటితో మనకేం సంబంధమో, నీ బుర్ర ఏం ఆలోచిస్తుందో నాకేం అర్థంకావడంలేదు. ఇక అయిపోయినట్టేనా నీ భేతాళ ప్రశ్నలు?" విసుగ్గా అడిగేడు.

"ఇంకా అయిపోలేదు అశోక్! నేను అడిగే ప్రశ్నలన్నిటికీ మనకూ ఎంతో సంబంధముంది. నేను మీకో కథ చెప్పాలనుకుంటున్నాను. ఆ కథ విన్న తరువాత కూడా మీరు నేనడిగే ప్రశ్నలకి సమాధానం చెప్పాలి."

"హతోస్మి! ఇంకా కథా. ఆ కథ తాలూకు ప్రశ్నలు కూడా ఉన్నాయన్న మాట. సరే ఏం చేస్తాం? తప్పుతుందా? శెలవివ్వండి."

"అశోక్! నవ్వులాట కాదు. నేను సీరియస్‌గా చెబుతున్నాను."

"అయితే నేనూ సీరియస్‌గానే వింటాను. చెప్పు చరణ్!" ఎప్పుడూలేనంత గంభీరంగా మారిన శ్రీచరణ్ మొహంచూస్తూ అన్నాడు అశోక్.

## 15

పెళ్ళిపందిరి విద్యుద్దీపాలతో కళకళ్ళాడుతోంది. ఆరాత్రి ప్రఖ్యాత వీణా గాయకురాలు త్రివేణి వీణ కచ్చేరి జరుగుతుంది. ఎక్కడెక్కడినుండీ జనం తండోపతండాలుగా వస్తున్నారు. పెళ్ళికి వచ్చిన చుట్టుపక్కల ఊళ్ళ బంధువులు, స్నేహితులు పెళ్ళి జరిగిపోయినా ప్రత్యేకించి ఈ ప్రోగ్రాం ఉండడం వల్లే ఆగిపోయారు. ఆహ్వానితులందరూ కుర్చీల్లో ఆసీనులై స్టేజ్‌వంక ఆసక్తిగా చూస్తూ కుతూహలంగా, అతి శ్రద్ధగా చెవులప్పగిస్తున్నారు.

"విశాలంగా, ఎత్తుగాఉన్న స్టేజ్‌మధ్య పొందికగా కూర్చుని వీణ ఒళ్ళో పెట్టుకున్న త్రివేణి వినయంగా అందరివైపు చూచి నమస్కరించింది. అర్ధ నిమీలిత నేత్రాలతో భక్తిగా మొదట "శ్రీ గణనాధ సింధురావున్న అంటూ విఘ్నేశ్వర ప్రార్థన మొదలుపెట్టి పూర్తిచేసింది. ప్రేక్షకులందరూ చప్పట్లు కొట్టేరు. అటుతరువాత జయదేవుని అష్టపది అందుకుని శ్రోత లందరినీ తనతోపాటు ఏవో లోకాలకి తీసుకుపోయింది.

స్టేజ్‌కి సమీపంగా పందిరిరాట నానుకుని చేతులుకట్టుకుని నిలబడ్డ శ్రీనివాస్ ఇహలోకంతో సంబంధంలేనట్టు వీణాగానంలో నిమగ్నమయిపోయినా త్రివేణి వంక తదేకంగా చూడసాగేడు.

గలగల పారే సెలయేరులా మధ్య మధ్య ఒంపులు తిరుగుతూ అతి శ్రావ్యంగా, మృదుమధురంగా ఆమె కంఠంనుండి వెలువడుతున్న గానం దిగంతాలను వ్యాపిస్తూంది.

శ్రీనివాస్ చూపులు ఆమెమీద అతుక్కుపోయినటు ఒక్కక్షణంలో సగం సేపుకూడా పక్కకి మరలడంలేదు. పెద్ద పెద్ద కళ్ళు, విశాలమైన ఫాలభాగం, సంపెంగలాంటి ముక్కు, చిన్న చిన్న పెదవులు, పచ్చని పసిమిఛాయలతో పోతపోసిన బంగారు విగ్రహంలా ఉంది త్రివేణి. ఎడంవైపు వేసుకున్న పవిట కుడిభుజం మీదుగా తీసుకుని, ఒంటినిండా కప్పుకున్న ఫుల్‌వాయిల్ చీరతో, పచ్చగా మెరుస్తున్న మెడలో, మేనిఛాయతో కలిసిపోయినట్టున్న సన్నని బంగారు చైన్‌తో, విశాల ఫాలభాగంలో తీర్చిదిద్దుకున్న సన్నగా గీతలాంటి బొట్టుతో, వాలుజడలో చెవిపక్కగా అలంకరించుకున్న ఒకే ఒక్క గులాబీతో

అతి సాధారణంగా ఉంది త్రివేణి. అసలు అంత సాధారణంగా ఉండడంలోనే ఆమె వ్యక్తిత్వం, సంస్కారం చూపరులకు కొట్టొచ్చినట్టు కన్పిస్తాయి.

అంత సౌందర్యంతో వెలిగిపోతున్న ఆమెకి కంఠమాధుర్యం కూడా తోడు కావడంతో ఆమె దేవకన్యో, కిన్నెరకన్యో తేల్చుకోలేనట్టుగా పరవశంగా కాంక్షనిండిన కళ్ళతో చూస్తూండిపోయాడు శ్రీనివాస్.

వీణాగానం పూర్తయిపోయింది. ఎక్కడివాళ్ళక్కడకు వెళ్ళిపోసాగేరు. త్రివేణి తనకు కేటాయించిన గదిలోకి వెళ్ళి అన్నీ సర్దుకోసాగింది. శ్రీనివాస్ ఆమె గదిలోకి వెళ్ళేడు.

"అబ్బ! ఎంత అద్భుతంగా పాడేరండీ! జన్మ తరించిపోయింది," అన్నాడు.

ఆమె వెనుదిరిగి చూచి చిన్నగా నవ్వి "థాంక్స్!" అంది.

"ఈ రోజునుంచీ నేను మీఫాన్‌ని! వీణాగానానికి ఇంతగా తన్మయుడనవడం ఇదే మొదటిసారి."

"అలాగా ? మీరు వీణా కచ్చేరీలకి ఎక్కువగా హాజరయివుండరు. ఇది మొదటిసారో, రెండోసారో అయిఉంటుంది. అందుకే అలా అంటున్నారు. నాకంటే బాగా పాడేవాళ్ళు ఇంకా చాలామంది ఉంటారు."

"అయిఉండొచ్చు. కానీ మీ కంఠంలో ఉండే తీయదనం అందరి కంఠాల్లోనూ ఉండదని గ్యారంటీ ఇస్తున్నాను. నిజంగా మీకంత చక్కని కంఠం ఉండడం దైవం మీకిచ్చిన వరం. మీరేమంటారు?"

"అది దైవం గొప్పతనమేగాని, నాదేం లేదంటాను."

శ్రీనివాస్ నవ్వేడు. "ఎంత నిగర్వులండీ మీరు. మీ పేరేమిటో తెలుసుకో వచ్చా?"

"త్రివేణి!"

"నా పేరు శ్రీనివాస్! పెళ్ళికొడుకు శ్రీధర్ బెస్ట్ ఫ్రెండ్‌ని. దయచేసి ఈ బుక్‌మీద మీ ఆటోగ్రాఫ్ ఇస్తారా ?"

"నేనేం అంత గొప్పదాన్ని కాదు."

"గొప్పవాళ్లెప్పుడూ అలా ఒప్పుకోరే. ప్లీజ్ చెయ్యాలి. ఫాన్‌ని నిరాశ పరుస్తారా?" దీనంగా మొహంపెట్టేడు శ్రీనివాస్.

అయిష్టంగానే ఆటోగ్రాఫ్‌మీద సంతకంచేసింది త్రివేణి.

అంతలో అక్కడకు శ్రీధర్ వచ్చేడు. "అరే శ్రీనివాస్! నువ్విక్కడున్నావా?" అంటూ "త్రివేణిగారూ! రండి మిమ్మల్ని దిగబెట్టి వస్తాను," అన్నాడు త్రివేణితో.

"నువ్వా? పెళ్ళికొడుకువి నువ్విల్లు కదలడమేమిటిరా? నేను ఈమెను డ్రాప్ చేస్తాను," అన్నాడు శ్రీనివాస్.

"నువ్వా?" అనుమానంగా చూశాడు శ్రీధర్.

"నేనే. ఏంఫరవాలేదురా? డ్రయివింగ్ నాకేం కొత్తకాదు. త్రివేణిగారు దారి చెప్తారు. నేను జాగ్రత్తగా ఆమెని వాళ్ళింటి దగ్గిర దిగవిడిచి వస్తాను. సరేనా?"

ఎటూ చెప్పలేనట్టు తటపటాయించసాగేడు శ్రీధర్. శ్రీనివాస్ సంగతి తనకు తెలుసు కనుక వెంటనే ఒప్పుకోలేకపోతున్నాడు.

"పోనీ, ఈయన డ్రాప్‌చేస్తారులెండి. మీకు బోలెడు పనులుంటాయి. ఈయ నన్నట్టుత్త మీరు కొత్తపెళ్ళికొడుకుకూడాను. ఇల్లు కదలడం అంత మంచిదికాదు" అంది త్రివేణి.

"సరే! అలాగే జాగ్రత్తగా వెళ్ళిరండి," అని త్రివేణికి చెక్కు రాసిచ్చేడు శ్రీధర్. ఆమె దాన్ని హేండ్‌బేగ్‌లో వేసుకుంది.

శ్రీనివాస్ త్రివేణిని ఆమె ఇంటికి తీసుకువెళ్ళసాగేడు. దారిలో అతనామెను "త్రివేణిగారూ! నాకూ వీణ నేర్చుకోవాలని మహా ఉబలాటంగా ఉంది. నాకు మీరు నేర్పుతారా" అనడిగేడు.

"సారీ శ్రీనివాస్‌గారూ! మీకంతగా వీణ నేర్చుకోవాలనిఉంటె నాకంటె ఎందరో తలనెరిసిన విద్వాంసులున్నారు. మీరు వాళ్ళదగ్గిర నేర్చుకుంటే మంచిది. ఒకరికి నేర్పేటంత పాండిత్యం నాకు లేదు. నే నింకా విద్యార్థి దశలోనే ఉన్నాను." మృదువుగా చెప్పింది త్రివేణి.

శ్రీనివాస్ ఏమనలేదు. మౌనంగా కారు నడపసాగేడు. త్రివేణి ఇల్లు సమీపించింది. కారు ఇంటిముందు ఆగింది. అదో చిన్న డాబా ఇల్లు. డోర్ తీసుకుని కారు దిగింది త్రివేణి. ఆమె పనిమనిషి వీణ అవీ తీసి లోపల పెట్ట సాగింది

ఇంటి మెట్లెక్కుతూ "థాంక్స్!" అంది త్రివేణి కృతజ్ఞతగా.

"పోనీ, నేను మీ ఇంటికొచ్చి రోజూ మీ గానం వినొచ్చా?" అనడిగేడు శ్రీనివాస్.

"సారీ! నా గానం వినాలనుకునేవాళ్ళు నే నిచ్చే కచేరీలలోనే వినాలి. ఇంటి దగ్గర ఎవరికైనా పాడి వినిపించే అలవాటు నాకు లేదు. ఇకముందు ఆ అలవాటు పెట్టుకోదలచలేదు కూడా!" ఖచ్చితంగా చెప్పేసింది త్రివేణి. చెప్పేసి ఇంట్లోకెళ్ళిపోయింది.

హతాశుడైనట్టు చూశాడు శ్రీనివాస్.

## 16

"ఆ కిన్నెర కన్య ఎవర్రా?" ఆ మర్నాడు శ్రీధర్‌ను ఒంటరిగా కలుసుకుని అడిగేడు శ్రీనివాస్.

శ్రీధర్ అర్థంకానట్టు చూశాడు. "ఏ కిన్నెర కన్య?"

"అదే వీణాగాయని త్రివేణి!"

ఉలికిపడ్డాడు శ్రీధర్. "అప్పుడే నీ కళ్ళు ఆమెమీద పడ్డాయా?"

"శ్రీధర్ కొత్తగా అడక్కురా! నా బలహీనత నీకు తెలుసు. నేను కావాలనుకున్న అమ్మాయికోసం ఎంతయినా ఖర్చుపెట్టగలను. ఏమైనా ఎదుర్కోగలను."

"కానీ అందరూ నీకు తెలిసినలాంటి డబ్బుకి కక్కుర్తిపడేవాళ్ళే ఉండరు శ్రీను. ఆమె కావాలంటే ఈసరికి నీలాంటి కోటీశ్వరుల నెందరినో తన అందంతో దాసోహం చేసుకునుండేది. కాని ఆమె అలాంటిది కాదు. అసలు డబ్బునవాళ్ళను కన్నెత్తికూడా చూడదు. ఆమె లోకం, ఊపిరి, సర్వస్వం అంతా వీణాసాధనే. ఆమె విషయంలో నీ ఆశ వదులుకో." నచ్చజెప్ప బోయాడు శ్రీధర్.

"ఆశ వదులుకో అని నువ్వు చెప్పినంత సులువుకాదురా వదులుకోవడం. పోనీ ఆమెగురించైనా చెప్పు. ఆమెకు తల్లిదండ్రులున్నారా?"

"ఆమె కులానికి భోగంవాళ్ళ పిల్ల."

"మరి?...." శ్రీనివాస్ కళ్ళు మెరిశాయి.

"పూర్తిగా విను శ్రీనూ! భోగంవాళ్ళ పిల్లనగానే నీలాంటి చాలామంది విలాసపురుషుల మనసుల్లో మెదిలే భావాలు, అభిప్రాయాలు ఆమె కసలు వర్తించవు. ఆమె అగ్గినిప్పులాంటి పిల్ల. వాళ్ళ వృత్తికి ఇష్టపడకే తల్లితో గొడవపడి ఇంట్లోనుంచి బయటకు వచ్చేసి వేరుగా ఉంటోంది. ఎవరో గౌరవస్తులు పిలిస్తే వెళ్ళి వీణాకచ్చేరీ లిస్తుంది. లేకపోతే పిల్లలకి సంగీత పాఠాలు చెప్పుకుంటూ ఇంట్లో గుట్టుగా పడిఉంటుంది. అనవసరంగా మగవాళ్ళతో పరిచయాలు పెంచుకోదు. తన వీణాసాధనేమిటో, తనేమిటో అంతే. చాలామంది రాలుగాయులు ఆమెను వీధిలోకీడ్చడానికి ప్రయత్నించేరు గాని సాధ్యంకాక ఆమె మానాన ఆమెని వదిలిపెట్టేరు."

"అలాగా! మగవాడి నీడపడకుండా అలా ఎలా ఉంటుందో చూస్తాను.

ఇటువంటి అమ్మాయిపై మోజు పదింతలు పెరుగుతుంది శ్రీధర్. వంగని అమ్మాయిని వంచుకోడం అదో రకమైన థ్రిల్!" నవ్వేడు శ్రీనివాస్.

"శ్రీనూ! ఆ అమ్మాయి బ్రతుకు బండలు చెయ్యకు " అన్నాడు శ్రీధర్.

"భయపడకు శ్రీధర్! ఆమె కే అన్యాయం జరగదు."

"అంటే! సరిపడినంత డబ్బు మొహాన్న కొట్టడమే నీవు చేయగల న్యాయమా శ్రీను? కానీ అందరి విషయంలో డబ్బు న్యాయం చేకూర్చదు."

"అదికాదులే. ఆమెని పెళ్లిచేసుకుంటాను."

నివ్వెరపోయాడు శ్రీధర్. "నిజం? నిజంగానా శ్రీనూ?"

"ఔను. అటువంటమ్మాయిని పెళ్ళి ఒకటే దారికి తీసుకురాగలదు. మన వాంఛ తీర్చే ఆయుధం అదొక్కటే."

"అంటే?" శ్రీధర్ కనుబొమలు ముడిపడ్డాయి.

గుంభనంగా నవ్వేడు శ్రీనివాస్. "తొందరెందుకు? నువ్వే చూస్తావుగా!"

"అది కూడా అంత సులభం అనుకోకు శ్రీనూ. అసలామె నీతో పరిచయానికే అవకాశమివ్వదు. పెళ్లిమాటలవరకూ తీసుకొచ్చేటంత చనువు కలిగించే పరిస్థితిని అసలు కలుగనివ్వనే కలగనివ్వదు."

"ఆ సంగతి నాకు తెలుసు శ్రీధర్. అందుకు పథకాలు వెయ్యడం చేతగాని అసమర్థుడినికాదు."

శ్రీనివాస్ పట్టుదలకి మనసులోనే కలవరపడుతూ నిట్టూర్చేడు శ్రీధర్.

## 17

తలుపుమీద ఎవరో టకటక కొట్టడంతో సంగీతపాఠాలు పిల్లలకి చెబుతున్న త్రివేణి విసుక్కున్నట్టుగా ఆపి తలుపు తియ్యమని కళ్ళతోనే పనిమనిషికి ఆదేశించింది.

పనిమనిషి తలుపుతియ్యగా నవ్వుతూ లోపలికి ప్రవేశించిన శ్రీనివాస్‌ని చూచి ఆశ్చర్యపడింది త్రివేణి. "మీరా?" అంది లేచి నిలబడుతూ.

"నేనే! క్షమించాలి, మీరు రమ్మనకుండానే వచ్చినందుకు."

"ఫరవాలేదు, కూర్చోండి." మొహమాటంగా మర్యాదకి అంది త్రివేణి. శ్రీనివాస్ అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

"చూశారా? ఆడపిల్ల అబద్ధమాడితే అతికినట్టుంటుందంటారు. మీ అబద్ధాన్ని నే నానాడే పసిగట్టేశాననుకోండి. ఇప్పుడు ప్రత్యక్షంగా బయటపడిపోయింది." చిలిపిగా నవ్వుతూ అన్నాడు శ్రీనివాస్.

"నేను మీ దగ్గిరేమి అబద్ధాలాడేను ?" తెల్లబోయింది త్రివేణి.

"ఇదిగో! ఇదే. నే నా రోజు నాకు వీణ నేర్పమంటే మీరు ఎవరికీ నేర్పడం లేదన్నారు. ఇప్పుడు మీరు వీళ్ళకి నేర్పుతూండగానే నే నొచ్చేను. ఇప్పుడైనా ఒప్పుకుంటారా అబద్ధం ఎంతోసేపు నిలవదని."

"నే నన్నది నిజమే. అసలు సంగీతంలో ఓనమాలు కూడా రాని ఈ చిన్న వాళ్ళకి నేను చెబుతుంటానుగాని మీలాంటి పెద్దవాళ్ళకి నేను చెప్పను."

"నేను వయసులో మీకంటె పెద్దవాడినే అయినా విద్య విషయంలో చిన్న వాడినే కదండీ! నేనూ వీళ్ళలా సంగీతంలో ఓనమాలు రానివాడినే."

"అయినా, నాకంటె పెద్దవాళ్ళకి నేను చెప్పలేను. నాకేదో సంకోచంగా, బిడియంగా ఉంటుంది. ఇది నా ప్రిన్స్‌పుల్."

"ఓ ఐసీ!"

"ఇక మీరు ఇళ్ళకి వెళ్ళండి." తమవంక వింతగా చూస్తున్న ఆ అయిదుగురు విద్యార్థినులను చూస్తూ ఆజ్ఞాపించింది త్రివేణి.

వాళ్ళు వెళ్ళిపోయారు. త్రివేణి వంటింట్లో కెళ్ళి కాఫీచేసి తీసుకొచ్చింది అతనికొక కప్పు ఇచ్చి తనో కప్పు తీసుకుంది.

"థాంక్స్! ఆ రోజు మిమ్మల్ని డ్రాప్‌చేసినందుకైనా ఇంట్లోకి పిలిచి కాఫీ ఇవ్వకపోయినా ఈరోజు ఇచ్చేరు."

"సారీ! ఆ రోజు పెళ్ళింటిదగ్గరనుండి వచ్చేరుకదా పెళ్ళింట్లో మీకు కాఫీలకేం కొరతుంటుందిలే అనుకున్నాను." కాఫీ సిప్‌చేస్తూ అంది త్రివేణి.

"ఓ! భలే సమయస్ఫూర్తి ఉందండీ!" శ్రీనివాస్ అన్నాడు నవ్వుతూ.

రెండు నిమిషాల తరువాత "ఇంతకీ మీరొచ్చిన పనేమిటో చెప్పేరుకాదు" అంది త్రివేణి కాఫీ కప్పులు లోపల పెట్టేసివచ్చి.

"పనేం లేదనుకోండి."

"మరి?" త్రివేణి కనుబొమలు ముడిపడ్డాయి.

"అంటే పనేంలేనిదే ఎందుకొచ్చేవనేనా. ?"

"చూడండి శ్రీనివాస్‌గారూ! పనేమీలేనిదే ఒక అపరిచితురాలయిన ఆడపిల్లతో కాలక్షేపానికి మాటలు వేసుకూర్చోడం అంత మంచిపద్ధతికాదని నా ఉద్దేశం."

"మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను త్రివేణిగారూ! అటువంటివాళ్ళని నే నెంతయినా అసహ్యించుకుంటాను. నే నటువంటివాడిని కాదు."

"మరయితే మీకు నావల్ల ఏంపని కావాలో చెప్పండి?"

"త్రివేణిగారూ! మీరు కోపగించుకోనంటే నాదో చిన్న కోరిక." సందేహంగా చూస్తూ అన్నాడు శ్రీనివాస్.

"ఫరవాలేదు ఏమిటో చెప్పండి."

"తీరా చెప్పిన తరువాత కాదంటే "

నవ్వింది త్రివేణి. "బాగుంది ముందే ఎలా చెప్పగలను. కాదనేది అవుననేది మీరు చెప్పిందాన్నిబట్టి ఉంటుంది."

"సరే అయితే ముక్కోటిదేవతలకి మొక్కుకుని ధైర్యంగా అడిగేస్తున్నాను."

"అడగండి అంత భయమెందుకు?"

"మీరిప్పుడు మీ వీణమీద అతి చక్కని గానం ఆలాపించాలి. మీ గానం వినడంకోసమే నే నెంతో ఆశగా వచ్చేను "

చివ్వున లేచింది త్రివేణి. "క్షమించండి శ్రీనివాస్‌గారూ! నే నలా ఇంటి దగ్గర ఎవరికీ పాడి విన్పించనని నే నానాడే చెప్పేను. వచ్చే శుక్రవారం ఈ పక్క ఊరిలో నా వీణాకచేరీ ఉంది. అంతగా వినాలనుకుంటే అక్కడికి రండి." ఖచ్చితంగా చెప్పేసిన త్రివేణి లోపలికి పోబోతూ వెనుదిరిగి చూచింది. నివ్వెరపోయినట్టు చూస్తూ నిలబడిపోయిన శ్రీనివాస్‌తో "ఇక వెళ్ళిరండి" అంది కోపంగా.

"అయామ్ సో సారీ త్రివేణిగారూ! అలాగే వెళ్ళిపోతాను. కానీ వెళ్ళిపోయే ముందు ఒక్కమాట. ఇది మీరు తప్పక వినాలి." మెల్లగా, దీనంగా ఉన్నట్టున్న అతని అభ్యర్థన, కంఠధ్వని త్రివేణిని లోపలకు వెళ్ళిపోనీకుండా పట్టి నిలిపేయి.

"ఏమిటది?"

"త్రివేణిగారూ! నా గురించి మీకు కొంచెం చెప్పుకోవాలి. నేను దైవోపహతుడిని. జీవితంలో ఎవ్వరికీ పనికిరానివాడిని, ఎందుకూ కొరగానివాడిని. నా బ్రతుకో ఎడారిబాట. ఎదురు దెబ్బలు తిని తిని మనస్సు బండబారిపోయింది. నా హృదయం నిరాశామయం. ఈ బాధల బరువుకి నా గుండె ఏ క్షణంలో ఆగిపోతోందో ననిపిస్తూండేది. ఇల్లు వదిలి దేశంమీద పడ్డాను. హఠాత్తుగా శ్రీధర్ నాకు తారసిల్లి తన పెళ్లని ఇక్కడికి తీసుకొచ్చేడు.

సుశీల మరీ యింత నెమ్మదిగా నడవకపోతే
మనం రోజూ టైముకు కాలేజీ చేరుకునేవాళ్ళం! ప్చ్!



ఆ రోజు నేను మీ గానం విన్నాను. అసలు మనశ్శాంతనేదే ఎరుగని నా హృదయం, అశాంతికి నిలయమైన నా హృదయం మీ పాట విన్న క్షణంలో ఎంతో శాంతి పొందింది. నన్నూ, నా బాధలనూ మరచి ఏవేవో లోకాల్లోకి వెళ్ళిపోసాగేను. ఆ నాడే నా కనిపించింది, నా ఈ బాధాతప్త హృదయానికి మీ కమ్మని కంఠంనుండి వెలువడే నాగస్వరంలాంటి గానం ఒక్కటే ఔషధమని.

నా కప్పటినుండీ మిమ్మల్ని కలుసుకోవాలని, మీ పాట వినాలని ఎంతగా ఎన్నిసార్లు అన్పించినా మర్యాద కాదని, మనస్సుని బలవంతంగా జోకొట్ట సాగేను. కానీ ఈ రోజు మాత్రం నా మనసు ఈ అశాంతిని, ఆరాటాన్ని తట్టుకోలేకపోతూంది. ఈ వేదన భరించలేక ఏ క్షణంలో ఆత్మహత్య చేసుకుంటానో నన్పిస్తూంది. రవంత శాంతికోసం కొండంత ఆశగా మీ దగ్గరికి పరుగెత్తుకుని వచ్చేను. రాగానే మీరు పిల్లలకి పాఠాలు చెబుతూ కన్పించడంలోనే నా మనసులోని అశాంతి సగం ఎగిరిపోయినట్టనిపించింది. అందుకే నేను మీతో అంత కులాసాగా మాట్లాడేను. నిజంగా నే నలా ఎవరితోనైనా మాట్లాడి కొన్ని సంవత్సరాలైందంటే నమ్మండి. కానీ అంతలోనే నాకీ అదృష్టమంతా మిథ్యేనని తేలింది. నా మనసులో కలిగిన ఈ శాంతి క్షణబంగురం అయిపోయింది. నే నేదో వంచకుడిని, మోసగాడిని అన్నట్టు, నా నీడే భరించరానిది అయినట్టూ మీ మాటల్లో వ్యక్తం అవుతుంటే నా మనసు రంపంతో పరపరా కోసేస్తున్నట్టు అయిపోతూంది.

నా దురదృష్టం నన్ను వెక్కిరిస్తూంది. నా చేతగానితనం నన్ను సవాలే చేస్తూంది. నాకు అందరిలా శాంతంగా, సుఖంగా ఉండే అదృష్టం లేదు త్రివేణిగారూ? నా కీ లోకంలో చోటు లేదు. ఒక్క క్షణం మనశ్శాంతికోసం దేవిరించడం కూడా నా విషయంలో ఘోరాతిఘోరమైన నేరంగా పరిణ మిస్తోంది.

త్రివేణిగారూ! ఇదంతా చెప్పి మిమ్మల్ని బోర్ కొట్టిస్తున్నాను కదూ! నే నిక్కడకు రావడానికి, మిమ్మల్ని పాడమని ఇలా దేవిరించడానికీ కారణాలు చెబుతున్నానంతే. మిమ్మల్ని బాధపెడితే క్షమించండి. వస్తానిక. నమస్తే!" నిరాశా నిస్పృహలకి ఆలవాలమైన మొహంతో జాలిగొలిపే విధంగా మాట్లాడిన శ్రీనివాస్ వెనుదిరిగేడు.

చేష్టలుడిగి చూడసాగింది త్రివేణి. అతను చెప్పేది నిజమేనేమోననిపిం చింది ఆమెకి. లేకపోతే అంత ఇదిగా ఎందుకు చెబుతాడు? ఇంత బాధపడ్తూ తన పాటలో శాంతి వెదుక్కునే వ్యక్తిని ఇదే తను మొదటిసారి చూడ్డం. ఒకసారి పాడి అతని మనస్సుకి ఆ శాంతేదో కలిగిస్తే తనకొచ్చే నష్టం ఏముంది? ఆ తరవాత అతనిదారిన అతను వెళ్ళిపోతాడు. ఇప్పుడిలా ఇతను వెళ్ళిపోయి ఏ అఘాయిత్యానికైనా తలపడితే అనవసరంగా ఆ పాపం తనకు చుట్టుకుంటుంది.

"శ్రీనివాస్‌గారూ!" గుమ్మం దాటబోతున్న శ్రీనివాస్ త్రివేణి పిలుపుతో ఆగిపోయాడు.

"అయామ్ సో సారీ శ్రీనివాస్‌గారూ! లోకంలో అందరూ ఒక్కలాంటి వాళ్ళేనని అంచనా వేయడం పొరపాటని నే నీ క్షణమే తెలుసుకున్నాను. రండి, పాడతాను. పాట విని వెదుదురుగాని," అంది త్రివేణి తన తొందరపాటుకి పశ్చాత్తాపపడుతున్నదానిలా.

శ్రీనివాస్ మొహం మతాబులా వెలిగింది. "నిజంగానా త్రివేణిగారూ! నిజంగా నా కంత అదృష్టమా? అబ్బ! అదృష్టం నన్నిలా వరించడం జీవితంలో ఇదే మొదటిసారి త్రివేణిగారూ!" ఆనందంతో తబ్బిబ్బవుతూ అన్నాడు శ్రీనివాస్.

త్రివేణి నవ్వుతూ "వచ్చి ఇలా కూర్చోండి!" అంది. అతను కూర్చున్నాక వీణముందు కూర్చుని తన శ్రావ్యమైన తీయని కంఠం ఎత్తి పాడసాగింది త్రివేణి.

పాడుతున్న ఆమెని ఒళ్ళంతా కళ్ళుచేసుకుని తన్మయుడై తదేకంగా కాంక్షగా చూడసాగేడు శ్రీనివాస్. పాడుతున్న త్రివేణి చూపులు శ్రీనివాస్‌మీద అనుకోకుండా నిలిచినప్పుడు అతని చూపులతో తన చూపులు కలుసుకుని చిక్కబడగా ఒళ్ళంతా ఝల్లుమని మనసులోనే తత్తరపడసాగింది.

త్రివేణి పాడ్డం పూర్తిచేసింది. శ్రీనివాస్ ఆమెవంక కృతజ్ఞతగా చూస్తూ, "చాలా థాంక్స్ త్రివేణిగారూ! మెనీ మెనీ థాంక్స్! ఎన్ని జన్మలెత్తినా మీ ఋణం తీర్చుకోలేనన్పిస్తూంది," అన్నాడు.

"మీరు మరీ ఇదిగా అంటున్నారు. నాకు చేతనైన విద్య గనుక నేను పాడ గలిగేను. అంతే," మొహమాటంగా అంది త్రివేణి.

"చేతనైన విద్యే అయినా మొదట పాడనన్నారుగా! చివరికి ఏ దేవుడి దయవల్లో కరుణించేరు. వస్తానిక," అన్నాడు శ్రీనివాస్.

"వెళ్ళిరండి. అనవసరంగా మనసు పాడుచేసుకోకండి."

"అలాగే!" వెళ్ళబోయాడు.

"శ్రీనివాస్‌గారూ!" పిలిచింది త్రివేణి. ఏమిటన్నట్టు చూశాడు వెనుదిరిగి శ్రీనివాస్.

కాస్సేపు తటపటాయింపుగా చూచి మళ్ళీ సర్దుకుంటూ "ఏం లేదు. మళ్ళీ మీ మనసు బాగుండనప్పుడు ఇక్కడికి రండి. తప్పకుండా పాడతాను. ఇప్పుడివన్నీ మనసులో పెట్టుకుని రావటం మానేయకండేం? "అంది త్రివేణి.

"అంతకంటే భాగ్యమా? వస్తాను," అని చెప్పేసి విజయగర్వంతో నవ్వు కుంటూ రోడ్డెక్కాడు శ్రీనివాస్.

## 18

శ్రీనివాస్ మొదట వారంరోజుల కొకసారి కేవలం పాట వినడానికి మాత్రమే వచ్చినట్టు వస్తూండేవాడు. ఆ తరువాత కొన్నాళ్ళు నాలుగురోజుల కొకసారి వస్తూ క్రమంగా రెండేసి రోజులకి వచ్చేవాడు. అతని మాటల్లోగాని, చేతల్లోగాని వేరే దురభిప్రాయంగాని, దురుద్దేశంగాని ఉన్నట్టు కన్పించకపోవటంతో త్రివేణి నిస్సంకోచంగా, మనస్ఫూర్తిగా అతనితో స్నేహంచేస్తూ పరిచయం పెంచుకో సాగింది రాను రాను ఒక్క పాట వినటమే గాకుండా ఏవైనా కబుర్లుకూడా చెబుతూ నవ్వుతూ నవ్విస్తూండేవాడు. త్రివేణికూడా తనకు తెలిసిన కబుర్లు చెబు తుండేది. ఆ స్నేహం ఎంతవరకు వచ్చిందంటే శ్రీనివాస్ వస్తానన్న టైమ్‌కి

రాకపోతే త్రివేణికి ఏమీ తోయ్యకుండా, మనసుకి నిలకడలేకుండా అతనికోసం వీధిగుమ్మంలో నిలబడి ఎదురుచూచేలా చేసింది.

ఒకసారతను ఎంతో ఉత్సాహంగా వచ్చేడు. "త్రివేణిగారూ! త్రివేణిగారూ! ఈ రోజు నా జీవితంలో ఎంతో చెప్పుకోదగ్గ రోజు. నేను కూడా మనిషినేనని, ఈ లోకంలో నిలబడగలనని నామీద నాకే నమ్మకం కలిగించిన రోజు" అన్నాడు.

"ఏమిటండీ విశేషం?" ఆసక్తిగా అడిగింది త్రివేణి.

"ఈ రోజు నాకు ఉద్యోగం వచ్చిందండీ. ఇక నా ఫ్రెండ్‌మీద ఆధారపడి జీవించనక్కరలేదు. నా జీవితం ఇలా మలుపు తిరుగుతుందని, దేవతలాంటి మీరు కనపడి నా బాధలు, అశాంతి, ఈ మనోవ్యథ అంతా పటాపంచలు చేసి నాకు జీవితంమీద నూతన ఆశలు కలిగిస్తారని నేనెప్పుడూ అనుకోలేదు."

"ఇది మరీ బాగుందండోయ్! ఉద్యోగం మీ క్వాలిఫికేషన్స్‌తో మీకు రావడ మేమిటి? మీరు నన్ను ఇలా ఆకాశాని కెత్తేయడ మేమిటి?" అంది త్రివేణి.

"నా క్వాలిఫికేషన్స్ వల్లే నాకుద్యోగ మొచ్చినా నాలో ఉద్యోగం చెయ్యా లనే వాంఛను రేకెత్తించి, అప్లికేషన్ పడేసే శక్తిని కలిగించింది మీరేకదా! నాలోని నిరాశా నిస్పృహలని మీ గానంతో పారద్రోలి, నా మనసుని అనుక్షణం పీక్కుతినే బాధలనుండి నన్ను ఓదార్చి మీ కమ్మని గానంతో జోలపాడి, సేద దీర్చి నాకు తిరిగి జీవితంమీద ఆశను చిగురింపచేసింది మీరే గదా! నాకు ఆ భగవంతుడు కూడా మీ కంటే ఎక్కువకాదు. నేను మీకు జన్మ జన్మలకు కృతజ్ఞుడినై యుంటాను." ఆమెవంక ఆరాధనగా చూస్తూ తన్మయత్వంగా అన్నాడు శ్రీనివాస్.

అతని చూపుల్లో చూపులు కలపలేనట్టు చూపులు క్రిందకి దించేసింది త్రివేణి. అంతవరకు కఠిన పాషాణంలా ఉండే ఆమె మనసు అప్పుడప్పుడే అతని సాన్నిధ్యంలో మెత్తబడుతూ కరగటం ప్రారంభించింది. ఆమె మనసులో ఆశలు చిగుళ్ళు వేయసాగేయి. అతను తనకేసే తదేకంగా చూచే చూపులలో చూపులు కలపలేనట్టు తడబడిపోసాగింది త్రివేణి. అతను తనను పొగుడుతూ మాట్లాడుతున్న మాటలకు హృదయం పురివిప్పిన మయూరంలా ఆడసాగింది. అతని స్వరం వింటూంటే నాగస్వరం వింటూన్న నాగినిలా మైకం కమ్మసాగింది.

తను ఇటువంటి అనుభూతులకి దూరంగా వుండాలని మనసుని ఎన్నోసార్లు మందలించుకుంది. తను అటువంటి ఆశలకి అర్హురాలు కాదు. శ్రీనివాస్ తన విషయంలో ఎంత కృతజ్ఞత కనబరుస్తూ ఆకాశానికెత్తుతున్నా తన కోరిక చెప్ప

గానే తననో భూతాన్ని చూచినట్టు చూస్తూ పదామడలు పారిపోతాడు. కృతజ్ఞత చూపించడం వేరు, జీవితంలోకి ఆహ్వానించి జీవితాంతం భరించడం వేరు.

## 19

తరవాత వరసగా నెలరోజులు శ్రీనివాస్ త్రివేణి కంటికి కనిపించలేదు. రెండు రోజుల కొకసారైనా తన పాట వింటేగాని జీవించలేనట్టుండే శ్రీనివాస్ అసలు ఇంటి దరిదాపులకే రాకపోవడం త్రివేణికి చాలా ఆశ్చర్యంగా అనిపించింది. కారణం ఏమై ఉంటుందా అని ఆమె మనసు పరిపరి విధాల ఆలోచించ సాగింది. తన ముఖకవళికల్లో, తన మాటల్లో తన మనోభావాలు అతని ముందు వెల్లడైపోయాయా? అందుకే అతడు జడిసి రావడం మానుకున్నాడా? ఇలాంటి విషయాల్లో ఎంతో ఉదాసీనంగా ఉండే తను అతన్ని చూచినప్పటినుండీ తనకు తెలియకుండానే ఇలాంటి ఆశలను ఎందుకు కలగనివ్వాలి? ఏ మగవాడినైనా అనుమానంగా చూస్తూ తన కామడదూరాన్న నిలబెట్టే తను అసలు ఈ శ్రీనివాస్‌ని ఇంత దగ్గరగా ఎందుకు ఎలా రానిచ్చిందో, తన మనసులో తనకు తెలియకుండానే ఎందుకు తావిచ్చిందో ఆలోచించుకుంటూంటే తనకే అర్థంగాకుండా వుంది.

తను మామూలు మనిషి. పరువం పురివిప్పిన పడతి. ప్రకృతి కలిగించే సహజమైన అలజడికి లొంగిపోకుండా ఉండడానికి తాను మానవాతీతురాలేం కాదు. తనను తను సమర్థించుకో జూచింది త్రివేణి. శ్రీనివాస్‌కోసం ఆమె మనసు ఎంతో ఆరాటపడుతూ నిలకడలేని మనస్సుతో కాలుగాలిన పిల్లిలా ఊరికే ఇల్లంతా తిరగసాగింది.

ఆ రోజు హఠాత్తుగా ఊడిపడ్డాడు శ్రీనివాస్ చేతిలో ఏదో పేకెట్‌తో. త్రివేణి మొహం వికసించింది. మనస్సులో తనకు తెలియకుండానే ఆనందం చోటుచేసుకుంది.

"ఇన్ని రోజులూ ఏమయిపోయారు శ్రీనివాస్? అబ్బ మీకోసం ఎంత ఎదురు చూశానో తెలుసా?" సంభ్రమంగా అంది త్రివేణి.

"నిజంగానే ఎదురు చూశారా? అయితే నే నదృష్టవంతుడినే."

"అదృష్టమా?"

"ఔను. అదృష్టమే. అనుక్షణం నేను తలుచుకునే వ్యక్తి నా కోసం ఎదురు చూస్తూందంటే అంతకంటే ఆనందం, అదృష్టం ఏముంటుంది?"

త్రివేణి బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. "నన్ను మీరు తలుచుకుంటున్నారా?

అంతా అబద్ధం. అదే నిజమైతే ఇన్నిరోజులు నే నసలు గుర్తేలేనట్టు రాకుండా ఉండగలరా ?" చిరుకోపంతో అంది త్రివేణి.

"ఇన్ని రోజులూ రాకపోవటానికి కారణముంది త్రివేణిగారూ! నేనో నిర్ణయానికి రావటానికి ఇన్నిరోజులు పట్టింది. జీవితంలో దెబ్బతిన్నవాణ్ణి. అందుచేత త్వరపడి నిర్ణయం చేసుకొని మరోసారి దెబ్బతినదలుచుకోలేదు. నా నిర్ణయాన్ని దైవం ఏ రకంగా చేస్తాడో "

"ఏమిటది ?" ఆతృతగా అడిగింది త్రివేణి.

"అది తరువాత చెబుతాను. ముందీ చీర ఎలా వుందో చెప్పండి త్రివేణిగారూ! గబగబా పేకెట్ విప్పి నీలంరంగులో, పెద్ద జరీబార్డర్‌తో తళుకులీనుతున్న పట్టు చీర తీసి ఆమెచేతి కిచ్చేడు శ్రీనివాస్.

చీర పట్టుకుని మడతలు విప్పిచూస్తూ "చాలా బాగుంది శ్రీనివాస్‌గారూ! ఖరీదుకూడా రెండువందలైనా ఉంటుందనుకుంటాను. ఎవరికీ?" ఆసక్తిగా అడిగింది త్రివేణి.

శ్రీనివాస్ నవ్వేడు. ఎవరికోనా ? ఎవరికో అయితే నేనెందుకు కొంటాను త్రివేణిగారూ. నాకు మీరు తప్ప ఎవరున్నారు ? జీవితంలో అన్నివిధాలుగా ఓడిపోయిన నన్ను మళ్ళీ జీవితంమీద ఆశకలిగించి జీవించడానికి శక్తి, ఉత్సాహాల నిచ్చేరు. నేనిప్పుడు జీవితంలో నిలదొక్కుకున్నాను. భగవంతుడు మేలుచేస్తే నన్ను ఓడించిన ఈ జీవితాన్ని జయిస్తాను. ఇదంతా మీ చలవే త్రివేణిగారూ! నా మొదటి జీతంతో కొన్న చీర మీరు తప్పక కట్టుకోవాలి. ప్లీజ్! త్రివేణి గారూ! ఒక్కసారి కట్టుకుని రండి. ఈ చీరలో మిమ్మల్ని చూడాలని ఎంతో కోరికగా వుంది." వేడికోలుగా అన్నాడు.

అతని అభ్యర్థనని త్రోసిపేసే శక్తిలేనట్టు, అతను వేసే మంత్రాలకు కట్టు బడిపోయినట్టు, అతని మాటలకున్న మహిమలో పూర్తిగా తనను తను మరిచి పోయిన త్రివేణి మారు మాట్లాడకుండా ఆ చీర తీసుకుని గదిలోకెళ్ళి కట్టుకుని వచ్చింది.

నీలంరంగు పట్టుచీరలో పసిమిఛాయతో ఉన్న త్రివేణి అద్భుతంగా అజంతా సుందరిలా కన్పించసాగింది. అలా ఎదురుగా వచ్చిన ఆమెవంక ఎంతో ఆరాధనగా కళ్ళు తిప్పుకోలేనట్టుగా చూస్తూ ఎంతోసేపు ఉండిపోయాడు శ్రీనివాస్. అతని చూపుల్లో చిక్కిపోయిన త్రివేణి శరీరం ఏదో అవ్యక్తమైన భావంతో అర్థంగాని మత్తులో మునిగిపోతున్నట్టుగా ఉంది.

శ్రీనివాస్ మెల్లగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి ఆమె రెండు భుజాలమీదా చేతులువేసి గుచ్చిపట్టుకున్నాడు ఆమె కళ్ళలోకి అంతులేని కాంక్షతో, హద్దుమీరిన కోరికతో చూస్తూ "ఐ లవ్ యూ త్రివేణీ! ఐ లవ్ యూ! నువ్వు నాకు కావాలి" ఆవేశంగా అన్నాడు శ్రీనివాస్

త్రివేణి కన్నుల్లోకి అపూర్వమైన కాంతి వచ్చింది ఉద్వేగంతో మాట్లాడ్డానికి కూడా శక్తిలేనట్టు ఆమె ఊగిపోసాగింది.

శ్రీనివాస్ చేతులు ఆమెని హఠాత్తుగా ముందుకు లాక్కుని ఆవేశంగా తన గుండెలకు హత్తుకున్నాయి పరవశంగా కళ్లు మూసుకొని అతనిలో కలిసిపోవడమే తన జీవిత పరమావధి అన్నట్టు అతనికి అల్లుకుపోయింది త్రివేణి

అలా ఎంతసేపుండిపోయారో వాళ్ళకే తెలియదు శ్రీనివాస్ పెదవులు వేడిగా గాఢంగా ఆమె మెడ, చెంపలు, నుదురు తాకసాగేయి.

హఠాత్తుగా ఉలిక్కిపడిన త్రివేణి గబుక్కున అతనినుండి విడివడి దూరంగా జరిగింది

"ఏమైంది త్రివేణీ?" ఆత్రుతగా అడిగేడు శ్రీనివాస్

"శ్రీనివాస్! మీరు ఈ నిర్ణయం తీసుకోవడంలో త్వరపడ్డారు ఆ తరువాత మీరెంతో విచారిస్తారు. అప్పుడు బాధపడేది మీరొక్కరేకాదు నేనుకూడా. అది నా కిష్టంలేదు. మనం ఇలా స్నేహితులుగానే ఉండిపోవడం మంచిది"

"త్రివేణీ! నేను ఎంతో ఆలోచించే, ఎన్నో రోజులు తర్జన భర్జన చేసే ఈ నిర్ణయానికి వచ్చేనని నీతో ఇందాకే చెప్పేను నేను నీకు యిష్టంకాదని ఇప్పుడే ఋజువయింది నీవు ఇప్పుడు కాదంటే నా బ్రతుకంతా చీకటి త్రివేణీ! తిరిగి నా జీవితం ఎడారవుతుంది."

"శ్రీనివాస్! ఇప్పుడే అన్పిస్తోంది నన్నుగురించి నేను మీతో చెప్పకుండా చాలా పొరపాటు చేశానని. నా గురించి కొంత విన్న తరువాత అప్పుడు మీ నిర్ణయాన్ని సరిదిద్దుకోవాలో, సరిదిద్దుకోనక్కరలేదో ఆలోచించుకోండి."

పసిపాపను చూచి నవ్వినట్టు నవ్వేడు శ్రీనివాస్. "అదా నీ సందేహం త్రివేణీ! నీ గురించి నాకు తెలియదనుకుంటున్నావా? నీతో స్నేహం చేసిన మొదటి రోజుల్లోనే శ్రీధర్ నీ గురించి నాకంతా చెప్పేడు నీవు నీ కులానికేగాదు, అసలు ఆడవాళ్ళకే తలమానికంలాంటిదానివి. నిన్ను గురించి సందేహించేవాడు పరమ మూర్ఖుడు. అసలు నీవు ఇదివరకే ఇంకొకరి సొత్తుగాకుండా నా కోసమే మిగిలి ఉండడాన్ని నేనెంతో అదృష్టంగా, దైవం నాకిచ్చిన వరంగా భావిస్తు

న్నాను. నీవు నిలబెట్టిన ఈ జీవితాన్ని నీవే కడకల్లా పాలించాలి త్రివేణీ ! నీవు లేకపోతే నాకీ జీవితమే అక్కరలేదు నేను చివరిశ్వాస వదిలేవరకూ నాకు తోడుగా నీడగా, నా కనుక్షణం ధైర్యం కలిగిస్తూ, నీ కమ్మని పాటతో నాకు శాంతిని, ఆనందాన్ని కలిగిస్తూ నాకు ఉండిపోవాలి త్రివేణీ! సందేహమెందుకు? రా! త్రివేణీ! రా!" ఆవేశంగా రెండుచేతులూ ముందుకు చాచేడు శ్రీనివాస్

త్రివేణికి అంతా కలలోలా, నిజమో అబద్ధమో తేల్చుకోలేనిదానిలా చూస్తూ "నిజంగా నిజంగా నన్ను పెళ్ళి చేసుకుంటారా శ్రీనివాస్?" అమాయకంగా అడిగింది

"ఆల్ రైట్, నీ సందేహం నా కర్థమైంది త్రివేణీ! దైవసాన్నిధ్యంలో నిన్ను నాదాన్నిగా చేసుకున్నాకే, సర్వ అధికారాల్తో నిన్ను సమీపిస్తాను ఇప్పుడే వెళ్ళి పురోహితుడితో మాట్లాడి వస్తాను వస్తాను త్రివేణి" గబగబా బైటికి నడిచేడు శ్రీనివాస్.

కళ్ళు విశాలం చేసుకొని అతను వెళ్ళినవైపే చూస్తూ బొమ్మలా నిలిచిపోయింది త్రివేణి

## 20

వేణుగోపాలస్వామి ఆలయంలో శ్రీనివాస్ త్రివేణి మెడలో తాళిగట్టేడు త్రివేణి తన అదృష్టానికి పొంగిపోయింది తన భర్త ఔదార్యానికి, మంచి మనస్సుకి ఎంతో పరవశించిపోయింది మనస్సులోనే అతడికి దేవుడికంటే ఉన్నత స్థానం ఏర్పరచి ప్రతిక్షణం పూజించసాగింది ఆమెకి రోజులెంతో ఆనందంగా కలలో గడుస్తున్నట్టుగా ఉన్నాయి ఒకోసారి ఇది కలేనేమో ఏ క్షణంలోనైనా కరిగిపోయి తను మళ్ళీ మామూలు జీవితంలో పడిపోతుందేమోనని కాస్త భయంగా కూడా అన్పిస్తుంది తన యిల్లే స్వర్గంగా, తన భర్తే దైవంగా భావిస్తున్న త్రివేణికి ఇతర ప్రపంచంతో సంబంధమే లేదు

శ్రీనివాస్‌కూడా భార్యే లోకంగా గడపసాగేడు ఉదయం లేవగానే భార్య వెనకాతల పసివాడిలా ఆమె కొంగుపట్టుకుని తిరుగుతాడు ఆమె చేసే పనే తనూ చెయ్యబోతాడు ఆఫీసు టైమ్ అయ్యేవరకూ నవ్వుతూ నవ్విస్తూ ఉంటాడు ఆ తరువాత ఆఫీసుకి విదిలేక వెళుతున్నవాడిలా వెళ్ళి సరిగ్గా ఐదయేసరికి పరిగెట్టి వచ్చినట్టుగా వచ్చేస్తాడు త్వరత్వరగా భార్యకి వంటలో సహాయంచేసి ఇద్దరూ కలిసి ఏ సినిమాకో, షికారుకో బయలుదేరుతారు.

అనురాగంలో కరిగిపోయే త్రివేణికి మాత్రం అతను ఎక్కువగా కేంప్‌లంటూ పది పదిహేను రోజులు తనను విడిచి వెళ్ళిపోవడం మాత్రం చాలా బాధాకరంగా, ఆ రోజులు కొన్ని యుగాల్లా అన్పిస్తాయి అతని వెంట తినూ కేంప్‌కి వస్తానంటే అతను తీసుకెళ్ళడు

త్రివేణీ, శ్రీనివాస్‌ల పెళ్ళి జరిగి నాలుగు నెలలయింది ఈ నాలుగు నెలలూ నాలుగు నిమిషాల్లా గడిచిపోయాయి. ఒంట్లో బాగులేదని హాస్పిటల్‌కి వెళ్ళిన త్రివేణికి డాక్టరమ్మ చెప్పిన విషయం నిలువెల్లా ఆనందంలో ఉక్కిరి బిక్కిరయేలా చేసింది. ఆ రాత్రి ఎంతో పొంగిపోతూ తను తల్లి కాబోతూన్న వార్త భర్త చెవిని వేసింది

నివ్వెరపోయాడు శ్రీనివాస్. 'ఓ మైగాడ్ ! అప్పుడేనా ?' అన్నాడు

"ఏమిటండీ ? ఎంతో సంతోషిస్తారనుకుంటే ఏదో కొంపమునిగిపోయినట్టు మొహం పెడుతున్నారేమిటి ?" చిన్నబోతూ అంది త్రివేణి

"ఈ అమ్మాయి కాస్తా అప్పుడే అమ్మయిపోతుందంటే ఆశ్చర్యంగా అన్పిస్తోంది త్రివేణీ ! ఇక నాకు ఇంట్లో వినిపించేవి వీణానాదం, మధురగానం కాదు ఇల్లెగిరిపోయే అరున్నొక్క రాగాలు

"పోండి మీరు మరీను ఆ అరున్నొక్క రాగాల తరువాతే ఏ సంగీతమైనా! ఎంత విద్వాంసురాలయిన ఆడపిల్లయినా కోరుకునేది ఈ మాతృత్వమే " భర్త గుండెలపై తలవాల్చి పరవశంగా అంది త్రివేణి

"అప్పుడే అమ్మ లక్షణాలు, ఆ పెద్దతరహా నీలో వచ్చేశాయి త్రివేణీ! నాకీ నూతన జీవితం ప్రసాదించడమే గాక నన్ను నాన్ననిపిలాడా చేస్తున్నందుకు ఏమిచ్చి నీకు ఋణం తీర్చుకోగలను త్రివేణీ ?" భార్య వెన్నుపై ప్రేమగా రాస్తూ అన్నాడు శ్రీనివాస్.

"క్రొత్తగా ఏమీ ఇవ్వనక్కరలేదు ఇచ్చిన అనురాగం మాత్రం కడకల్లా పదిలంగా ఉంచితే చాలు " తృప్తిగా కళ్ళు మూసుకుంది త్రివేణి

## 21

కేంప్‌కెళ్ళిన శ్రీనివాస్ నెలరోజులైనా తిరిగిరాలేదు త్రివేణి కళ్ళల్లో వత్తులు వేసుకొని ఎదురుచూడసాగింది కనీసం ఉత్తరంకూడా అతని దగ్గరనుండి రాలేదు. త్రివేణి మనసు అతనికేం జరిగిందోనని కీడును శంకించింది.

నెలల్లా నెండునెలలు మూడు నెలలుకూడా గడిచింది శ్రీనివాస్ పత్తాలేడు. ఆమె మనసు కలవరపడసాగింది. శ్రీనివాస్ చెప్పిన ఆఫీసుకు వెళ్ళి వాకబు

చేసింది అసలు శ్రీనివాస్ పేరుగల ఉద్యోగే తమ ఆఫీసులో లేడని అక్కడి వాళ్లు చెప్పేసరికి త్రివేణి నిర్ఘాంతపోయింది. ఆమె కాళ్ళక్రింద భూమి కంపించ సాగింది. సర్వశక్తులూ ఉడిగిపోయిన త్రివేణి అతి కష్టంగా ఇంటికొచ్చి చేరింది.

శ్రీనివాస్‌ను బాగా ఎరుగున్నవాళ్లు ఎవరున్నారు అని ఆలోచించింది త్రివేణి. ఆమె మస్తిష్కంలో శ్రీధర్ మెదిలాడు ప్రాణం లేచొచ్చి శ్రీధర్ ఇంటికి వెళ్ళింది కానీ అక్కడా చుక్కెదురే అయింది ఆమెకి. అక్కడామెకి శ్రీధర్ కనిపించలేదు అతనికి అక్కడినుండి ట్రాన్స్‌ఫర్ అయిందని, అంతకు పది రోజుల ముందే కుటుంబ సమేతంగా వెళ్ళిపోయారని ఇంటివాళ్ళు చెప్పేరు. హతాశురాలయినట్టుగా కాళ్ళీడ్చుకుంటూ ఇంటికి తిరిగివచ్చింది త్రివేణి

వస్తాడేమో, వస్తాడేమో, ఏ క్షణంలో వచ్చి తలుపు గుద్దుతాడో అనేఆశతో అనుక్షణం ఎదురుచూస్తు, రాత్రిళ్ళు మేలుకుంటూ గడపసాగింది త్రివేణి నెలలు గడవసాగేయి నెలలతోపాటు కడుపులో ప్రాణంపోసుకున్న శిశువుకూడా పెరగ సాగింది. త్రివేణిని తెలిసినవాళ్ళు, స్నేహితులు అందరూ ఎగతాళిచేస్తూ నవ్వ సాగేరు. ఎలాగూ మోసపోయింది గనక వచ్చి తనతోచేరి తమ వృత్తిని చేపట్ట మని తల్లి ఎన్నోసార్లు ఒత్తిడి చేసింది కానీ త్రివేణి ససేమిరా వీల్లేదంది శ్రీనివాస్ ఇక రాడని అందరూ నిర్ధారించుకున్నా త్రివేణి మనసులో మాత్రం వస్తాడేమో, ఏ పరిస్థితులు అతన్ని రాకుండా చేశాయోననే ఆశ మిణుకు మిణుకు మనసాగింది శ్రీనివాస్‌తోడి తన అనుభూతులు, తమమధ్య అల్లుకున్న గాఢానుబంధం అతన్ని మోసగాడిగా, వంచకుడిగా ఏమాత్రం ఊహించనివ్వ లేదు.

త్రివేణికి తొమ్మిది నెలలు నిండి హాస్పిటల్‌లో మగశిశువును కంది లోకం చేసే అపహాస్యాలను లెక్కపెట్టదలచుకోలేదు ఇప్పుడు తన సర్వస్వం తన బిడ్డే ఆమె ఆశలు, ఆశయాలు, తన భవిష్యత్ అంతా ఆ బిడ్డే. త్రివేణి ధైర్యంగా మళ్ళీ తిరిగి వీణాకచ్చేరీ లివ్వసాగింది అయితే ఇదివరకటిలా ఆమె దగ్గరికి వీణా పాఠాలు నేర్చుకోడానికి ఆడపిల్లలు రావడంలేదు. ఇంట్లో ఇబ్బందిగా, రోజులు గడవటం కటకటగావున్నా త్రివేణి ఏమాత్రం జంకలేదు వెనుకంజ వెయ్యలేదు. తన జీవితానికాధారం తనబిడ్డ తిన జీవితలక్ష్యం తన బిడ్డను ప్రయోజకుడిని, ఉన్నతుడిని చెయ్యడం. తిను తినటం మానేసి పస్తు లుంటూ ఉన్నంతలో బిడ్డని చక్కగా పెంచసాగింది.

ఇప్పుడు బాబుకి మూడో సంవత్సరం వచ్చింది. పున్నమి చంద్రుడిలా




అందాలు చిందించే బాబును చూచి పొంగిపోయేది త్రివేణి. అతన్ని వివిధ అలంకరణలతో ఫొటోలు తీయించి వాటిని మురిపెంగా చూచుకుంటూ ప్రాణప్రదంగా దాచుకునేది. బాబుని వదిలి ఒక్క క్షణంకూడా జీవించలేదు త్రివేణి. తనప్రాణం, ఊపిరి, సర్వస్వం బాబే.

## 22

త్రివేణిని వదిలి వెళ్ళిపోయిన శ్రీనివాస్ తిరిగి మూడేళ్ళకు హఠాత్తుగా వచ్చేడు. తనను చూచి ఆశ్చర్యంగా బొమ్మలా నిలబడిపోయిన త్రివేణితో "త్రివేణీ! వచ్చేశాను త్రివేణీ! నీకోసం నేనెంతో వ్యధపడి అతి ప్రయత్నంమీద వచ్చేశాను. ఇక మనల్ని ఎవరూ వేరుచెయ్యలేరు త్రివేణీ! ఇన్నాళ్ళూ నిన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయినందుకు నన్ను క్షమించు. నేను చెప్పేది విని, నన్ను చుట్టుముట్టిన విషమ పరిస్థితులను అర్థంచేసుకొని సానుభూతి చూపిస్తావని, క్షమిస్తావనీ కొండంత ఆశతో, నమ్మకంతో వచ్చేశాను త్రివేణీ! దయచేసి అపార్థం చేసుకోవు కదూ?" ఎంతో దీనంగా, పశ్చాత్తాపంగా అన్నాడు శ్రీనివాస్.

ఇంత జరిగినా త్రివేణి యిప్పుడుకూడా అతని మాటలు నమ్మేసింది. అసలు అతని మాటలకున్న శక్తి అటువంటిదెమో. తను నమ్మిన మగవాడు మోసగాడని అనుకోలేకపోవడం, అతన్ని అనుమానించటానికి ఇచ్చగించకపోవడం ఆడదాని బలహీనత.

అన్నాళ్ళకు అతన్ని చూచినందుకు సంభ్రమానందాలతో ఉక్కిరి బిక్కిరయి

పోసాగింది త్రివేణి కళ్ళంట ఆనందబాష్పాలు ప్రవహిస్తూండగా చప్పున అతన్ని వాటేసుకుంది "నమ్ముతానండీ మిమ్మల్ని తప్పకుండా నమ్ముతాను. నాకు తెలుసు మీరేనాటికైనా తిరిగివస్తారని. ఇక మీరు నన్ను ఎప్పటికీ విడువరు కదూ?"

"విడువను త్రివేణీ! ఆ భగవంతుడి సాక్షిగా నిన్ను ఒక్కక్షణంకూడా విడువను నిన్ను దూరంచేసుకున్నందుకు నా ప్రాణం ఎంత కొట్టుకులాడి పోయిందో తెలుసా? ఇక ఒక్కక్షణంకూడా నిన్ను విడిచి బ్రతకలేను." ఆమె చుట్టూ చేతులు బిగిస్తూ అన్నాడు శ్రీనివాస్ అతనినుండి మెల్లగా విడివడింది త్రివేణి

"రండి స్నానం చేద్దురుగాని మన బాబు చూస్తున్నాడు" అంది

"మన బాబా? ఎక్కడ త్రివేణీ?" ఆతృతగా అడిగాడు శ్రీనివాస్.

త్రివేణి బాబుని తీసుకొచ్చి చూపించింది బాబు ఒళ్ళంతా ఆప్యాయంగా నిమురుతూ, ఆనందంగా అక్కున చేర్చుకున్నాడు శ్రీనివాస్ "ఇంత చక్కని బాబుకి నేను తండ్రిననుకుంటే నాకెంతో గర్వంగావుంది త్రివేణీ!" అన్నాడు. త్రివేణికి ఆ తండ్రీ కొడుకుల కలయిక ఎంతో మధురంగా అన్పించి కనుల నిండుగా తన్మయంగా చూచుకుంది

స్నానం భోజనం అంతా అయిన తరువాత ఆ రాత్రి పడుకునేటప్పుడు త్రివేణిని దగ్గరకు లాక్కుని చెప్పసాగేడు శ్రీనివాస్.

"త్రివేణీ! మన పెళ్లికి ముందుగాని, తరువాతగాని నీకు కొన్ని విషయాలు చెప్పలేదు ఎందుకో తెలుసా? నేను డబ్బున్న యువకుడినని చెప్తే నువ్వు నన్నెక్కడ నిరాకరిస్తావోనని నేను డబున్నవాడినే అయినా సుఖం, శాంతీ లేని జీవితం నాది నాకు తల్లిలేదు. తోబుట్టువులు లేరు నన్ను నిరంకుశత్వంగా పాలించే తండ్రిమాత్రం వున్నాడు ఆ అధికారాన్ని, నిరంకుశత్వాన్ని నేను భరించలేకపోయేవాడిని. మా నాన్న ఎంత కర్కోటకుడంటే తను గీచిన గీటు నేనేమాత్రం దాటినా అతి నిర్దాక్షిణ్యంగా శిక్షించేవాడు రవంత ఆప్యాయతకీ, ఆదరణకీ, కనీసం సానుభూతికి కూడా నోచుకోని జన్మ అయిపోయింది నాది. అందుకే ఇంట్లోంచి వచ్చేశాను

త్రివేణీ! నీ పరిచయంతో నాలోని బాధలు తొలగిపోయినట్టయాయి నీ సాన్నిధ్యంలో నాకు స్వర్గం కన్పిస్తుండేది జీవితంమీద ఆశ కలిగించి నూతన జీవితాన్నిచ్చేవు. ఉద్యోగం చేస్తున్నానని చెప్పి నిన్ను నమ్మించేను ఆ తరువాత

మనిద్దరం పెళ్లిచేసుకున్నాం. అప్పుడైనా నీ కీ విషయం చెప్పి వుండవలసింది. కానీ చెప్పకపోవడం చాలా పొరపాటైంది.

హఠాత్తుగా నా మిత్రుడు ఒకసారి కన్పించి మా నాన్నకి చాలా సీరియస్‌గా ఉందని, నా కోసమే కలవరిస్తున్నాడనీ, తను నా విషయంలో ప్రవర్తించిన దానికి ఎంతో పశ్చాత్తాపపడుతున్నాడని నమ్మించి తీసుకువెళ్ళేడు. అందుకతనికి వెయ్యి రూపాయలు లంచం మా నాన్న ఇచ్చేడని ఆ తరువాత తెలిసిందనుకో. మా నాన్న నన్ను ఒక గదిలోపెట్టి తాళంవేసి తను చెప్పిన అమ్మాయిని పెళ్లి చేసుకోమని నిర్బంధించసాగేడు. నేను తప్పించుకుపోవటానికి ఏమాత్రం అవకాశం లేకుండా కట్టుదిట్టం చేశాడు.

త్రివేణీ? నేనప్పటినుండీ తప్పించుకుపోయే మార్గంకోసమే ప్రతిక్షణం ప్రయత్నిస్తూండేవాడిని. నీ కోసమే నా మనసు కలవరించిపోయేది. మూడేళ్ళు గడిచిపోయాక ఈ రోజు అతిప్రయత్నంమీద తప్పించుకొని వచ్చేయడానికి వీలు కుదిరింది. ఇప్పుడు నమ్ముతావా త్రివేణీ?

గాఢంగా నిట్టూర్చింది త్రివేణి. "తప్పకుండా నమ్ముతాను. అసలు ఎప్పుడూ కూడా మీ మీద అపనమ్మకం నాకు లేదు శ్రీనివాస్. ఎలాగైతేం ఆ భగవంతుని దయవల్ల మీరు వచ్చేశారు. నాకంతే చాలు."

"త్రివేణీ ...." శ్రీనివాస్ ఏదో చెప్పబోయాడు.

"ఇక సంజాయిషీలొద్దు శ్రీనివాస్! చాలా రాత్రయింది. తెల్లవారేవరకూ కబుర్లతోనే కాలక్షేపం చేస్తారా?" చిలిపిగా నవ్వింది.

"ఓ! నిజంగానే కబుర్లలోపడి అంతపనీ చేసేవాడినే త్రివేణీ!" అంటూ ఆమె నాక్రమించుకుంటూ ఆమె ప్రక్కన ఒరిగిపోయాడు శ్రీనివాస్.

## 23

త్రివేణి జీవితంలో వసంతం తిరిగి ప్రవేశించింది. బిడ్డతో, భర్తతో ఆనందంగా గడిచిపోతూంది ఆమె జీవితం. నాలుగు నెలలు అతి తొందరగా క్షణాల్లా గడిచిపోయాయి. భార్యాబిడ్డలతో శ్రీనివాస్ ఎనలేని ఆనందాన్ని అనుభవించ సాగేడు. భర్త మీద పూర్తి నమ్మకం ఏర్పడిపోయింది త్రివేణికి. తనకీ ఆనందం శాశ్వతం అనుకుంది. లోకంలో తనంత అదృష్టవంతురాలు ఉండదనుకుంది.

ఒకరోజు బాబుని కాన్వెంటుకి తీసుకువెళ్ళేడు శ్రీనివాస్. ఎంత టైం గడుస్తున్నా శ్రీనివాస్ తిరిగిరాలేదు. త్రివేణి కంగారుగా కాన్వెంటుకి వెళ్ళింది. ఆ రోజు అసలు శ్రీనివాస్ బాబుని కాన్వెంట్‌కే తీసుకురాలేదని అక్కడివాళ్ళు

చెప్పేరు. త్రివేణి గుండె ఆగినట్టయింది. అంతవరకూ తను మోసపోయానని ఎప్పుడూ అనుకోకపోయినా ఆ క్షణంలోమాత్రం అందరూ అనుకుంటున్నట్టుగా తను మోసపోయిందేమో అనుకుంది మొదటిసారిగా ఆ రాత్రంతా త్రివేణికి నిద్రలేదు. అంతులేని ఆలోచనలతో మనసుని ఆందోళనపరిచే భయాలతో పిచ్చెక్కినదానిలా ఏడుస్తూ తలబాదుకుంటూ గడపసాగింది ఆ రాత్రంతా త్రివేణి.

ఆ మర్నాడు రిజిష్టరు పోస్టులో త్రివేణి కో ఉత్తరం వచ్చింది. దాన్ని ఆతృతగా చదివింది త్రివేణి.

"మైడియర్ త్రివేణీ!

బాబుని నేను తీసుకువెళుతున్నాను. నువ్వేం ఖంగారుపడకు బాబు నాకు కావాలి నేనసలు అందుకోసమే వచ్చాను.

త్రివేణీ! ఇంత జరిగి, నీ బాబునికూడా తీసుకువెళుతున్నప్పుడు కూడా నీకు నిజం పూర్తిగా చెప్పకపోవడం చాలా అన్యాయం కదూ? ఇంతవరకూ తీయని అబద్ధాలు విన్నావు ఇప్పుడు చేదునిజం విని భరించాలి మరి చెప్పనా?

త్రివేణీ! నేను చాలా డబ్బుగల యువకుడిని కోటీశ్వరుడిని చాలా గొప్ప వంశం మాది అయితే ఇక్కడ నామీద అధికారాలు చెలాయించేవాళ్ళూ, ఆంక్షలు విధించేవాళ్ళూ ఎవ్వరూ లేరు ఇక్కడ అధికారమంతా నాదే అందరూ నా కాలి క్రింద పడుండవలసినవాళ్ళే. అయితే నా ఈ నాటకానికి కారణమేమిటో తెలుసా?

నా దృష్టిపడిన ఏ అందమైన ఆడపిల్లా ఒక్కరాత్రయినా నా సొంతం గాకుండా పోలేదు వాళ్ళని నా దారికి తిప్పుకోడానికి ఎవరిదగ్గర ఏ చిట్కాలు ప్రయోగించాలో, ఏ ప్రలోభాలతో ఎవర్ని స్వాధీనపర్చుకోవాలో నాకు బాగా తెలుసు. కళావంతుల పిల్లవైనా నిన్ను నా దారికి తిప్పుకోవటానికి, నా కోరిక తీర్చుకోవటానికి అందరిమీదా ప్రయోగించిన పద్ధతులు నీ మీద పనిచేయవని తెలుసుకున్నాను అందుకే యింత నాటకమాడి నిన్ను పెళ్ళిచేసుకున్నాను నిన్ను జీవితాంతం భరించటానికికాదు త్రివేణీ! నా కోరిక తీర్చుకోడానికి మాత్రమే. అంతే నువ్వు గర్భవతివయ్యావు నా కోరిక తీరింది నీ మీద మోజు పోయింది. అంతే ఈ నాటకంలో నా పాత్రని ముగించేద్దామనుకున్నాను. తప్పుకున్నాను.

త్రివేణీ! ఆ తరువాతేమైందో కూడా నీకు కొంచెం చెప్పాలి నాకు వివాహమై పది సంవత్సరాలు దాటినా నాకు సంతానం కలగలేదు నా ఈ గొప్ప వంశాన్ని ఉద్ధరించడానికీ, నా ఈ కోట్లకొలదీ ఉన్న తరగని ఐశ్వర్యాన్ని అనుభవించ

టానికీ నాకు వారసుడు, వంశోద్ధారకుడు లేడు నా భార్య యిక గర్భవతికాదని డాక్టరు తేల్చిచెప్పేశాడు బంధువులు తమ తమ పిల్లల్ని పంచుకోమని రాబందుల్లా పీక్కు తినసాగేరు కానీ నా కది యిష్టంలేదు. నా రక్తాన్ని పంచుకున్న నా బిడ్డ మాత్రమే ఈ వంశానికి, ఈ ఆస్తికి వారసుడు కావాలి నా రక్తం పంచుకున్న బిడ్డ నీ గర్భంలో పెరుగుతున్నట్టు హఠాత్తుగా గుర్తొచ్చింది అంతే వెంటనే బయలుదేరి వచ్చేశాను. నీకు కట్టుకథచెప్పి నమ్మకం కలిగించి బిడ్డని, నా వంశోద్ధారకుడిని తీసుకొచ్చేశాను అసలు నా బిడ్డ నీ దగ్గిర పెరగటమేమిటి? వాడిని పెంచటానికి కాదుగదా, వాడిదగ్గర బానిసగాకూడా ఉండే అర్హత నీకు లేదు. మీలాంటివాళ్ళ విలాసవస్తువులు మీరు. అంతవరకే మీ ధర్మం. నా బిడ్డను పెంచాలనుకోవడం అత్యాశ అవుతుంది నీ నీడే వాడి జీవితానికో తీరని కళంకం. మాయనిమచ్చ. అందుకే వాడిని నాతో తీసుకువెళుతున్నాను.

నన్ను కలుసుకోవాలనిగాని, వాడిని తిరిగి పొందాలనిగాని ప్రయత్నించకు. నన్ను అల్లరిచేసి కోర్టులకి ఈడ్వాలని చూడకు. వంశ గౌరవాన్ని ప్రాణంగా చూసుకుంటాం మేము నా గౌరవానికి నీవల్ల ఏమాత్రం భంగం వాటిల్లినా సహించను నేను అందుకు పరిహారంగా నీ బిడ్డను బలితీసుకుంటాను వాడిని కన్న నీవు వాడెక్కడైనా క్షేమంగా ఉండాలని కాంక్షిస్తే కుక్కినపేనులా నోరు మూసుకుని పడివుండు నేను చెప్పింది గుర్తుందికదూ? నువ్వు వాడికోసం ఏమాత్రం ప్రయత్నించినా పర్యవసానం చాలా దారుణంగా ఉంటుంది జాగ్రత్త.

శ్రీనివాస్"

## 24

అంతవరకూ చెప్పి ఆగింది శ్రీచరణి. ఆమె గుండె ఆవేశంతో, భరించ శక్యంగాని బాధతో ఎగసెగసిపడుతూంది

"అయితే నేను శ్రీనివాస్‌లాంటి వాడినని నీ అనుమానమా చరణ్?" అశోక్ పరిహాసంగా నవ్వుతూ అన్నాడు

"అశోక్! నేను చెప్పిన ఈ కథ మీకు నవ్వులాటగా కన్పిస్తుందా? మీ హృదయం కరిగిపోవడంలేదూ? త్రివేణికి జరిగిన అన్యాయానికి జాలితో, కరుణతో నిండిపోవడం లేదూ? ఛీ! మీ మగజాతంతా ఇంతే ఆడవాళ్ళంటే మీకు చులకన ఎగతాళి" శ్రీచరణి చెంపలమీద కన్నీరు ప్రవహించసాగింది. అశోక్ కలవరపడ్డాడు

"అరే చరణ్! ఎందుకంత కోపం? నే నేమన్నానని? పైగా ఏడుస్తున్నావా?"

ఆమె కన్నీళ్ళు కర్చీఫ్‌తో వత్తేడు. "ఆ తరువాతేం జరిగింది చరణ్? చెప్పు. నిజంగా ఆ శ్రీనివాస్ కన్పిస్తే మెడలువంచి తీసుకొచ్చి త్రివేణి కప్పగించాలని ఉంది. చెప్పు చరణ్," కుతూహలంగా అడిగేడు అశోక్.

"నిజంగా మీ కలా అన్పిస్తుందా అశోక్? అయితే చెబుతాను. తరువాతేం జరిగిందో వినండి," కళ్ళు తుడుచుకుని చెప్పడాని కుద్యుక్తురాలయింది శ్రీచరణి.

"అశోక్! రెండోసారి కూడా మోసపోయి, విధిచేతిలో ఘోరంగా ఓడి పోయిన త్రివేణికి బ్రతుకంతా శూన్యంగా, అంధకారబంధురంగా కన్పించింది. ఆమె పరిస్థితికి జాలిపడుతున్నట్టుగా నోటితో దయతలచి నొసటితో వెక్కిరిస్తూ ఆమెను కబళించి పూర్తిగా పతనం చెయ్యాలని చాలామంది, ఆఖరికి ఆమెను కన్నతల్లి కూడా తీవ్రంగా ప్రయత్నించసాగేరు.

ప్రాణప్రదంగా పెంచుకున్న కొడుకు దూరమైపోవడంతో త్రివేణి గుండె కోసి వేరుచేసినట్టయింది. రాత్రింబగళ్ళు విలపించింది. హేళనలతో, అపహాస్యాలతో ఇంకా ఊళ్ళో బ్రతకలేక అర్ధరాత్రి రైలెక్కింది.

రైల్లో ప్రయాణిస్తున్న త్రివేణికి తన జీవితం అర్ధరహితంగా, భూమికి భారంగా కనిపించి ఆత్మహత్య చేసుకుందామనుకుంది. అనుకున్నదే తడువుగా పడుకున్నదల్లా లేచి డోర్ దగ్గిరకి వెళ్ళింది. కానీ అప్పటికే తనలాంటి దగా పడిన ఒక అమ్మాయి కూడా అదే ప్రయత్నంలో ఉండడం చూచి చప్పున ఆమె చెయ్యిపట్టుకుని వెనక్కి లాగి అనుకోకుండా ఆమెను రక్షించింది. ఆమెను సీటుమీద కూర్చోబెట్టి ఏడుస్తున్న ఆమెని ఓదార్చి వివరాలడిగింది త్రివేణి.

ఆ అమ్మాయి పేరు కమల. పుట్టడం మంచి వంశంలోనే పుట్టింది. తల్లి దండ్రులు లేని కమల ఒక అబ్బాయిని ప్రేమించి మోసపోయింది. ఫలితంగా గర్భవతైంది. ఈ సంగతి తెలిసి ఆమె అన్నా వదినలు ఇంట్లోనుండి తరిమేశారు. ఆ అబ్బాయిని వెదకడానికి లేని ధైర్యాన్ని, ఓపికను కూడదీసుకుని బయలుదేరింది. కానీ ఎక్కడా ఆమెను మోసంచేసిన ఆ వంచకుడు కనబడక పోవడంతో విసిగి వేసారి, నిరాశతో జీవితంమీద విరక్తితో ఆత్మహత్య చేసుకోబోయింది.

కమల కథనం విన్న త్రివేణి మనసు ఆమెపట్ల జాలితో నిండిపోయింది. తన ఆత్మహత్య మాట, తనకు జరిగిన అన్యాయంమాటా తాత్కాలికంగా మర్చిపోయిన త్రివేణి కమలకి ధైర్యంచెప్పి తనవెంట తీసుకువెళ్ళింది. ఆ ఊళ్ళో కొన్ని

సంగీత పాఠాలు కుదుర్చుకుని కమలతో కాలం గడపసాగింది త్రివేణి ఒకవంక కమల ప్రియుడిగురించి ఆచూకీ తీస్తూ మరోవంక తన బిడ్డని ఎ దైవమైనా కనికరించి తనకు తీసుకొచ్చి ఇస్తాడేమోనని కొండంత ఆశతో నమ్మకంతో బ్రతకసాగింది

కమలకి తొమ్మిదినెలలూ నిండి ఆడపిల్ల ప్రసవం అయింది కానీ పురిటి లోనే కమల పోయింది ఆ పిల్లని పెంచే బాధ్యత త్రివేణిమీద పడింది ఇప్పుడు త్రివేణికి ఆత్మహత్య చేసుకునే అవకాశం కూడా లేదు అశోక్! ఆ పిల్ల ఆమెకి కాల సంకెళ్ళు ఆ పిల్లకోసమే త్రివేణి జీవిస్తూంది రాను రాను తన కొడుకు కన్పిస్తాడేమోననే ఆశ ఆమెలో అడుగంటింది ఇప్పుడు త్రివేణి ధ్యేయం ఒక్కటే పెరిగి పెద్దదయిన కమల కూతురుకు తనలా కమలలా మోసపోకుండా మంచి జీవితబాట నేర్పరచి ఆమెకు ఉజ్వలమైన భవిష్యత్తు నేర్పరచాలని అందుకే అశోక్ అందుకే త్రివేణి బ్రతికి ఉంది జీవచ్ఛవంలా ” శ్రీచరణి కళ్ళు అవిరామంగా వర్షించసాగేయి

“అయితే ఇది నిజంగా జరిగిందేనా చరణ్! నే నింకా నువ్వేదో కట్టుకథ చెప్తున్నావనుకున్నాను నిజంగా ఇదంతా జరిగిందేనా ఇంతకీ ఎవరా నిర్భాగ్యురాలు ” అశోక్ ఆశ్చర్యంగా అడిగేడు

“ఆ నిర్భాగ్యురాలు ఎవరోకాదు అశోక్! మా అత్తయ్యే ఆమెకి హఠాత్తుగా తన కొడుకు కనిపించాడు కానీ అతనామెకి అందనంత దూరంలో ఉన్నాడు అప్పుడామె ఏంచెయ్యాలి అశోక్?”

“ఏమిటీ! ఆమె నీకు ఎప్పుడూ నీతిబోధలు చేసే మీ అత్తయ్యా ఆమె కొడుకు కనిపించాడా చాలా ఆశ్చర్యంగా ఉంది చరణ్! అప్పుడేమయింది?” ఉత్కంఠగా అడిగేడు అశోక్

“ఆ తరువాత ఏమవుతుందో మీరు చెప్పాలి ”

“అంటే ” అశోక్ కనుబొమలు ముడిపడ్డాయి ఆశ్చర్యంగా

“ఇదిగో ఈ ఉత్తరం చదవండి అంతా మీకే బోధపడుతుంది ” హేండ్ బేగ్‌లోనుండి మడతపెట్టిన ఒక కాగితం తీసి అతని చేతికిచ్చింది శ్రీచరణి అశోక్ ఆమెవంక క్రొత్తగా చూస్తూ ఆతృతగా ఆ కాగితం మడత విప్పి చదవ సాగేడు

“చరణీ!”

నా కథ పూర్తిగా చదివేవు కదూ? నా కథ మొదటసారిగా నీకే చెప్పేను

చరణీ! ఈ నీ అత్తయ్య కథ నీకు జాలి కలిగిస్తుందా చరణీ! జాలిపడ్డంతోనే సరికాదు చరణీ ఈ నీ అత్తయ్యకి మహోపకారం చేసే బాధ్యత కూడా నీ మీదుంది

నా బాబు కనిపించేడు చరణీ! ఎప్పుడో తెలుసా? రాత్రే! నువ్వు ఫోటో లోని మూడేళ్ళబాబుని చూచి మురిసిపోతున్నావే ఆ బాబే నా బాబు. అంటే నీ యజమాని అశోక్ నా బిడ్డ. అది చెప్పుకోడానికి నాకెంతో గర్వంగా ఉన్నా, చెప్పుకోనీయని విధి నా నోరు మూసేసింది. నేను తన తల్లినని తెలిసినా అశోక్ పైకి అనడానికి చాలా బాధపడ్తాడు. కించపడ్తాడు. ఆ రక్తం అలాంటిది. అహంకారంతో, అభిజాత్యంతో నిండిపోయిన ఆ రక్తం నన్ను తల్లిగా అంగీకరించనివ్వదు. అతనిలో నా రక్తం కూడా ప్రవహించినా, ఆ పెంపకంలో పెరగడంవల్ల అదెప్పుడో హరించిపోయుంటుంది. ఇప్పుడతడు అక్షరాలా గొప్పవంశపు బిడ్డ. చరణీ! నా బిడ్డని ఆ స్థానంలో చూడ్డం నాకెంతో ఆనందమే అయినా నా బిడ్డకోసం ఆరాటపడకుండా ఉండలేను.

చరణీ! అశోక్‌ను ఒక్కసారి కనులారా చూడాలని ఉంది. తనివితీరా హృదయానికి హత్తుకోవాలని ఉంది. అమ్మా అని పిలిస్తే విని తరించిపోవాలని ఉంది. ఆ ఒక్క పిలుపు విని తృప్తిగా, ఆనందంగా చివరి శ్వాస వదలాలని ఉంది. నాది బహుశా దురాశవుతుందేమో చరణీ!"

ఆ ఐశ్వర్యాన్ని, ఆ అధికారాన్ని, ఆ వైభవాన్ని వదులుకుని ఈ పేద కోసం వస్తాడా చరణీ! అదంతా వదులుకోనక్కరలేదు. ఒక్కసారి నన్ను తల్లిగా తన మనసులో గుర్తిస్తే చాలు. చరణీ! అశోక్‌తో నీకు చాలా పరిచయమున్నట్టుంది. అతనికిదంతా చెప్పి ఒక్కసారి నన్ను చూడ్డానికి తీసుకొస్తావా? అమ్మా! అనే ఆ పిలుపుని నాకు విన్పిస్తావా?

వద్దు చరణీ వద్దు. నువ్వలా చెయ్యొద్దు: ఒకవేళ....ఒకవేళ అశోక్ తన కన్నతల్లిని నే నయినందుకు, నాకు అతను పుట్టినందుకు కించపడ్తాడేమో, తననుతాను ఏవగించుకుంటాడేమో! నాలాంటి కులం తక్కువదాన్ని అతనికి జన్మనిచ్చినందుకు నన్ను అసహ్యించుకుంటాడేమో! చరణీ! అతను నన్ను అమ్మా! అని పిలవకపోయినా ఫరవాలేదు. కానీ నన్ను అసహ్యించుకోడాన్ని మాత్రం నేను సహించలేను.

చరణీ! అతన్నెలాగైనా నాగురించి ఏమీ చెప్పకుండా ఒక్కసారి మనింటికి తీసుకురా చరణీ! అతను రానంటే పోనీ దూరంనుంచయినా ఒకసారి




చూపించు. కనులారా ఒక్కసారి చూసుకుంటాను. పోయేముందు ఆ ఒక్క కోరికా తీర్చుకుని నిశ్చింతగా, హాయిగా పోతాను. నీ రాకకోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకుని క్షణాలు లెక్కపెడుతూ కూర్చుంటాను. తొందరగా అశోక్‌ను తీసుకునిరా చరణీ! ఈ అత్తయ్య కోరిక, ఆరాటం నీ కే క్షణంలోనూ మరుపకురాదు కదూ! ఉంటా!

నీ అత్తయ్య త్రివేణి."

ఆ ఉత్తరం చదవడం పూర్తిచేసిన అశోక్ స్థాణువై పోయాడు. "నో! నో! నేను నమ్మను. ఇట్ ఈజ్ ఇంపాజిబుల్!" గట్టిగా అరిచేడు.

"కాదు. నిజం. మీరు మా త్రివేణత్తయ్య కొడుకు." స్థిరంగా, అతని వంక పరిశీలనగా చూస్తూ అంది శ్రీచరణి.

"చరణ్! ఇదంతా నాకు అయోమయంగా ఉంది. మతిపోతున్నట్టుగా ఉంది. నా తల్లి త్రివేణా? ఆమెకింత అన్యాయం జరిగిందా? నేను నమ్మలేకుండా

ఉన్నాను ఇదంతా కట్టుకథ అని చెప్పు చరణ్!" ఆమె భుజాలు గట్టిగా గుచ్చి పట్టుకుని నిలువనీయని ఉద్వేగంతో ఊపసాగేడు అశోక్

"మీ రామె కొడుకని చెప్పుకోడం బాధా కరంగాఉంటె ఆ విషయిం చెప్పండ. కానీ కట్టుకథ అని మాత్రం అనకండి." తీవ్రంగా అంది.

"నో! నో! నా తల్లి ప్రతిమాదేవి. వెళ్ళి ఆమెనే అడుగుతాను." చివ్వున వెనుదిరిగేడు అశోక్. గుమ్మంలోనే ప్రత్యక్షమైంది ప్రతిమాదేవి.

"నాన్నా! అశోక్! శ్రీచరణి చెప్పింది అక్షరాలా నిజం. కట్టుకథ ఎంత మాత్రం కాదు." కన్నీళ్ళతో మొహం తిప్పుకుంది ప్రతిమాదేవిగారు.

"అమ్మా!" నిర్ఘాంతపోయాడు అశోక్.

"ఈ విషయం బైటపడే అవకాశం రాదనుకున్నాను. నువ్వు నా కొడుకువి కాదనే నిజం నా నోటితోనే చెప్పవలసి వస్తుందని కలలోకూడా అనుకోలేదు. కానీ వస్తూ వస్తూ శ్రీచరణి త్రివేణి కథ చెప్పడంతో కర్టెన్ వెనుకే ఆగిపోయాను. త్రివేణి జాలిగొలిపే కథ విన్నతరువాత, ఆమె నీకోసం పడే మానసిక వ్యధ తెలుసుకున్న తరువాత నిజం చెప్పకుండా ఉండలేకపోయాను. అశోక్! మీ నాన్నగారు నిన్ను తీసుకొచ్చిననాడే నాకీకథంతా చెప్పేరు. అయితే త్రివేణి మరణించడంవల్లే నిన్ను తీసుకురావడం జరిగిందని నన్ను నమ్మించేరు. అందుకే నేను నీమీద మరింత మమకారాన్ని ఏర్పరచుకున్నాను." ప్రతిమాదేవిగారు అశోక్‌ను సమీపించి అతన్ని పసివాడిలా రెండుచేతుల్లోకీ తీసుకున్నారు.

"నాన్నా! అశోక్! నీ తల్లి త్రివేణి! ఆమె ఆశలు, కోరికలు తీర్చు. ఆమెను పూజించు. కొడుకుగా ఆమె ఋణం తీర్చుకో. కానీ, కానీ, ఈ అమ్మని మర్చిపోకేం? ఈ అమ్మమీద చిన్నచూపు చూడకేం?" అంది కన్నీరు ఏకధారగా వర్షిస్తూండగా.

"అమ్మా!" ఆమె భుజంమీద ఒరిగిపోయాడు అశోక్. "అమ్మా! నా తల్లిని నాన్న ఇంతగా వంచించేడా అమ్మా? తలుచుకుంటూంటే ఆవేశంతో నా మనసు ఉడికిపోతూందమ్మా! నేను వెంటనే వెళతాను. నన్ను ఆశీర్వదించమ్మా!"

అంతలో, "టెలిగ్రామ్ వచ్చిందమ్మా మీకు", అంటూ విమల అక్కడికి రావడంతో అందరూ ఉలిక్కిపడ్డారు. ఆ టెలిగ్రాం వచ్చింది శ్రీచరణికి. సంతకంచేసి టెలిగ్రాం తీసుకుంది శ్రీచరణి ఆతృతగా.

టెలిగ్రాం చదివిన శ్రీచరణి "అత్తయ్యా!" అంటూ కుప్ప కూలిపోయింది. కంగారుగా ఆమె చేతిలోని టెలిగ్రాం కాగితం లాక్కుని చదివేడు అశోక్. "త్రివేణీ డైడ్! స్టార్ట్ ఇమీడియట్లీ!" అని ఉంది అందులో.

"అమ్మా!" అంటూ బిగ్గరగా అరిచిన అశోక్ ప్రతిమాదేవి భుజంమీద పసివాడిలా వాలిపోయి పిచ్చిగా జుట్టు పీక్కున్నాడు.

"ఏమైంది నాన్నా?" గాభరాగా అడిగింది ప్రతిమాదేవిగారు.

"అమ్మా! నేను చాలా దురదృష్టవంతుడినమ్మా! కన్నతల్లి ప్రేమకి నోచుకోని, ఆమెని కనులారా చూడని పాపాత్ముడిని. అమ్మా! నా తల్లి. నన్ను కన్న తల్లి ఈ లోకం విడిచి వెళ్లిపోయింది. ఆమె ఋణం తీర్చుకునే అదృష్టం నాకు లేదమ్మా! నన్ను చూడాలనే కడసారి కోరిక తీరకుండానే మా అమ్మ వెళ్ళిపోయింది." పసివాడిలా విలపించేడు అశోక్. అక్కడున్న అందరూ వింతగా, బొమ్మల్లా నిలబడి చూడసాగేరు.

శ్రీచరణి కొద్దిగా తేరుకుంది. "అశోక్! అత్తయ్యకు హార్ట్ఎటాక్‌లాంటి ఏ జబ్బూ లేదు." ఇంత సడన్‌గా పోవడానికి కారణమేమిటో నాకు తెలియడం లేదు." వెక్కిళ్ళ మధ్య ఏడుపు నాపుకుంటూ అంది.

"అమ్మా చరణీ! ఇప్పుడైనా మీరక్కడికి వెళ్ళిరండి. అక్కడకు వెళితే అంతా మీకే తెలుస్తుంది. కొడుకుగా అశోక్ ఆమె అంత్యక్రియలయినా జరిపితే చచ్చిపోయిన ఆమె ఆత్మ తృప్తిపడుతుంది. ఆమెకు మంచి దారి దొరుకుతుంది. వెళ్ళిరండమ్మా! నాన్నా! లే! వెళ్ళు." అశోక్ కళ్ళుతుడిచి అనునయిస్తూ అతన్ని పట్టుకుని బైట గుమ్మంవరకూ నడిపించుకు వచ్చింది. శ్రీచరణి ఆమె వెనుకే వచ్చింది.

అంతలో కాంపౌండ్‌లో కారొకటి వచ్చి ఆగింది. అందులోనుండి రాఘవవర్మగారు ఎఱ్ఱబారిన కళ్ళతో, రేగిన జుట్టుతో భీకరంగా దిగి, నేల అదిరిపోయేలా అడుగులేసుకుంటూ లోపలికి వచ్చేరు. ఆయన చేతిలో పొడవాటి తుపాకీ ఆకలిగా చూస్తున్నట్టు మెరుస్తూంది. ఆయన వాలకాన్ని చూచిన వాళ్ళు నిశ్చేష్టులయినట్టు నిలిచిపోయారు.

వాళ్ళను కొరకొరా చూస్తూ వికటంగా నవ్వేరు రాఘవవర్మగారు. "ఎక్కడికో బయలుదేరినట్టున్నారే," అన్నారు వ్యంగ్యంగా.

"ఔను. బయలుదేరాం." తిరస్కారంగా చూస్తూ అంది శ్రీచరణి.

"ఎక్కడికి త్రివేణి దగ్గిరికేనా?" బిగ్గరగా నవ్వేరు.

"ఔను. ఆ త్రివేణి పేరెత్తే అర్హతే మీకులేదు ఆమె మిమ్మల్ని జన్మలో క్షమించదు." అశోక్ అన్నాడు ఆగ్రహంగా.

"ఓహో! ఈ చిలక ఈ గోరింకకి పలుకులు నేర్పినట్టుందే. క్షమించడానికిగాని క్షమించబడడానికిగాని అసలామె లేనేలేదుగా. అశోక్! నువ్వు అమ్మా అంటూ

ఆమె దగ్గిరకి పరిగెట్టడానికిగాని, ఆమె ఎదుట నేను దోషిలా నిలబడి సంజాయిషీ చెప్పుకోడానికిగాని అసలు అవకాశమనేది రాకుండా చేసేశాను. నీమీద ఆమె నీడ పడడానికి కూడా వీల్లేదు. ఆమె ఉనికి నీ జీవితానికి మచ్చ. అందుకే ఆమె కీ లోకంలో పూర్తిగా తెగతెంపులు చేసేశాను. ఇదిగో ఈ తుపాకీతో ఆమె పీడ మనకి పూర్తిగా విరగడచేశాను."

"నాన్నగారూ!" గట్టిగా దిక్కులు పిక్కటిల్లేలా గర్జించాడు అశోక్. అతని కళ్ళనుండి నిప్పులు కురవసాగేయి.

"మీరేనా ఈ దారుణానికి ఒడిగట్టింది. మీరు రాక్షసులా, మనుషులా? మీ కెలా చేతులొచ్చేయి." శ్రీచరణి వణికిపోసాగింది.

"నేను రాక్షసుడినని త్రివేణి ఆనాడే తెలుసుకున్నది. తెలుసుకుని కూడా నా మాట వినకుండా తన కొడుకుకోసం ప్రయత్నించింది. నిన్ను ప్రయోగించింది. ఆ సంగతి నేను ఇక్కడ నీ మాటలవల్ల, చేతలవల్ల గ్రహించేను. నా ఆజ్ఞ ఉల్లంఘించిన త్రివేణిని క్షమించదలుచుకోలేదు. అది చేసిన నేరానికి తగిన విధంగా శిక్షించేను."

ప్రతిమాదేవి భర్తవంక ఏవగింపుగా చూడసాగింది. కానీ భర్త కోపంలో ఉన్నప్పుడు ఎదురు నిలిచి మాట్లాడ్డం ఆమె కెప్పుడూ అలవాటులేదు.

అశోక్‌లో ఆగ్రహం, బాధ, ఆవేశం, ఆవేదన అవధులు దాటసాగింది. "ఎంతపని చేశారు నాన్నా! ఎంత ఘోరానికి పూనుకున్నారు? నా తల్లి మీకే మపకారం చేసింది? నా తల్లిని చూచుకునే భాగ్యానికి నన్ను దూరం చేశారు. నేను మిమ్మల్ని క్షమించలేను నాన్నా, క్షమించలేను. మీరు నా జన్మకు కారణం అవడంచేత నేను మిమశ్నేం చేయలేను. కానీ నాన్నా! నా కన్నతల్లిని హత్య చేసినందుకు ఇంకొకరైతే నిలువునా చీరేద్దును. నేనేమైపోయినా నా కసి తీర్చుకుందును."

"అశోక్! నేను నీ జీవితాన్ని ఉజ్వలంగా వెలిగించేను. నా ఈ ఐశ్వర్యానికి, హోదాకి వారసుడిని చేశాను. నీవు త్రివేణికి పుట్టిన నేరానికి ఆమె నీ జీవితానికి మచ్చగా మిగిలిపోకుండా ఆమెనుండి దూరంచేసి గొప్ప వంశస్థుడిని చేశాను. నా వంశోద్ధారకుడిగా చేసుకున్నాను. నువ్వు ఎప్పటికీ నా కులదీపుడిగానే మిగిలిపోవాలి. అంతా నీకోసమే చేశాను అశోక్. నన్ను అర్థంచేసుకో. ఆ కులం తక్కువది మన బ్రతుకుల్లో ఒక పీడకల అనుకుని మర్చిపోదాం. ఈ శ్రీచరణిని వదిలిపెట్టేయ్. మన వంశానికి మచ్చతెచ్చే పని చేయకు. రా! తిరిగి రా."

అశోక్ పేలవంగా నవ్వేడు. "ఓహో! ఏం న్యాయం? అంతా నాకోసమే




చేశారా? నా కోసమే నా కన్నతల్లిని హత్యచేశారా? బాగుంది నాన్నా! చాలా బాగుంది. నా తల్లి మీ వంశానికి మచ్చ, కళంకం. కానీ ఆమె గర్భంనుంచి పుట్టిన నేను మీ వంశోద్ధారకుడిని. మీ ఆస్తికి వారసుడిని. నా జన్మకి కారణమైన ఆమెకు ఈ లోకంలో జీవించే అర్హతే లేదు. అందుకు ఆమె నన్ను కన్నడమే నేరం. నాన్నా! ఈ ఘోరాన్ని నేను సహించలేను. మీ రాజభోగాలకి వారసుడినై దర్జాగా బ్రతకడంకంటే ఆ పేదరాలి ప్రేమానురాగాల మధ్య బ్రతికితేనే ఎంతో శాంతిగా, సుఖంగా ఉండేవాడినేమో. నాన్నా! మీ భోగభాగ్యాలు నాకొద్దు. మీ కర్కశమైన గౌరవమర్యాదలు, మానవత్వం అనేది ఏకోశానాలేని మీ వంశ ప్రతిష్ట నాకొద్దు. ఆ భోగందాని కొడుకుగా, ఆమె వారసుడిగానే నేను అతి సాధారణ జీవితం గడుపుతాను. వస్తాను. నన్ను కన్నతల్లిని జీవించివుండగా సుఖపెట్ట లేకపోయినా ఇప్పుడు ఆమె అంత్యక్రియలు నా చేతులమీదుగా జరపడం నా కర్తవ్యం. వస్తాను నాన్నా! రా చరణ్!" శ్రీచరణ్ చేయిపట్టుకుని వడివడిగా నడవసాగేడు.

"ఆగు!" తుపాకి గురిపెడుతూ భీకరంగా గర్జించేరు రాఘవవర్మగారు. "ఒక్క అడుగు ముందుకు వేశారో నా తుపాకీకి మీ ఇద్దరూ ఎరయిపోతారు."

"నాన్నా! మీ గురించి పూర్తిగా తెలుసుకున్నాను. నా తల్లి విషాదగాథ విన్నాక నా జీవితంమీద నాకేమాత్రం ఆసక్తి లేదు. మీరేంచేసినా నాలోని నిశ్చయాన్ని మార్చలేరు. ప్రాణంకోసం భయపడి వెనక్కి తిరిగొచ్చి ప్రతిక్షణం ఇవ్వగించని బ్రతుకు విసుగు బ్రతికేకంటే తిరుగులేని నిశ్చయంతో ఒక్కసారే చచ్చి

పోవడం మంచిది మీ పని కానీయండి నాన్నా! నా నిర్ణయాన్ని మార్చడం మాత్రం మీ తరంకాదు. రా చరణ్!" ఆయన తుపాకీకి ఏమాత్రం భయపడని వాడిలా, ఆ బెదిరింపులు లెక్కచెయ్యని వాడిలా ధీమాగా, గంభీరంగా శ్రీచరణి చెయ్యిపట్టుకుని ఒక్కొక్క అడుగే వేయసాగేడు.

"అశోక్!" బిగ్గరగా అరిచిన రాఘవవర్మగారు తుపాకిని సవరించుకో సాగేరు.

"ఏమండీ!" చూస్తూ నిలబడ్డ ప్రతిమాదేవిగారు ఇక ఆగలేనట్టు చప్పున ఆ తుపాకీ ముందుకివచ్చి నిలబడింది.

"ఏమండీ! మీలో విజృంభిస్తున్న దానవుడికి ఇంకా శాంతి కలగకుంటే ముందు నన్ను పేల్చి ఆ తరువాత వాడిని కాల్చండి," అంది.

రాఘవవర్మగారి చేతిలోని తుపాకీ నిర్జీవంగా క్రిందకి వాలిపోయింది. ఆయన నిస్త్రాణగా సోఫాలో కూలబడిపోయారు.

"ప్రతిమా! వాడు చూడు ఎలా వెళ్ళిపోతున్నాడో! నేను వాడినేమీ చెయ్యలేను ప్రతిమా? అంత శక్తి నాకు లేదు. ఎంతైనా వాడిని కన్న కడుపు నాది. వాడిని పెంచిన చేతులు ఇవి. వాడినెలా చంపగలను. చూడు ప్రతిమా! నన్ను కాదని, నా ఐశ్వర్యాన్ని కాదని ఎలా వెళ్ళిపోతున్నాడో. నా వంశాన్ని ఉద్ధరించడానికి నాకు వంశోద్ధారకుడు లేడు ప్రతిమా!" హఠాత్తుగా పసివాడిలా మారిపోయిన రాఘవ వర్మగారు దీనంగా అన్నారు.

ప్రతిమాదేవిగారు ఓదార్పుగా ఆయన తలని తన భుజంమీద అన్చుకుంటూ అనునయంగా అంది. "ఏమండీ! వంశాన్ని ఉద్ధరించడానికి జీవితాల్ని, బ్రతుకుల్ని బలితీసుకోవడాన్ని ఎవరూ క్షమించరండీ. వాడు మానవుడండీ. మానవత్వం ఉన్న మానవుడు. నిలువెల్లా రాక్షసత్వంతో నిండిన అహంకార దర్పాలకి ఆలవాలమైన ఈ వంశప్రతిష్ఠలు, గౌరవాలు వాడికి అక్కరలేదు. మానవత్వాన్ని వెదుక్కుంటూ ఈ రాక్షసత్వాన్ని విడిచిపెట్టి వెళ్ళేడు. మానవుడిగా కన్నతల్లి బాధ్యతని సక్రమంగా నిర్వర్తించడం వాడి తొలిబాధ్యత. వెళ్ళనివ్వండి. అనవసరంగా బాధపడకండి. వాడిలో ఆ బాధ తగ్గేక అతని తల్లిని మీరు గౌరవించి, శ్రీచరణిని కోడలిగా ఆదరిస్తే వాడు తప్పక తిరిగివస్తాడు. మీ వంశం నిలిపే వంశోద్ధారకులని కనిస్తాడు."

ఆమె మాటలకి తృప్తిపడినవాడిలా ఆమె భుజంమీద తలవాల్చి సేద దీరేడు రాఘవవర్మగారు

———

# కష్టార్జితం

వి. శ్రీనివాసశాస్త్రి

అక్కడ స్నేహం, బీర్లూ విస్కీ అయి ప్రవహిస్తోంది.

"పెళ్లాం పుట్టింటికెళితే కూడ సెలబ్రేట్ చేసేవాణ్ణి నిన్నే చూస్తాన్రా." అభినందిస్తున్నాడో, విమర్శిస్తున్నాడో తెలియకుండా అన్నాడు ప్రకాశం రామారావుతో గ్లాసు నింపుకుంటూ.

"పెళ్ళయిన రెండేళ్ళ తర్వాత కడుపు కాయబట్టి తప్పనిసరై పుట్టింటి కెళ్ళిందిరా నా మిసెస్సు. లేకపోతే అది నన్ను వదల్దు.... పతివ్రత్త" అన్నాడు ఒత్తి పలుకుతూ భార్యా అవిధేయుడు రామారావు ప్రకాశం గ్లాసులో ఒంటరి విస్కీకి బీరు తోడు పంపుతూ.

"యు ఆర్ లక్కీ టు హావ్ హర్!" అన్నాడు సుందర్రావు రామారావు భుజం తట్టి.

"మీ ఆవిడ కాయతో వస్తుందా? పండుతోనా? ఏమిటి నీ ప్రిడిక్షను?" పొడుపుకథలాటి ప్రశ్న వదిలాడు జానకిరామ్ సంభాషణలో పాల్గొంటూ.

'కాయ' 'పండు', ఈ రెండు పదాలు అక్కడెవరికీ అంతుబట్టక అంతా మౌనంగా తాగుతూ, తింటూ ఆలోచనలో పడ్డారు.

సంభాషణకి ఆ రకంగా బ్రేక్‌పడి ఓ నిమిషంపాటు తప్పనిసరి నిశ్శబ్దం అక్కడ రాజ్యం ఏలిన తరవాత జానకిరామ్ ప్లేట్లోంచి కోడిమాంసం మెత్తటి ముక్క సెలక్టు చేసుకుని పంటికింద తొక్కిపెట్టి "కాయ అంటే ఆడపిల్లా పండు అంటే మగపిల్లాడు"అని సస్పెన్సు విప్పి, అందర్నీ ఆశ్చర్యపెట్టేసాననుకుని గబగబా రెండు గుటకలు విస్కీ మింగి, మర్రెండు మాంసంముక్కలు పంటి క్రిందికి తోశాడు.

అందరూ జానకిరామ్ తెలివితేటలకి సంతోషపడి, ఏదో ఓ జోకు దొరికింది వాడుకుందాం అన్నట్లుగా, గలగల జల జల నవ్వేసేరు.

ఇంక అక్కడికి తన రెస్పాన్సిబిలిటీ తీరిపోయినట్టు జానకిరామ్ మాట్లాడకుండా మౌనముద్ర దాల్చాడు గ్లాసు ఖాళీ చేస్తూ.

* * *

హెచ్చు ఖరీదుకి అమ్ముడుపోడానికి

---

**1978 చక్రపాణి నాల్గవ అవార్డు పొందిన కథ**



సిద్ధంగా అద్దాల బీరువాలో అందాల గాజు సీసాల్లో భద్రంగా బంధించబడ్డ లడ్డూల కేసి ఆబగా చూసింది సత్తిపండు ఆకలి చూపు.

మూడు రోజులుగా మంచినీళ్లతో నానుతున్న కడుపులో పేగులు కరక
మన్నాయి.

ఏమైనాసరే చేతులకి పనిచెప్పాల్సిం
తప్ప దారిలేదు అనుకున్నాడు వాడు.

జేబులు తడుముకున్నాడు-వాడి కోరి



యు:



లన్నింటికీ తిరుగులేని ఆశ - సరికొత్త బ్లేడు భద్రంగా చేతికి తగిలింది.

జేబులు కొట్టడం పాతస్తైన చాన్నాళ్ళకి-అంటే ఆర్నెల్ల క్రితం - మొదటి సారిగా పోలీసులకి దొరికిపోయింతరవాత పోలీసులు లాకప్‌లో ఒళ్ళు కుళ్ళబొడుస్తుంటే "ఈసారికి ఇడిసిపెట్టండి బాబోయ్ మంచిగా బతుకుతాను బాబోయ్" అని చేతులెత్తి వేడుకున్నాడు తను.

పోలీసులు తన దండాలకి విలువ నివ్వలేదు. తమ లాఠీలు ఎంత దుర్మార్గమైనవో రుచిచూపించారు. ఆ తరవాత ఆర్నెల్ల జైలు ఉగ్గబెట్టుకుని ఎలాగో గడిపి 'ఏమైనాసరే జేబులు కొట్టను' అన్న నిర్ణయంతో బైటకొచ్చాడు తను.

ఆ నిర్ణయమే ఈ మూడు రోజులూ తనని ఆకలితో చంపింది. పనిచేసుకు బ్రతకాలనుకున్నా అదంత లాభసాటి

కాదని తేలిపోయింది. అసలు పని దొరకనేలేదు. పని దొరికిన రోజున కడుపుకి చాలినంత దొరకలేదు.

ఒళ్ళెరుసుకుని కడుపు మాడ్చుకోడం కంటే, నాలుగు దెబ్బలుతిన్నా జేబులు కొట్టి తిన్నంత తిని, తాగినంత తాగి ఏ ఫుట్‌పాత్‌మీదో పడుకోవడమే సుఖం అని తెలిసిపోయింది. ఆ సుఖానికి అలవాటుపడ్డ వొళ్ళు, మనసు ఇప్పుడు అటే లాగుతున్నాయి.

వాడి ఆకలి చూపులిప్పుడు అద్దాల బీరువాలో లడ్డుండల నుంచి అప్పుడే వచ్చిన బస్సుగుమ్మం దగ్గర గుమి గూడిన జనంమీద పడ్డాయి. బాగా పలక గల జేబులకోసం వెతికాయి.

అదిగో శిల్క్‌లాల్చీ. తోసుకుని బస్సెక్కుతున్న నల్లరంగు పెద్దమనిషి శిల్క్‌లాల్చీ తప్పనిసరిగా పలుకు తుందన్న ధీమా కలిగింది సత్తిపండుకి.

గబగబా బస్సుగుమ్మందగ్గరకి నడిచి జనాన్ని తోసుకొని బస్సెక్కుతున్నట్టు నటించి శిల్క్‌లాల్చీ ప్రక్కన చేరాడు. అటూ ఇటూ చూసి మెల్లగా చేతులకి పని చెప్పాడు. మరునిమిషంలో బ్లేడు రోడుమీదికిపోగా లాల్చీలో పర్సు జేబులో కొచ్చిపడింది.

బస్సు కదిలింది. గమ్మున సత్తిపండు దిగిపోయాడు.

శిల్క్‌లాల్చీ జేబులు తడుముకుని గగ్గోలుపెట్టి బస్సు ఆపింది.

సత్తిపండు రాగల ప్రమాదం ఊహించిపరుగు లంకించుకున్నాడు.

గోలపెడుతూ రంకెలు వేస్తున్న శిల్కు లాల్చీని అడిగి విషయం తెలుసుకున్న పోలీసు వీరన్న కళ్ళు పారిపోతున్న సత్తిపండుని గుర్తుపట్టేయి.

"ఒరేయ్....ఆగరా...ఆగు" అంటూ పొలికేకలాంటి పోలీసు కేకవేసి పరుగు తీసాడు వీరన్న.

సత్తిపండు పరుగువేగం పెంచాడు.

జేబులో పర్సు....అందులో నోట్లు.... అద్దాల బీరువాలో లడ్లు.... జైల్లో కట కటాలు....లాకప్‌లో దెబ్బలు....

సత్తిపండు పోలీసుకి అందకుండా పరిగెడుతూనే ఉన్నాడు.

* * *

ఇంతకీ గుల్నార్‌లో రంభలాంటి బెంగాలీ లిల్లీలు ముగ్గురు దిగారు. పోదాం అంటావ్. అంతేగా?" జానకిరామ్ మురి పెంగా తాగుతూ లౌక్యంగా అడిగాడు రామారావుని.

"పర్సు పలకటంలేదురా." నీరసంగా అన్నాడు రామారావు.

"అదేంటోయ్ పెద్ద బిజినెస్ మాన్‌వి. మూడు లేత్‌మిషన్ల వర్క్‌షాప్‌కి సోల్ ప్రొప్రైటరువి. నీ పర్సు పలకకపోవడం ఏమిటి నాన్సెన్సు" అన్నాడు సుందర్రావు.

"నాయనా! నీ పర్సు పలకకపోతే

నెలజీతగాళ్ళం మా పర్సులు పలుకుతాయా" అన్నాడు ప్రకాశం.

అవునని ఒప్పుకున్నాడు రామారావు.

"బిజినెస్సు బాగానే సాగుతుంది కాని లచ్చిందేవి నిలవటంలేదు నా దగ్గర...." అని వాపోయాడు.

"బేపన బిజినెస్సంటే అంతే!" అని తేల్చేడు సుందర్రావు.

అదికూడా తిరుగులేని నెంబరు వన్ జోకనుకుని రామారావుతో సహా తక్కిన ముగ్గురూ నవ్వేసేరు. "బేపన బిజినెస్" గురించి స్వానుభవంతో రామారావు సోదాహరణంగా చిన్న లెక్చరిచ్చాడు.

"బేపనోడు బేపనోడే బిజినెస్సు బిజినెస్సే స్వానుభవం నాయనా స్వానుభవం ఇదిగో చెబుతున్నా విను.... పెళ్ళాం పుట్టింటి కెళ్ళింతరవాత మనసు ఇంటి మీద నిలవక వర్క్‌షాపులోనే కాలం వెళ్ళబుచ్చాను ఈ రెండ్రోజులూ .... దాంతో టర్నర్లు ఒళ్ళొంచి పనిచేసారు. మూడు రోజులు పడుతుందనుకొన్న శ్రీ ఇంజనీరింగ్ కంపెనీవాళ్ళ జాబ్‌వర్క్ దానితో చకచకా రెండురోజులలోనే పూర్తయిపోయింది. టైము కలిసి రావడంతో వాళ్లదే రెండో ఆర్డరుకూడా చేకప్‌చేశా. వర్క్ తొందరగా ఫినిషప్ చేసినందుకు శ్రీ కంపెనీ ప్రొప్రయిటరు పటేల్ సంతోషించి బిల్లు వెంటనే పాస్ చేశాడు. అందులో బ్యాంక్‌లోన్ తాలూకు ఇన్‌స్టాల్‌మెంట్ తీర్చేయగా మిగిలింది కొంత భార్యామణికి మనియార్డరు చేయగా తక్కినది ఇదిగో ఇలా మనముందు బీర్ బాటిల్సు, విస్కీ బాటిల్సు రూపంలో.."

"చాల్చాలు.... పెళ్ళాం పుట్టింటి కెళ్ళిన శుభసందర్భంలో పార్టీ ఇస్తూ మధ్యలో రామాయణంలో అదేదో వేట లాగా ఈ సోదంతా ఎందుకు? గుల్నార్ పిలుస్తోంది.... దానిమాటేదో తేల్చు" అని విసుక్కున్నాడు జానకిరామ్.

దాంతో సంభాషణ కులాల మీంచి కేబ్రేడ్యాన్సర్ల మీదికి మళ్ళింది.

ఈలోగా సీసా నాలుగు భాగాలై నలుగురి కడుపుల్లోకి వెళ్ళిపోయింది.

ఇంకో సీసాకి అదేగతి పట్టబోతోంది.

* * *

సత్తిపండు పరుగెడుతూ వచ్చి లాంతరు స్తంభం ప్రక్కన సందు మొగలో గోడకానుకుని నిలబడ్డాడు. భయం భయంగా వెనక్కి చూసాడు.

దూరంగా పరిగెడుతూ వస్తూన్న పోలీసు, ఆ వెనుక శిలుక్కలాల్చీ, మరెవరో కర్రలతో నలుగురైదుగురు మనుషులూ పిచ్చికుక్క కోసం తరుముతూ వస్తున్నట్లు వస్తున్నారు.

గబుక్కున జేబు తడుముకున్నాడు. జేబులో పర్సు.... అందులో నోట్లు.... కడుపులో ఆకలి.... జైల్లో కటకటాలు... లాకప్‌లో దెబ్బలు ....

సత్తిపండు మళ్లీ పరుగు పెడుతున్నాడు.

* * *

మిత్రులు ముగ్గురూ కొత్తకొత్త జారుల్లో కొత్తకొత్త డాన్సర్ల వివరాలు ముచ్చటించుకోవడంలో మునిగిపోయి ఉండగా —

బల్లకి చేతులు ఆన్చి అంచుమీద తల పెట్టుకుని సోషొచ్చినవాడిలా పడుకున్న రామారావుకి రెండువంచల మైళ్ల దూరంలో పుట్టింట్లో ఆ సమయంలో ఏ అమ్మకో చెల్లికో మొగుడి ముచ్చట్లు చెబుతున్న పతివ్రత పెళ్ళాం గుర్తుకొచ్చింది.

"రాధీ....నా రాధీ...."అని ముద్దుగా అనుకున్నాడు భార్యనుద్దేశించి.

"ఇంక తట్టుకోలేను వచ్చేసెయ్.... వచ్చేసెయ్...." అని గొణుక్కున్నాడు.

అతనికి ఓ పెగ్గు ఎక్కువయితే సుందరమైన కలలొస్తాయ్, నరాలు పట్టు తప్పుతాయ్. కోరికలు గుర్రాలవుతాయ్. శరీరం పూలపడవవుతుంది.

కట్టుకున్న పెళ్లాం అరిచి గీపెట్టినా పుట్టింట్లోనే ఉంది తప్ప అందుబాటులో లేదన్ననిజం మనసులో తాండవం చేస్తోంది. గుల్నార్‌లో కొత్తపిట్టలు చూడకుండానే ఊరిస్తున్నాయ్.

ఇన్ని అనుభూతుల మధ్య జేబులో రెండే రెండువందలు తక్కువయిపోయాయన్న బాధ చికాకుపెడుతోంది.

కసిగా బల్లని చేత్తో తట్టాడు.

"రామారావుగాడి కెక్కేసిందిరా ప్రకాశంగా. గురుడు పట్టుతప్పిపోయాడు." అన్నాడు సుందర్రావు. సుందర్రావూ, ప్రకాశం, జానకిరామ్ రామారావుని గట్టిగా పొదివిపట్టుకున్నారు.

*    *    *

సత్తిపండు పరుగెడుతున్నవాడల్లా ఆగి, దారిపక్క పిట్టగోడదూకి తెరచి ఉన్న దొడ్డి తలుపుగుండా పైన లైట్లు వెలుగుతూ కిందంతా చీకటిగా ఉన్న బంగళా వరండాలోకి వెళ్ళి నోరు తెరచిన పులి బొమ్మచాటున దాక్కున్నాడు.

పోలీసు పరిగెట్టుకుంటూ వస్తే అక్కడికి బూట్లచప్పుడు వినిపిస్తుంది. వాళ్ళు ఆ ఇల్లుదాటి వెళ్ళిపోతే తనకి తెలుస్తుంది. తాను ఈలోగా బైటకి వెళ్ళి గోడదూకి సురక్షితంగా వెళ్ళిపోవచ్చు అనుకున్నాడు.

చీకట్లో కళ్ళు చిట్లించుకుని వరండాలోకి చూసాడు.

కింద ఎవ్వరూ లేనట్టుంది. పైనించి నలుగురైదుగురి మాటలు, నవ్వులూ వినిపిస్తున్నాయ్.

"మళ్ళీ ఇక్కణ్ణించి పారిపోయేలోగా ఎవ్వరూ చూడకపోతే బాగుణ్ణు" అనుకున్నాడు.

*    *    *

"జగమే మాయా...బ్రతుకే మాయా... జగమే మాయా బ్రతుకే...." రామారావు మెట్లదగ్గిర నిలబడి స్విచ్చికోసం తడిమి అది చేతికి దొరికింతరవాత ఆన్‌చేసి మళ్ళా "జగమే మాయా.... బ్రతుకే




మాయా...." అనుకొంటూ తూలుతూ మెట్లుదిగి పులిబొమ్మ చాటున చిరుతపులిని చూసినట్టు అదిరిపడి అనుమానంతో నిలబడిపోయాడు.

సత్తిపండు భయంతో వొణికిపోతున్నాడు. "ఎవర్రా నువ్వు?" అన్న ప్రశ్న రామారావు నోట్లోంచి వీలైనంత కటువుగా వచ్చింది.

కిటికీలోంచి బైటికిచూస్తే పరిగెడుతున్న పోలీసు, కిళ్లీలాల్చీ, చేతిలో కర్రలతో నలుగురైదుగురు వ్యక్తులు కనిపించారు.

రామారావు పోలీసుని చూసినట్టు పసిగట్టిన సత్తిపండు మరింత భయంతో వణికిపోతూ చేతులెత్తి మొక్కేడు.

అంత తాగిన మత్తులోనూ రామారావుకి అంతా అర్థం అయింది.

తలుపు తీసి పోలీసుని పిలిచేడు. "వ్హాట్ హేపెన్డ్?" అని ఆంగ్లంలో అడిగేడు.

"దొంగవెధవ ఎవడో ఈ పక్కన బస్‌స్టాప్‌లో ఈ పెద్దమనిషి జేబు కట్ చేశాడు సార్? ఇలాగే పారిపోయొచ్చాడు," అంటున్నాడు పోలీసు.

సత్తిపండుకి కళ్లు తిరగడం ప్రారంభించాయి. జైల్లో కటకటాలు.... లాకప్‌లో దెబ్బలు.... భయంతో వొణికిపోతూనే రామారావుకి మరోసారి మొక్కేడు.

రామారావు పోలీసునీ, కిళ్ళీలాల్చీనీ, ఆ వెనుక మనుషుల్నీ పరికించిచూసి "పదినిమిషాలనించీ ఇక్కడే నిలబడ్డాను. ఇటెవరూ పరిగెత్తుకుంటూ రాలేదు...." అన్నాడు.

"ఐతే ఈ పక్కసందులోకి పారిపోయుంటాడెదవ!" అనుకుంటూ పోలీసు శిలుక్కలాల్చి కర్రలవాళ్లూ ఆ పక్కసందులోకి వెళ్ళిపోయారు

సత్తిపండుకి లోకంలో మంచితనం మీద ఆశ్చర్యం కలిగింది

పులిబొమ్మ చాటునుంచి ఇవతలకి వచ్చి రామారావుకి చేతులు జోడించి నిలబడిపోయాడు

రామారావు సత్తిపండు నోసారి పైనించి కిందికి పరికించిచూసి హఠాత్తుగా మీదికి లంఘించి పులిపంజా విసిరినట్టు మొహంమీద బలంగా గుద్దాడు

గెటవుట్ రాస్కెల్ అరిచావంటే పోలీసులకి అప్పగిస్తాను అని మళ్లా ఛాతిమీద గుద్ది జుట్టుపుచ్చుకుని బైట కీడ్చి మరోసారి దవడమీద కొట్టి మెట్లమీదికి తోసేసి తలుపు బిగించాడు

ఒంట్లో ఆకలికి తిన్న దెబ్బలుతోడై మెట్లమీద కూలిపోయిన సత్తిపండు జేబులు తడుముకున్నాడు కష్టార్జితం చేతకందక గాభరాపడ్డాడు

* * *

మెట్లెక్కుతూ రామారావు గుల్నార్‌లో బెంగాలీలిల్లీ బుగ్గలు ఇదిగో ఇలాగే మెత్తగా దిటంగా ఉంటాయి అనుకున్నాడు చేతిలో పర్సుని ఆప్యాయంగా నిమిరి

టూ హండ్రడ్ ఓన్లీ టూ హండ్రెడ్ ఉండకపోతాయా అని ఆత్రంగా నోట్లు లెక్కబెట్టి టూఫిఫ్టీ ఉన్నందుకు సంబరపడిపోయి మనోవేగంతో మెట్లెక్కి "చలో గుల్నార్" అన్నాడు మిత్రులముందు

* * *

మెట్లకింద చీకట్లో సత్తిపండు "దొంగ దొంగ" అని నీరసంగా గొణుగుతున్నట్టు అరుస్తున్నాడు



# అపూర్వకోరిక

కోమలాదేవి





పక్షుల కిలకిలారావాలతో ఎల్లల అరుపులతో ఆ గృహప్రాంగణం ఎంతో సందడిగా ఉంది

ఎల్లలు అల్లీ బిల్లీ తిరుగుతున్నారు అదొహ లోకం! చిన్నారిలోకం! ఆ రాజ్యంలో ప్రవేశించటానికి పెద్దలకు అర్హత లేనట్లు గేటుకు తాళం వేసుంది

వీధిలో నుంచున్న రాజు గేట్‌లోంచి చూస్తున్నాడు ఎల్లలు అతణ్ణి గమనించే స్థితిలోలేరు పరుగులు — నవ్వులు — ఆటల్లో ఎగస్వాస — దెబ్బలాటలతో సరిపోయింది అతడొక పావుగంట చూచి గేట్‌మీద చప్పుడుచేశాడు అంతా ఆరేళ్ళలోపువారే

రెండవసారి శబ్దం విని ఒక జంట గేట్‌ను సమీపించింది "పైడ్ పైపర్"లా ఆడుతోన్న ఎల్లలంతా ఆటలు ఆపుజేస ఆ జంట వెనకాతల ప్రోగయ్యారు

ఎల్లలు ఉత్సుకతతో చూస్తున్నారు ఇతడేదో క్రొత్త అంకల్లా ఉన్నాడు క్రొత్తిగా వచ్చారేమొ! ఈఁడికి తప్పకుండా ఎల్లలుంటారు చిన్నఎల్లలు పెద్దవాళ్ళవెపు చూస్తున్నారు

"ఇంట్లో వినుతగారున్నారా"

"ఓ ఉన్నారు" అన్నాడొకడు

"మా అమ్మ" అంది ఒక ఆరేళ్ళపాప

ఆ పాపని పరీక్షగా చూచి చిన్నగా నవ్వాడు ఆ ఎల్ల సిగ్గుతో వెనక్కి వెళ్ళింది

"నేను లోపలికి రావాలండ్రా" అనగానే ఒకరు పరిగెత్తుకుని వెళ్ళారు

కొంతసేపటికి వినుత తాళంచెవి

పట్టుకొచ్చింది. గేట్‌ను సమీపించగానే ఆ వ్యక్తిని చూచి నిశ్చేష్టితయైంది. కొంత సేపటికి తేరుకుని తాళంచెవి తాళంలో పెడ్తూ అంది, "మీరంతా పోయి ఆడుకోండి"- ఆమె కంఠంలోని తీక్షణతను గమనించి అందరూ పారిపోయారు.

ఆమె తాళంచెవి త్రిప్పలేదు.

"నువ్వెందు కొచ్చావ్?" అంది నిరసనతో.

"ఏంలేదు. చూచిపోదామని వచ్చాను వినుతా?" అతడి కంఠంలో ధ్వనించిన ఓ విధమైన ఓటమిని గ్రహించి చటుక్కున కళ్ళెత్తి చూచింది.

"ఒక్క క్షణం మాట్లాడి పోదామని వచ్చాను.... ప్లీజ్...." వేడికోలుగా అడగ్గానే ఆమె తాళంతీస్తూ అంది, "అంతా చిన్నపిల్లలు-పారిపోయి రోడ్ మీదికెళ్తారని తాళంవేశాను."

"ఇందులో పరాయి వాళ్ళెంతమంది?" లోపలికి వస్తూ అడిగాడు. ఆమె మళ్ళీ తాళంవేస్తూ, ఇద్దరు తప్ప అందరూ పొరుగింటిపిల్లలే."

ఇద్దరూ లోపలికెళ్తున్నారు. ఆమె ప్రక్కలో పరాయి వ్యక్తిగా నడుస్తోంటే అతనికి వింతగా ఉంది. వినుత మాట్లాడ లేదు.

ఇంట్లోకి వెళ్ళకుండానే ఆ చిన్న వరండాలోనే రెండు కుర్చీలు ఉంటే అందులో కూర్చున్నారు.

"మంచినీళ్ళిస్తావా వినుతా."

ఆమె తెచ్చి చిన్న స్టూలుమీద పెట్టి మళ్ళీ కూర్చుంది. ఆమె చూపులన్నీ పిల్లలమీద కేంద్రికమై ఉన్నాయి. ఆమెను గమనిస్తున్నాడు. ఆరోగ్యంగా ఉంది. పాలిపోయిన ముఖంతో పీలగా రోగిష్ఠిలా లేదిప్పుడు. ఆరోగ్యంగా హుందాగా అందంగా ఉంది. ఔను, తను విన్న మాట నిజమే. వినుత సంతోషంగా ఉంది. ఎక్కడో ఈర్ష్య ఇంతై అంతై అతడి హృదయాన్ని ఆవరించింది.

అదే క్షణంలో వినుత అనుకుంటుంది. "బాగా చిక్కాడు. వెంట్రుకలు బాగా నెరిసి చాలా పెద్దవాడిలా కనిపిస్తున్నాడు. ఆ కళ్ళలో కాంతిలేదు. వస్త్రధారణలో శ్రద్ధలేదు. అంటే అతడికి అంత నిర్లక్ష్యభావం ఉందన్నమాట... కానియ్. అలా జరగవలసినదే!" అనుకుంది.

అతడు మంచినీళ్ళు త్రాగి సేదతీరినట్లు "హమ్మయ్య" అన్నాడు.

"నువ్వొచ్చినపని త్వరగా చెప్పి వెళ్ళిపోతే నాకెంతో సంతోషం." అతడివైపు చూడకుండానే అంది.

"త్వరగా చెప్పి వెళ్ళటానికి అది ఒక చిన్న విషయంకాదు. నా ఈ జీవితంలో ఓడిపోయాను-"

"అది చెప్పటానికే వచ్చినట్లయితే- నేను విమర్శించను. నువ్వు గెలిచినా- ఓడినా అది కేవలం నీకు సంబంధించిన విషయం. నువ్వు గెలిస్తే నేను అసూయ

చెందను ఎందుకంటే భగవంతుడు నా జీవితంలో అమృతాన్ని చిలికించాడు నువ్వు ఓడితే ఆనందించను - దుఃఖించను ఎందుకంటే నువ్వు పరాయి మనిషివి. ఆ వీధిన పోయేవాడు నాకెంత అప్పుడో నువ్వూ అంతే." ఆమె కంఠంలో తేలికభావం వ్యక్తమైంది.

అతడు బాధపడ్డాడు. ఆమె తనను ఏనాడు 'అప్పుడు' కూడా ఏకవచనంతో సంబోధించలేదు. బొన్లే తను మాత్రం ఆమెను ఏం గౌరవించాడు కనుక — ఈనాడు ఇలా పిలవటానికి?"

ఆమె చటుక్కున లేచి నుంచుంది. "ఆ రోజుల్లో- ఎవడైనా పరాయి మగవాడు వచ్చి నాతో ఇలా మాట్లాడితే నువ్వు సహించలేకపోయేవాడివని నాకు తెలుసు. ఈ రోజు నా భర్త ఇంట్లోలేని సమయంలో నువ్వు వచ్చి కూర్చుని— మంచినీళ్ళు తాగి తేలికగా నీ గోడు వెళ్ళబుచ్చుకోవాలనుకుంటే-ఈ చర్య నాకిష్టం లేదు. వారు ఏడుగంటలకే వస్తారు. అప్పుడు వస్తే నిన్ను పరిచయంచేస్తాను. వారి సమక్షంలో మాట్లాడు. నాకేం అభ్యంతరంలేదు."

అతడు వాచీ చూసుకున్నాడు. "పావుగంట ఉంది."

"ఐతే .... అందాకా ఇక్కడే కూర్చో," అని ఆమె లోపలికి వెళ్ళిపోయింది

అతడు ఎల్లల ఆటల్ని చూస్తున్నాడు

అను ఇక్కడికి రావటం ఉచితమైన పనేనా

వినుత — అతడు తనను అమర్యాదగా చూస్తే.

"ఉష్" తను సహించాలి తన జీవితమే తెగి తెగి ముక్కలై పోయిన త్రాడులా ఉంది. ఆ తునకల్ని తీసుకుని ముడులు వేయగల్గితే.... అంతకన్నా ఏంకావాలి. తన జీవితాన్ని చక్కబరుచుకోవాలన్న ఉద్దేశం తనకున్నది నిజమే అయితే తను కొన్ని అవమానాల్ని సహించగలడు. ఫరవాలేదు అది తప్పదు.

పిల్లలు 'నాన్నా' నాన్నా" అని అరవగానే వినుత తాళంతీసింది. ఎల్లలందరికీ తెలుసు - అది ఇళ్ళకు వెళ్ళే టైం అని. ఎవరి ఆట సరంజామా వాళ్ళు చంకల్లో పెట్టుకుని పరుగులు తీశారు

ఆఖరి పాపను వెళ్ళనిచ్చి అతడు గేట్ వేశాడు.

ఇక తాళం వేయనవసరంలేదు

పిల్లలు తండ్రిచేతులను పట్టుకుని నడుస్తున్నారు. పదేళ్ళ పెద్ద కుర్రాడు బంతి కొట్టుకుంటూ వరండా ఎక్కాడు ఆ నూతన వ్యక్తిని చూపుతూ అంది వినుత, "వీరు - మా ఊరివారంట తరువాత మాట్లాడుకుందాం. మీరు లోపలికి రండి"

నమస్కారాలైన వెంటనే అందరూ లోపలికెళ్ళారు. కొంతసేపైన తరువాత వినుత ఓ మగ్‌లో కాఫీతెచ్చి స్టూలు మీద పెట్టి వెళ్ళిపోయింది. అతడు వెంటనే త్రాగి పెట్టేశాడు.

దాదాపు పావుగంటతరువాత ఇద్దరూ వచ్చి కూర్చున్నారు.

"వీరిని మీకు ఎలా పరిచయం చేయాలో నాకు తెలియటంలేదు. ఒకప్పుడు ఇతడి ఇంట్లో ఉండేదాన్ని. ఆ తరువాత తరిమివేయబడి - త్యజింపబడ్డాను. ఏదో మాట్లాడాలంటే మీరు వచ్చేదాకా ఆగమన్నాను." పొడి పొడిగా అంది.

అతడు తనను ఎలా చూస్తాడో -! అన్న భయంతో ఆ వ్యక్తి నేలచూపులు చూస్తున్నాడు.

అతడు కూర్చున్న తీరు - అతడి వస్త్రధారణ — ముఖంలోని దైన్యత చూచి వినుత భర్త కుమార్‌కు జాలి వేసింది.

'పాపం - ఇతడు చచ్చినపాములా వున్నాడు,' అనుకున్నాడు. "ఓడిపోయాడు. అమృత కలశాన్ని కోరి బ్రద్దలు చేసుకున్నాడు... మరొక 'మగ' వాడు.... ప్చ్...." అనుకున్నాడు.

"నన్ను మీరు అసహ్యించుకుంటు...."

"లేదు.... లేదు.... జాలిపడ్తున్నాను." కుమార్ చటుక్కున అన్నాడు.

"ఔను .... ఒకప్పుడు అహంకారంతో .... విచ్చలవిడిగా ప్రవర్తించాను. ప్రతి చిన్నవిషయానికి పెడర్థాలు తీసి వినుతను సాధించాను. ఆమె అప్పటి అనారోగ్యానికి కారకుడినయ్యాను. భార్యగా ఆమె చిన్న చిన్న కోరికలకు కూడ చెడు అర్థాలు తీశాను. ఒక బానిసలా చూసుకున్నాను. ఆమె చదువుకున్నది. పని చేస్తానంటే అంగీకరించలేదు నేను. పోనీ నాకొచ్చే డబ్బుతో ఆమెను సరిగా పోషించలేక పోయాను. బాబు పుట్టినతరువాత కూడ నేను మారలేదు. ఒకరోజు నేను వచ్చేసరికి ఇల్లు తాళం వేసుంది. ఎక్కడికెళ్ళావని అడిగితే డాక్టర్ దగ్గరకంది. నేను నమ్మలేదు. ఆనాటినించి ప్రతి విషయానికి ఆరా తీయటం ప్రారంభించాను. హింసించాను. హీనంగా చూసాను. చివరికి ఆమె ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్న తరువాత చిక్కిశల్యమైన వెంటనే వాళ్ళ యింటికి తరిమేశాను. ఇలాంటి సమయంలో మనకు బుద్ధి చెప్పి సన్మార్గాన్ని అవలంబింపజేయ జూచేవారికన్నా వక్రమార్గాన్ని అనుసరించమని ప్రబోధించేవారి ప్రభావానికి లొంగిపోయాను. విడాకులిచ్చాను. బాబు నా అధీనంలోకి వచ్చాడు. కాని నాకెందుకు? మళ్ళీ పెళ్లికి సిద్ధమౌతున్న నాకు నాలుగేళ్ళ పిల్లవాడెందుకు? నాలో లోపంలేదు. నేను పర్‌ఫెక్ట్ మగవాడిని. మంచివాడిని - ప్రేమ



జాలి – దయ అన్నీ నాలో ఉన్నాయి ఆమెలో అంతా చెడు ఉంది ఆమె నోటిలో విషముంది కల్మషంలో పుట్టి పెరిగింది నేనంటే ఆమెకు నిర్లక్ష్యం నన్నో భర్తగా గౌరవించని స్త్రీ బిడ్డ నాబిడ్డకాలేడు! అంసర్ది చెప్పుకుని బాబును పంపేశాను

అలా పంపుతున్నప్పుడు ఆనందించాను ఒక భారం వదిలిపోయిందని– స్వేచ్ఛగా జీవించవచ్చునని భావించాను బిడ్డను అక్కడికి పంపిన తరువాత వాడి పోష ణార్థం కొంత డబ్బు పంపమని వాళ్ళ తాతగారు రాస్తే దానికి నేనిచ్చిన జవాబు వింటే మీరు ఆశ్చర్యపోతారు – అసహ్యించుకుంటారు

"లేదు మీలాంటివారు ఎది చేసినా ఆశ్చర్యంగా ఉండదు ఆశ్చర్యం కల్గిం చిందేమిటంటే మీరిక్కడికి రావటమే" కుమార్ అన్నాడు

"చెప్తాను దీనికి ముందు కొంత పరిచయం మీ కవసరం ఇష్టముంటే ఉంచుకుని సాకండి–లేకపోతే ఏ శరణా లయంలోనో చేర్పిస్తాను – అని రాశాను ఆ తరువాత వారినించి ఉత్తరాలు లేవు మూడునెలలు గడిచిపోయాయి ఆ తరువాత వారినించి ఒక ఉత్తరం దాంతో పాటు కొన్ని పత్రాలు వచ్చాయి వాడిని ఆయన దత్తు తీసుకొంటారట సంతకాలు పెట్టి అలా ఇవ్వటం నాకు ఇష్టమేనని వ్రాత పూర్వకంగా తెలియ

జేయమన్నారు సంతకాలు పెట్టి వెంట వెంటనే ఉత్తరంరాసి పోస్ట్‌చేశాను ఆ నాడు నే ననుభవించిన ఆనందం పైశాచిక మైనదని ఆ తరువాత గ్రహించా నను కోండి ఇలా జరిగిన ఏడాదికంతా నాకు ప్రమోషన్ వచ్చింది అసిస్టెంట్ ఫోర్‌మాన్ అయ్యాను జీతం ఎక్కువైంది తల్లి సంద్రులకు వంత పంపితే మిగిలిన దంతా నాకే ఉంటుంది అప్పుడు ఒంటరి తనం అనిపించింది పునర్వివాహం చేసు కోవాలని అనుకున్నాను అఫ్‌కోర్స్ వినుతను వెళ్ళగొట్టినప్పటినుండి ఆ కోర్కె ఉందనుకోండి ఈ పూటు నేను చేసుకొనబోయే అమ్మాయి ఎక్కువగా చదివి ఉండకూడదు - పల్లెటూరి పిల్ల - ఘోషాలో ఉండే పిల్ల - నా సరదాలకు అడ్డు తగలకూడదు - నన్ను భర్తగా దైవంగా భావించి తదనుగుణంగా నన్ను మన్నించే స్త్రీని వెదికి చేసుకోవాలను కున్నాను అలాగే చేసుకున్నాను ఆమె విజయలక్ష్మి కాని నేను వేసిన అంచనా తారుమారైంది " అతడు ఆపుజేసి మగ్‌లో ఓమారు చూసి మళ్ళీ పెట్టే శాడు

"అంటే ఆమెకూడా వినుతలాటి దేనా"

రాజు అడ్డంగా తలాడించాడు "ఉహూ నేను ఏ లక్షణాలను కోరానో అవన్నీ వినుతలోనే ఉన్నా యని ఆ తరువాత తెలుసుకున్నాను. విజయ స్వేచ్ఛాజీవి చాలా అధునాతన భావాలుకలది అపారమైన తెలివితేటలు కలది నన్నూ, నాలోని బలహీనతల్నీ విశాలహృదయంతో అర్థంచేసుకోగల సంస్కారం ఆమెలో ఉంది పల్లెటూరి పిల్లలో ఈ లక్షణాలెలా వచ్చాయని ఆశ్చర్యపోయి ఓ మారు అడిగాను నా వైపు అదోలా చూసి నవ్వింది పల్లె టూళ్ళో నేను మనుషులమధ్య పెరిగాను' అంది అంతే అంటే ఏ వ్యక్తుల ప్రభావం ఆమెపై ప్రసరించిందో ఆ వ్యక్తులు ఉన్నత భావాలు కలిగినవారై ఉండాలన్న మాట ఒకసారి నేను ఇంటి కొచ్చేసరికి తలుపు తాళంవేసుంది చాలా కోపం వచ్చింది రాగానే క్రోధంతో కొట్టినంత పని చేశాను నా ఉద్రేకం కాస్త చల్ల బడిన తరువాత నిరసనతో అంది,

"ఎక్కడికి ఎందుకెళ్ళావు" అన్ని ప్రశ్నై వెయకుండానే ఇలా ప్రవర్తిస్తున్నారు స్త్రీ ఇల్లు కదిల్తే చెడ్డపని చేయటానికే వెళ్ళిందనుకునే మీ సంకుచిత మనస్త త్వాన్ని ఏమనగలను మనం మనుషుల మధ్య నివసిస్తున్నాము ఒకరి సహాయం లేకుండా రోజు గడవటం కష్టం ఆడ వాళ్ళు మగవాళ్ళు అన్న దృష్టితో చూస్తే ఈ జీవితం సాగిపోవటం కష్టం స్త్రీ చెడిపోవాలంటే ఇల్లుకదిలి ఎక్కడికో వెళ్ళనవసరంలేదు నేను అలాంటి దాన్నయితే ఇలా తాళంవేసి ఆలస్యంగా రానవసరంలేదు," అంది రాను రాను

ఆమె నన్ను మార్చాలని చూసింది. నా వ్యసనాల్ని ఖండించటం ప్రారంభించింది. ఆమె ప్రవర్తన నాకు వింతగా వుండేది. ప్రథమంలో సహించినట్లు మౌనంగా ఉండేది. ఆ తరువాత జ్యోకం కల్గించుకోవటం ప్రారంభించింది — అదీ అధికారంతో! ఒకసారి కొట్టాను..... 'శరీరానికి దెబ్బతగిల్తే— అది కొంత కాలానికి మానిపోతుంది.... ఈ హృదయానికి తగిల్తే.... అది ఇక మానదు'అంది. తరువాత ఓ విధమైన సత్యాగ్రహం ప్రారంభించింది. నాకు మాత్రం అన్నం వండి వడ్డించేది. ఇదొక నాటకం అనుకున్నాను. నన్ను పోనిచ్చి వండుకు తినవచ్చు- పాలు త్రాగవచ్చు. కాని మూడవరోజున వట్టి కాఫీతో ఉండలేకపోయింది. నీరసంతో పడిపోయింది. అప్పుడు తెలుసుకున్నాను ఆమె గర్భవతి అని. కాని నాలో కలుగవలసిన ఆనందమే కల్గలేదు! నేను ఆమె చేతిలో కీలుబొమ్మనై పోతున్నానా? నేను మారిపోతున్నానా? నా వ్యక్తిత్వానికే గొడ్డలిపెట్టు! ఓ విధమైన రాక్షసత్వం నాలో ప్రవేశించింది. హఠాత్తుగా నాలోని నిగ్రహం కట్టలు త్రెంచుకుంది. నేను ఆమెకు లొంగిపోయి నా మగతనాన్ని బలిపెడ్తున్నానా? నాలోని అహం ఉన్నత స్థాయినందుకున్నది. ఒకనాడు నెలరోజులు సెలవుపెట్టి ఒక్కడిని మా ఇంటికెళ్ళాను జయ ఒక్కత్తి ఇంట్లో ఎలా ఉందోనన్న ఆందోళన ఉన్నప్పటికి ఆమెకొక గుణపాఠం నేర్పాలన్న బలీయమైన కారణం ముందు ' అవన్నీ లెక్కలోకి రాలేదు. నెలరోజులకు నేను తిరిగి వచ్చాను. ఆమె తలుపు తీసి చిరునవ్వుతో స్వాగతంచెబుతుంటే నా హృదయంలో అగ్నిజ్వాలలు రేగినై. ఆమె మామూలుగా ఆరోగ్యంగా నిండు కుండలాఉంది. లోపల చిన్నరకం సందడి విన్పిస్తోంది. ఆమెను త్రోసుకుని లోపల కెళ్ళాను. నలుగురు అమ్మాయిలకు ట్యూషన్ చెబుతోందికాబోలు! పుస్తకం తీసి చూసాను ఎనిమిదవ తరగతి పుస్తకాలు అందునా ఇంగ్లీషు లెక్కలు....

నేను అక్కడినుండి వెళ్ళిపోయాను. పిలల్ని పంపించే కాఫీ తెచ్చింది.

"నీవు బడికి వెళ్ళలేదనుకున్నాను! నువ్వు చదివింది ఐదవక్లాసన్నావుకదూ?" తప్పుచేసిన స్కూలు పిల్లాడిని మేష్టారమ్మ చూచినట్లు చూసింది.

"నేను చదివింది ఐదవక్లాసే. కాని ఇంట్లో బాగా చదువుకున్నాను. మీరు ఒప్పుకుంటే మెట్రిక్ రాయగలను. రాయనా?"

ఆ కాఫీ విసరికొట్టి బైటికెళ్ళాను. క్రూరమైన చేష్టలకు ఆమె ఇలాంటి లొంగుతుందనుకున్నాను. విసిగిపోయి నల్లిలాఅణగి మణగి ఉంటుందనుకున్నాను.

మరుసటిరోజు నేను డ్యూటీలో జాయినవ్వాలి నాతోపాటు తనూ

ఫోంచేసింది. "ఎక్కడికి" అన్నాను. "ఆ పై వీధిలో ఒకావిడ లెక్కలు నేర్పుతుంది. మెట్రిక్‌కు కట్టాలని."

"మానెయ్—" అన్నాను. డబ్బు ముప్పై కట్టానంది. ఫరవాలేదన్నాను. నవ్వింది. నెలరోజులు నేనేమైపోయినా ఫరవాలేదన్నట్లు వెళ్ళిపోయారే! ఆ రోజుల్లో నే నేం చేసేదాన్నో ఎలా కాలం గడిపేదాన్నో - ఎలా వండుకు తినేదాన్నో అనారోగ్యంగా ఉంటే ఏంచేసే దాన్నో మీకు పట్టలేదే! ఈ రోజు ఆ నెల రోజులైనా పాట్లను నా ప్లేన్లను మార్చాలని చూస్తుంటే పిచ్చిగా నవ్వు వస్తోంది.

"పిచ్చి పట్టనీ - నవ్వుకో.... కాని నువ్వు వెళ్ళటానికి వీల్లేదు."

"మీరు నన్ను పంపకపోతే - ఆమె అనుకుంటారు.... మీరు - నన్ను ఇంట్లో బలవంతంగా ఉంచేశారని. అందునా మీ గురించి ఇక్కడ ఎవ్వరికీ సదభిప్రాయం లేదుకదా! మూడునెలలే - ఆ తరువాత ఎలాగూ వెళ్ళలేను. నమ్మకం కుదరకపోతే వచ్చిచూడండి."నేన్లేనప్పుడు ఆ నల్గురు పిల్లల్లో ఇద్దరు పిల్లలు సాయం పడుకునే వారట! నేను లేకపోయినా ఆమె జీవితం సాఫీగా నడిచింది. లోలోపల ఎక్కడో తృప్తిగా ఉంది. కాని -కాని అదే భావం- ఉద్ధృతమైంది .... ఆ సాయంత్రమే మంచి మాటలతో నచ్చజెప్ప చూసాను... "మీరనేదేమిటి? ఇంట్లో పడి ఉంటే నాకు తిండికి - బట్టకు - లోటుండదనేకదూ? నాకు కావలసింది తిండి - బట్ట - రక్షణ మాత్రమే కాదు.... నా హృదయంలోని భావాలకు రూపకల్పన ఇవ్వాలన్న కాంక్ష ఉంది. వివాహాత్పూర్వం నేనొక చిన్ని పిట్టను. నా అందమైన రెక్కల్ని విదిలించి హాయిగా స్వేచ్ఛగా గగనమార్గాన ఎగురుతూ ఆ మేఘమాలికలతో దోబూచులాడుతూ నా రెక్కల అందాన్ని చూసుకుంటూ చల్లటి స్వచ్ఛమైన గాలిని పీలుస్తూ విహరించాలన్న తీరని కోరిక ఉండేది. మీ భార్యనైన వెంటనే నాకు కొంత స్వేచ్ఛ వచ్చిందన్న ఆనందం నన్ను ఉక్కిరి బిక్కిరి చేసింది. నేను కోరేది మీ నీడలో స్వేచ్ఛ. మీ పూర్వ చరిత్ర నాకేమీ తెలియదు. నా భర్త ఉద్యోగం చేస్తున్నాడు - అతడికి దుర్వ్యసనాలేవీ ఉండకూడదు - అతడు స్త్రీని ఆటవస్తువుగా లేక బానిసగా లేక ఖైదీలో ఉంచినట్లు చూడకూడదు. ఆమె వ్యక్తిత్వానికి గౌరవం ఇచ్చి ఒక స్నేహితురాలిగా భావించాలి. అతడి సాహచర్యంలో ఆమె వ్యక్తిత్వం పరిపూర్ణత చెందాలి. ఇలాంటి భావాల పరిపూర్ణతే నా భర్త అనేవాడిలో ఉండాలనుకున్నా. కాని మీరు అందుకు భిన్నంగా ఉన్నారు. అది నా దురదృష్టం. నన్ను బంధించకండి... అది ఉరిత్రాడవుతుంది. నన్ను అదిమి పెట్టకండి.... ఆ బరువు క్రింద అణిగి నశించిపోతాను." ఆ అవిచలిత గంభీర ముఖాన్ని చూచి

ఆశ్చర్యపోయాను. ఆమె ఎటువంటి స్వేచ్ఛను గూర్చి ఇంతసేపు వ్యక్తీక రించిందో ఆ స్వేచ్ఛకు క్షుద్ర చౌకబారు అర్థాన్ని స్ఫురింపచేసేస్తూ కాఠిన్యాన్ని జతపర్చి ఆమెను అఘాతపర్చటానికి వెనుదీయలేదు. చివరికి అణ్వాస్త్ర ప్రయోగంచేశాను. 'నీ ఇష్ట ప్రకారం నువ్వు మసలుకో. నా ఇష్టానుసారం నేను మసలుకుంటాను.' బహుశః ఆమె కోరికలన్నీ - ఆ తీవ్రమైన అగ్ని జ్వాలలలో కాలి నుసైపోయి వుంటాయి. ఆమె మరి మాట్లాడలేదు. నేను విజయ గర్వంతో ఛాతీ విరుచుకుని తిరిగినంత పని చేశాను. ఆ ఛాతీ విరుపులో వ్రక్క లైన హృదయాన్ని చూడలేకపోయాను. ఆమె మారిపోయింది. నేను ఆశించి నట్లుగా మారిపోయింది. ఆ రోజు పేకా టలో కూర్చుని ఆలస్యంగా ఇల్లుజేరాను. తలుపుతీసి నన్ను లోపలికి రానిచ్చి వెంటనే తలుపుమూసి తలుపుమీద ఆను కుంది. ఆమె కళ్ళు విస్ఫులింగాలే అయినై. 'దీని అర్థం ఏమిటి నీ ఇష్టాను సారం నువ్వు - నా ఇష్టానుసారం నేను అన్నారు .... నేను గ్రహించాను కనుక మీ ఇష్టానుసారం మసలుకుంటున్న ప్పుడు - మీరు నా ఇష్టానుసారం మసలు కోవాలని ప్రత్యేకంగా చెప్పించుకోనవ సరం లేదనుకుంటాను....' నేను నిర్ల క్ష్యంగా నవ్వి వెళ్ళిపోయాను. ఆ తరు వాత మా మధ్య ఎటువంటి సంఘర్షణ లేకపోయింది.... కాని ఆమెః కాలం గడిచేకొలది మరింత మరింత తనలోకం లోకి అదృశ్యురాలవటం మొదలు పెట్టింది. నెలలు నిండుతున్నాయి. లేడీ డాక్టర్ ఆమెను పరీక్షించి అంతా బాగున్న దని చెప్పేది. కొద్ది కొద్దిగ నేనే మారాను. షాప్‌నించి తిన్నగా టైంకు ఇంటికొచ్చేవాడిని. కేరంబోర్డు తెచ్చాను. ఆడేవాళ్ళం. సరదాగానే ఉన్నట్లు కనబడేది. మా పెళ్ళయిన నాల్గు సంవత్స రాల రెండు నెలలకు విజయకు పాప పుట్టింది.... పురిటిలోనే పిచ్చిపట్టింది.... అలా ఉండి రాను రాను తగ్గిపోతుంది... కాని.... ఆ పాప...."

అతడు- ఆపుచేశాడు. కంఠంలో పెద్ద గులకరాయి ఇరుక్కుపోయినట్లు బాధ పడసాగాడు. వినుత మంచినీళ్ళు తెచ్చి స్టూలుమీద పెట్టింది. రాజు గటగట త్రాగి పెట్టేశాడు.

"ఆ పాపకేమైంది?" వినుత ఆందో ళనతో అడిగింది.

"ఆ పాప... అంతా బాగానేఉంది... ఆరోగ్యంగా చక్కగా ఉంది.... కాని.. మీరు వినిఉండరు. ఈ ఘోరం మీరు విని సహించలేరు.... చచ్చిపోయినా బావుండేది.... కాని భగవంతుడు నా పాపాలకి ఈ విధంగా శిక్షించాడు.... విజయ వారంరోజుల్లో చనిపోయింది. సాధారణంగా ఇలాంటి కేసుల్లో మరణించ రట. కొన్ని మాసాలకు మామూలుగా

అయిపోతారట. పాపసంగతి తెలియక ముందే ఆమె పోయింది .... అసలు మతి స్థిమితంలేదు.... ఇంకేం అర్థం చేసుకోగలదు! తెలిసి బ్రతికి ఉంటే ఆ పిచ్చి నిల్చిపోయేదనుకుంటాను. ఐనా ఆ పాపమీద జాలి-ప్రేమ నాకెప్పటి నించి కల్గాయి! నాకే ఆశ్చర్యంవేసింది... లాభంలేదు.... ఆ పాపని.... చంపేసుకున్నాను...."

"ఆ!" అన్నారు ఇద్దరు.... దాని అర్థం ఏమిటో!

రాజు తల రెండు చేతుల్లో పట్టుకున్నాడు.... చూపులు నేలను అనినై. వినుత, కుమార్ ముఖాలు చూసుకున్నారు.... "పాపకేమైంది.... ఎక్కడుంది?"

"పాప ఎక్కడో క్షేమంగానే ఉండి ఉంటుంది. హాస్పిటల్‌లో రెండు వారాలుంచుకుని అన్ని పరీక్షలుచేసి చివరికి నన్ను ఒప్పించి వాళ్ళకిచ్చేశారు."

"మళ్ళీ అనాధశరణాలయానికే ఇచ్చేశారా?" వినుత క్రోధంతో పెదిమలు బిగించి ఊసినట్లు అడిగింది.

తలెత్తి జాలితో ఆమెవైపు చూసాడు. అతడి కళ్ళలో కన్నీళ్ళు సుళ్ళు తిరుగుతుండగా చటుక్కున కళ్ళు దింపేశాడు... కాదన్నట్లు తలాడించాడు.

"పాపని ప్రపంచానికి చనిపోయినట్లు చూపారు. నపుంసకులు తీసుకెళ్ళిపోయారు."

"ఆ.... ఏమిటీ!" అన్నారు.. దాని అర్థం హృదయంలోకి సోకి వేయి శరాఘాతాలకు లోనైనట్లు బాధతో మూల్గారు. వినుత అక్కడినించి పారిపోయింది.

కుమార్ కాస్త దగ్గరకు జరిగి రాజు భుజంమీద చేయివేశాడు. ఆ స్పర్శకు రాజులో నిబిడీకృతమైన దుఃఖం ఒక్కసారి వెల్లువలై పారింది. రెండుసార్లు వెక్కి చటుక్కున నోట్లో రెండువ్రేళ్ళు పెట్టుకుని అణచుకున్నాడు. కొంత సేపటికి నిట్టూర్చాడు.

"ఆ ఇంట్లో తిరగలేకపోయాను. జయను పోగొట్టుకున్న తరువాత ఆమె విలువ తెలుసుకున్నాను. ఆ వెలితి నాకు సహింపరానిదైంది. ఆమె పోయింది ఒకందుకు మంచిదే - ఎందుకంటే పాప విషయం తెలిసి నార్మల్‌గా అవలేకపోయేది. అక్కడినించి బదిలీ చేయించుకుని విజయవాడ కొచ్చాను. కొన్నాళ్ళకు మా తండ్రిగారు పోయారు. అక్కడ వినుత తండ్రిని కలుసుకున్నాను. ఆయనకు నా మీద కోపంలేదు. నన్ను చాలా గౌరవంగా పలుకరించారు. తర్వాత మెల్లగా మీ గురించి చెప్పారు, మీకు మొదటి భార్యవల్ల ఒక కొడుకు ఒక కూతురు అని. ఎంతో బ్రతిమాలగా మీ అడ్రస్ ఇచ్చారు. ఇక్కడికి రావటానికి ఏడాదిపట్టింది. ధైర్యం చాలలేదు, ముఖంచెల్లక! ఎంతో ఆలోచించి ఇవ్వాళ బయలు దేరాను."




"మీరు పునర్వివాహం చేసుకున్నారా?"

"లేదు.... చేసుకోవాలని లేదు."

"అలా అనకండి. ఒంటరిగా ఉన్నారు బాధ్యతా రహితంగా ఉండటం కూడా మంచిదికాదు. చేతి నిండుగ పని ఉండాలి. చూడమంటే చూస్తాను."

"వద్దు. భార్యను ఏ విధంగా చూసుకోవాలో నాకు తెలియదు. రెండుసార్లు ఓడిపోయాను. అహం అనర్థానికే దారి తీస్తుందని తెలుసుకున్నాను."

"తెలుసుకున్నారు కనుకనే మీ అహాన్ని పారద్రోలండి. మీ భార్యగా అర్థాంగిగా గ్రహించండి. ఆప్తురాలిగా, స్నేహితురాలిగా గౌరవించండి. ప్రేయసిగా ప్రేమించండి. మిలిటరీ వాళ్ళలా క్రమశిక్షణలో ఉంచాలని ప్రయత్నించారు మీరు. మీకు కావలసింది భార్య కాని నమ్మకమైన పనిమనిషి కాదు ఆమె ఒక యంత్రంలా ఉండాలను కోకండి. ఆమె స్వతంత్ర భావాలను ఖండించకండి. ఆమె వ్యక్తిత్వాన్ని గౌరవిస్తే ఈమారు ఓడిపోరు."

"చాల థాంక్స్.... కాని నా మనసు విరిగిపోయింది. పాప ఆ విధంగా అయిపోవటంతో నాలో విప్లవం చెలరేగింది. నా హృదయం నలిగిపోయింది. అందుకే మీ దగ్గరకు వచ్చాను. ఎంతో విశాల హృదయంతో విడాకులు తీసుకున్న వినుతను - పెళ్లి చేసుకోగల్గారు. ఆమె జీవితాన్ని ఆనందమయం చేశారు. మీకు నా కృతజ్ఞతలు. మరో విషయంలోకూడా మీ విశాల హృదయంతో నాకు సహాయం చేస్తే ...." రాజు ఆపుచేశాడు.

కుమార్ ఉ - అ - అనలేదు. మౌనం దాల్చాడు. ఇతడు దేనికోసం వచ్చాడు? ఎన్నో అనుమానాలు - అతడు ఆలోచిస్తున్నాడు

వినుత వచ్చి భోజనానికి పిల్చింది

రాజు వద్దన్నాడు కాని కుమార్ ఒప్పుకోలేదు అన్నీ బల్లమీద ఉన్నాయి వినుత వడ్డించటానికి అక్కడ నుంచో లేదు

భోజనానంతరం మళ్ళీ బైటికొచ్చి కూర్చున్నారు ఈ మారు అరగంట వరకు లోకాభిరామాయణం మాట్లాడు కున్నారు

ఎనిమిదిన్నర అయింది "వినుతగా రొస్తే నా కోరిక చెబుతాను మీ ఇష్టం"

కుమార్ వినుతను పిల్చాడు ఆమె భోజనం అయింది పిల్లల్ని నిద్రపుచ్చి వచ్చి కూర్చుంది

"చెప్పండి కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి మీ కోరిక ఏదో మాకు తెలియదు ఇక్కడ మీకు సంబంధించినవి ఏమీ లేవు ఒక్కటి తప్ప అది పెద్ద బాబు చంద్రశేఖర్ గురించి అయితే మీరు అడక్కుండా ఉంటేనే మంచిది వాడికి పదోయేడు అతడు ఒక్కొక్కటి అర్థంచేసుకోగల వయసులో ఉన్నాడు మీరే చెప్పారు వ్రాతమూలకంగా సర్వ హక్కులు వదిలేసుకున్నట్లు - మామ గారికి దత్తతకు ఇచ్చినట్లు"

రాజు దీర్ఘాలోచలో మునిగిపోయాడు

మెల్లగా లేచి స్తంభానికి ఆను కున్నాడు ఆ క్రీనీడలో అతడి ముఖకవళి కలు స్పష్టం కాలేదు

"మీ ఊహ సరియైనదే కాని బాబును తిరిగి ఇమ్మని అడగటానికి రాలేదు కాని అప్పుడప్పుడు చూచి వెళ్ళటానికి అనుమతి యిస్తారా? వాడికోసం ఏదైనా ఇస్తే మీరు స్వీకరి స్తారా?"

"జీవితంలో సర్వం నాశనమైనట్లు ఎందుకు ఫీలవుతున్నారు? మీకు మంచి అమ్మాయిని తెచ్చి పెళ్లిచేసే బాధ్యత నాది" కుమార్ సీరియస్‌గా అన్నాడు.

రాజు నవ్వాడు "మీకు అర్థంకాలేదు... పాపకు అలా అయింది విజయ చనిపోయింది నాలో నేను లేను అలాం టప్పుడు వారి కోటాలో నన్ను చేర్చి ఆప రేషన్‌చేసి డబ్బు పంచుకున్నట్లున్నారు."

"మైగాడ్!" కుమార్ కంఠంలోంచి వేదనా పూర్వకంగా ఈ మాటలు వెలువడినై

కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా గడిచినై. వినుత భర్తకేసి నిశితంగా చూచింది. ఆ తరువాత కళ్ళలో నీళ్ళు తిరిగినై. మెల్లగా లేచి వెళ్ళిపోతూ మెల్లగా అంది "మీ నిర్ణయమే నా నిర్ణయం"

కుమార్ రాజును సమీపించి భుజం మీద చేయివేశాడు

"మిమ్మల్ని నా అన్నగారుగా బాబుకు పరిచయంచేస్తాను అప్పుడప్పుడు వచ్చి చూచి వెళ్ళండి మీరు ఏది ఇచ్చినా స్వీకరించటానికి అభ్యంతరంలేదు. కాని మీ గతాన్ని వాడి ముందు రహస్యంగా ఉంచుతానన్న మాట నా కివ్వాలి" కుమార్ దృఢంగా అన్నాడు.

"కుమార్ గారూ మాట కాదు నా రక్తంతో వ్రాసి ఇమ్మన్నా ఇస్తాను మరొకసారి నా హృదయపూర్వక కృతజ్ఞతలు రేపొస్తాను నమస్కారాలు "

రాజు హోటల్ కెళ్ళి స్నానంచేసి హాయిగా పడుకున్నాడు హాయిగా నిశ్చింతగా నిదురపోయాడు.

ప్రాతఃకాలమే లేచి నీటుగా తయారై పళ్లూ, మిఠాయిలు కొనుక్కొని వినుత యింటికెళ్ళాడు

కుమార్ ఎదురెళ్ళి రాజును తీసుకొచ్చాడు

ముగ్గురు పిల్లల్ని పిల్చి నామకార్థ పరిచయంచేశాడు.

"మా అన్నయ్య . దూరదేశంనించి వచ్చాడు. పెదనాన్నగారు "

రాజు దృష్టి చంద్రశేఖర్ మీద నిల్చిపోయింది

చేతులు చాపి ముగ్గుర్నీ తన హృదయంలోకి తీసుకున్నాడు ఆ పరిష్వంగ సుఖం దేనికి సాటి ! ఎడమ చేతితో బాబు వెన్నురాస్తూ కళ్ళుమూసుకుని మైమరచిపోయాడు బాబుకు సిగ్గుగా వుంది. విడిపించుకుని దూరంగా జరిగాడు

"కూర్చోండి " కుమార్ అనగానే ముగ్గురూ కూర్చున్నారు

"నిన్న చెప్పలేదేం." శేఖర్ అడిగాడు

"ఎన్నో విషయాలు మాట్లాడుకున్నాం బాబూ. ఆలస్యమైపోయింది. మళ్ళీ వస్తాగా - ఉట్టి చేతులతో పిల్లల్ని చూడకూడదని వెళ్ళిపోయాను." రాజు చెప్పాడు

"ఆంటి అదే పెద్దమ్మను తీసుకు రాలేదా ?" శేఖర్ అడిగాడు

"లేదు బాబూ దేవుడు తీసుకెళ్ళిపోయాడు నా కెవ్వరూ లేరు "

"పాపలులేరా?" చిన్నది ఆరిందాలా అడిగింది

"ఎందుకు లేరూ నువ్వున్నావుగా" అంటూ ఆప్యాయంగా దగ్గరకు తీసుకున్నాడు

అందరితోపాటు టిఫిన్ తిని అందరికీ చెప్పి వెళ్ళిపోయాడు అంతసేపు వినుత దూరంగానే ఉండిపోయింది.

తండ్రి కొడుకును దగ్గరకు తీసుకోవటం ఆమె చూడలేదు

వెళ్ళిపోతున్న రాజువంక చూస్తూ నిట్టూర్చాడు కాని అంతలోకి రాజు నడుస్తోన్న తీరులో భేదం కనిపించింది

గేట్‌ను ఆనుకుని చూస్తున్నాడు.

పితృప్రేమ అనేది అతడి శరీర మంతటిలోను - ఆంతర్యంలోను అణువణువునా నిండిపోయినట్లుంది స్థిరచిత్తుడై తలపైకెత్తి చకచక నడుస్తూ ముందుకు సాగిపోతున్నాడు

రీవిగా హుషారుగా సాగిపోతున్న రాజును చూచి అనుకున్నాడు—ఏ సాంత్వనను ఆశించి వచ్చాడో అది లభించింది.

సియస్ రావు సీరియల్

# కాంచన కుటీరం



## 10

ఆ రోజు స్వామి కళ్యాణం.

ఏటాలాగే ఎంతో వైభవంగా జరిగింది. కళ్యాణం జరిగిన రోజు రాత్రి ఆలయ ప్రాంగణంలో శాకుంతలం నాటక ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. చుట్టుపక్కల గ్రామాలనుంచి వచ్చిన తీర్థ ప్రజ ఎంతో కుతూహలంగా నాటక ప్రదర్శన ప్రారంభంకోసం ఎదురుచూస్తున్నారు. ఇసుకవేస్తే రాలనట్టుగా వేదికముందు పందిట్లో జనం క్రిక్కిరిసి కూర్చున్నారు. ఆలయ ధర్మకర్తలైన రాజశేఖరంగారి రాకకోసం నాటకప్రదర్శకులు ఎదురుచూస్తున్నారు.

వేదికకు కాస్త ఎడంగావున్న మండపంలో దివాణంవారు కూర్చునేందుకు

ఏర్పాట్లు జరిగాయి. రాఘవయ్య కంజాయింపుకింద స్వామివారి కళ్యాణం ఎంతో వైభవంగా జరిగింది. రాజశేఖరం, ఆయన వెంట శ్రావణి, తోడుగా రాజీ ఆయా వచ్చారు. వారిని తీసుకొచ్చి రాఘవయ్య మండపంలో కూర్చోబెట్టాడు. తానూ వారి పక్కనే కూర్చున్నాడు.

ప్రదర్శన ప్రారంభమైంది.

మేనకా విశ్వామిత్రుల కలయిక, శకుంతల జననం మొదటి దృశ్యం. జడధారియైన విశ్వామిత్రుని రంజింప జేసిన మేనక నటన, నృత్యం ఎంతో అద్భుతంగా వున్నాయి. స్వర్గ సుఖాల కోసం మనిషి జడధారిగా మారతాడు. ఆ స్వర్గసుఖమే దిగివస్తే జడధారి మళ్ళీ మామూలు మనిషవుతాడు. 'ఎంత చిత్రమైంది మానవ జీవితం?' అనుకున్నాడు రాజశేఖరం. నాటకం ఎంతో రసవంతంగా సాగుతూన్నా ప్రేక్షకుల్లో కొంచరు రాజశేఖరం సరసన కూర్చున్న అపరంజిబొమ్మలా మెరిసిపోతూన్న శ్రావణిని, శ్రావణి అందాన్ని ఓ కంట చూడలేకుండా వుండలేకపోతున్నారు.

శకుంతలా దుష్యంతుల ప్రణయం జనాన్ని మరీ ఆకట్టుకుంది. ఆ రెండు ప్రణయ సన్నివేశాలు రాజశేఖరం, శ్రావణుల మనస్సులమీద చిత్రమైన ముద్ర వేశాయి. నిద్రపోతున్న రాజశేఖరం మనస్సు చలించింది. ఏదో ప్రేరణను పొందింది. శ్రావణి మేనకలోనూ, శకుంతలలోనూ కూడా తనని చూసుకుంది. ఆమెలో మేనకను చూశాడు రాజశేఖరం.

ప్రదర్శన ముగిసిన తర్వాత కాంచన కుటీరానికి చేరుకున్నారు.

ఆ రాత్రి పడుకోబోయేముందు రాజశేఖరం గదిలోకి శ్రావణి పాలు తీసుకొచ్చింది. పాలు అందించి వెళ్ళబోతూన్న శ్రావణితో – "నాటకం బావుందిగదూ!" అన్నాడు రాజశేఖరం. సమాధానం చెప్పడంకోసం శ్రావణి ఆగింది.

"చాలా బావుంది," అంది శ్రావణి.

"ఏ సన్నివేశం నీకు బాగా నచ్చింది?"

"మేనక నృత్యం. శాకుంతల ప్రణయం."

"మేనకది ప్రణయం కాదా?"

"కాదు. ప్రళయంలాంటి నటన. ప్రణయాన్ని కూడా నటించొచ్చునని మేనకను చూశాకనే నాకు తెల్సింది. కాని అది అందరికీ సాధ్యపడేది కాదు."

"ఒకరకంగా నువ్వూ మేనకలాంటి దానివే."

ఆ మాటలకు శ్రావణి నొచ్చుకుంది. అతని మొహంలోకి కాస్త బాధగా చూసింది.

"మరేంలేదు రాజేశ్వరి పోయిన తర్వాత కొన్నేళ్లపాటు నేనూ ఆమె ధ్యానంలోనే మునిగిపోయా. ధ్యానం

ఒక దైవం గురించయినా, ఒక వ్యక్తి గురించయినా ధ్యానం ధ్యానమే. అలాంటి నన్ను నువ్వు మళ్లీ మామూలు మనిషిని చేశావు. రాజేశ్వరి స్నేహితు రాలివిగా యీ కాంచన కుటీరంలోకి అడుగుపెట్టి నన్ను మనిషిని చేయడానికి ఆత్మీయురాలివిగా నా జీవితంలోకి అడుగుపెట్టావు. నిన్ను మేనకతో పోల్చడంలో నా వుద్దేశం నిన్ను చులకన చేయాలని కాదు. అభినందించ డానికే అన్నాను." అంటూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొని తన పక్కనే మంచంమీద కూర్చోబెట్టుకున్నాడు. ఆమె భుజంమీద చేయివేసి దగ్గరకు తీసు కున్నాడు. ఏదో అర్థంగాని తీయని అనుభూతి, అంతులేని భయం ఆ క్షణంలో శ్రావణిని ఆవరించాయి. కాదని వారించనూ లేకపోయింది. కావల్సింది కోరనూ లేకపోయింది. నిమిత్తమాత్రంగా వుండిపోయింది. రాజశేఖరానికి తనపై అటువంటి దృష్టి వుందని తనూ ఎన్నడూ అనుకోలేదు. ఆ దృష్టితో అతనిని ఆమె ఎన్నడూ చూడనూలేదు.

తొలిసారి పొందిన పురుష స్పర్శతో భయం భయంగా, సిగ్గు సిగ్గుగా ఆ రేయిని రాజశేఖరానికి నచ్చినట్లుగా గడిపింది శ్రావణి. అలా అని బొమ్మలా వుండిపోయిందని కాదు. తప్పనిసరియై తన్ను తాను అర్పించుకుందనీ కాదు. ఇష్టాయిష్టాలు, భయమూ సిగ్గూ అన్నీ మిళితమై వున్నాయి ఆమెలో.

తెల్లవారకముందే రాజశేఖరం కౌగిలి లోంచి తప్పించుకొని ఆ గది వొదిలి బయటి కొచ్చింది. తనగదిలోకి వెళ్లింది.

అద్దంముందు నిలబడి నలిగిన బట్టల్నీ, రేగిన జుత్తునూ, సడలిన జడనూ, కరిగిన బొట్టూ, కాటుకలనూ, కన్నులలోని తృప్తినీ చూసుకొని తనలో తానే నవ్వు కుంది. ఆ పగలు దివాణంలో జనం మసులుతూవుండగా రాజశేఖరం గది లోకి వెళ్లాలనివున్నా వెళ్లలేకపోయింది. అంతక్రితం రాత్రివరకూ అతని గదిలోకి ఎంత చనువుగా వెళ్లగలిగేదో, ఇప్పుడు అతని గదిలోకి వెళ్లాలంటే అంత సిగ్గు ముంచుకొస్తోంది.

మగవాడే అయినా రాజశేఖరం కూడా రోజూలా తలెత్తుకొని గదిదాటి బయటకు రాలేకపోయాడు. గడిచిన తీయని రాత్రి, ఏదో పొరబాటు జరిగిందన్న భావనల మధ్య అతను తనలోతానే నలిగిపో సాగాడు.

భోజనాల వేళయింది.

శ్రావణి రాజీ ఆయాను పిల్చి, "వారు భోజనం చేశారా?" అంది.

"బావుందమ్మా! వారి భోజనం సంగతి చూస్తున్నది రోజూ నువ్వేగా? ఆ విషయం నీకే తెలియాలి," అని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది రాజీ ఆయా.

శ్రావణికి అప్పుడు జ్ఞాపకమొచ్చింది - ఉదయం రాజశేఖరానికి ఫలహారమూ, మధ్యాహ్నపువేళ భోజనమూ తాను తీసుకువెళ్లి పెట్టలేదని. తొందర తొందరగా భోజనం తీసుకొని అతని గదిలోకి వెళ్లింది.

భోజనం బల్లమీదుంచి, "భోజనం" అంది ముక్తసరిగా శ్రావణి.

ఎటో చూస్తున్న రాజశేఖరం ఆ మాటకు ఆమెవైపు తిరిగాడు. నవ్వుతూ - "నిన్న రాత్రి అంత చేరువై ఈ పగలు యింత దూరమైతే, పగలు గడవడం ఎంత కష్టమో ఆలోచించావా?" అన్నాడు రాజశేఖరం.

శ్రావణి బదులుపలకకుండా తల వొంచుకొని నిలబడింది.

"నేను ఏదైనా తప్పు చేశానా ?" అంటూ ఆమెకు చేరువగా వెళ్లాడు.

"నాకు తెలియదు. నేనే తప్పు చేశానేమోనని భయపడుతున్నాను."

"భయమెందుకు? మనం చేసింది తప్పుకాదు. రాజేశ్వరి నన్ను నీ చేతుల్లో పెట్టడంలోని ఆంతర్యం ఇదేనేమో అనుకుంటున్నాను."

"ఇంక అలాగే సరిపెట్టుకోవాలి. రండి. భోంచేయండి" అంటూ శ్రావణి వడ్డిస్తోంది.

బయటినుంచి, "అమ్మా! శ్రావణీ! అయ్యగారి భోజనమైందా?" అన్న రాఘవయ్య పలకరింపు వినబడింది.

శ్రావణి ఉలిక్కిపడి, చేతిలోని గరిట వొదిలేసింది.

ఆమె తత్తరపాటు చూసి రాజశేఖరం నవ్వుకున్నాడు.

రాఘవయ్య గదిలోకి రావడంతో మాస్టారును చూసి గబగబా అఆలు దిద్దుకునే పసివాడిలా తలవొంచుకొని, వేగంగా భోజనం చేయసాగాడు రాజశేఖరం. అది చూసిన రాఘవయ్య, "కానివ్వండి. తర్వాత వస్తాను" అంటూ బయటకు వెళ్ళిపోయాడు.

రాజశేఖరానికీ, శ్రావణికీ కూడా తరచూ కలిసిమెలిసే వుండాలనివున్నా తమ గురించి ఎవరేమనుకుంటున్నారో అన్న ఆందోళనతో ఇద్దరూ నలిగిపోతున్నారు. నిజానికి దివాణంలోని ఎవరికీ వాళ్ళగురించి ఏమీ తెలియకపోయినా అందరికీ తెలిసిపోయిందన్న భయం వాళ్ళిద్దరిలోనూ వుంది. రాజశేఖరం తెగించి, 'శ్రావణి నా రెండో భార్య,' అని అంటే అతని మాట కాదనగలిగే వారెవ్వరూ లేరు.

కాని ఆ వంశ సాంప్రదాయం, అంతస్థూ అతనిని అలా అననియ్యవు. అతను అనలేదు. రాఘవయ్య తన దివాన్ అయినా అతని నీతినియమాల ముందు రాజశేఖరం తలవంచక తప్పదు. ముఖ్యంగా రాజశేఖరం భయపడేది రాఘవయ్యకే. అందుకే రెండు మూడు

రోజులు గడిచిన తర్వాత రాజశేఖరం మద్రాసుకు ప్రయాణమయ్యాడు.

తనని వొదిలి ఒక్కడే వెళతాడేమో నని శ్రావణి లోలోపల విలవిల్లాడి పోయింది. ప్రయాణ సన్నాహాలు జరుగుతూవుండగా రాఘవయ్య శ్రావణి దగ్గర కొచ్చి "ఆయనవెంట నువ్వు ఎప్పుడూ వుండాలమ్మా! వొంటరిగా వొదిలితే పాతజ్ఞాపకాలు గుర్తుకువచ్చి వారి మనస్సు పాడవచ్చు. మనశ్శాంతి కోల్పోవచ్చు. అలా జరక్కుండా వుండటానికి నీ సపర్యలూ, సాహచర్యమే వారి పాలిట ఔషధం", అని ఆమెను కూడా ప్రయాణం చేశాడు.

శ్రావణి మనస్సు కాస్త కుదుట పడింది.

రాజశేఖరానికీ తృప్తిగానే వుంది.

రాఘవయ్యగారి దృష్టిలో తానొక ఔషధం.

రాజశేఖరం దృష్టిలో తానేమిటో - కాలమే నిర్ణయించాలి అనుకుంది శ్రావణి.

అలా శ్రావణీ, రాజశేఖరం మద్రాసుకు వెళ్ళి వారి గెస్ట్‌హౌస్‌లో దిగారు.

## 11

రాజశేఖరం, శ్రావణీ మద్రాసు గెస్ట్ హౌస్‌లో రెండు రాత్రుళ్లూ, రెండు పగళ్లూ గడిపారు. ఒకరికి ఒకరు మనస్సులు విప్పి చెప్పుకోకపోయినా ఇద్దరి మనసుల్లోనూ రాజేశ్వరి జ్ఞాపకాలు మెదులుతూనే వున్నాయి. పెళ్లయిన కొత్తలో రాజేశ్వరితో కలిసి అదే గెస్ట్‌హౌస్‌లో దిగి తాను గడిపిన మధుర క్షణాలు రాజశేఖరం మనస్సులో లీలగా కదులుతూనే వున్నాయి. ఆమె చావుకూడా మద్రాసులోనే జరగడంతో ఎంత మర్చిపోదామన్నా అతనికి చేత కావడంలేదు.

గతంలో జరిగిన బలమైన సంఘటనల్నీ, జీవితంలోకి చొచ్చుకు పోయిన వ్యక్తుల్నీ మర్చిపోవడం ఏ మనిషికైనా కష్టమే. కాని గతాన్ని మరిపించగలిగే వ్యక్తుల సాహచర్యం దొరికినప్పుడు వర్తమానంలో బ్రతుకుతూ గతాన్ని కలగా మర్చిపోవడమూ సహజమే. రాజేశ్వరివెంట ఉపచారాల కోసం వచ్చిన శ్రావణి, ఆమె ప్రతి రూపంగా తయారై, ఆమె కన్ను మూసింతర్వాత ఆమె స్థానాన్నే ఆక్ర మించుకోగలిగింది. స్థానాన్ని ఆక్ర మించుకోవడంతోపాటు రాజేశ్వరి ఎవరి మనస్సులో చెరగని రూపంగా నిల్చి వుండేదో, ఆ మనస్సునే తన కోవెలగా చేసుకుంది.

ప్రస్తుతం రాజశేఖరం మనస్సులో లీలగా రాజేశ్వరి రూపమూ, జ్ఞాపకాలూ వుంటే - మనిషిగా, మమతల రూపంగా శ్రావణి తన్ను తాను ప్రతిష్ఠించుకొంది.

గతిస్తూన్న కాలంతోపాటు గతం

కూడా గతిస్తోంది. కాని శ్రావణి మనస్సులో ఏ మూలో ఓ విధమైన ఆవేదన తొంగిచూస్తోనే వుంది. రాజేశ్వరిచెంత ఉపచారాలకు చేరిన తాను ఆమెకు అపచారం చేస్తున్నానేమోనన్న ఆవేదన శ్రావణి అనుభవిస్తూనే వుంది. అయినా తనకు తాను నచ్చచెప్పుకుంటోంది. తాను కావాలని రాజశేఖరానికి దగ్గర కాలేదు. భార్యా వియోగంతో కుంగిపోతున్న ఆయన్ను సముదాయించడానికీ, మరిపించడానికీ తాను చేరువైంది; చనువు తీసుకుంది. అక్కడితో ఆగకుండా ఆయన చొరవ మూలాన్నే రాజేశ్వరిలేని లోటును తీర్చగలుగుతోంది. అది తప్పో, ఒప్పో నిర్ణయించుకొనే విచక్షణ శ్రావణికి లేదు. కుమిలిపోతూన్న రాజశేఖరాన్ని తిరిగి మామూలు మనిషిని చేశానన్న తృప్తి ఒక్కటి ఆమెకు మిగిలింది. అందుకు కాంచనకుటీరంలోని అందరూ శ్రావణికి కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

రోజులు గడుస్తున్నాయి.

రాజశేఖరం, శ్రావణీ అరమరికలు మర్చిపోయి ఏ అడ్డంకులూ లేకుండా ఒకటిగా కాలం గడుపుతున్నారు.

రాజశేఖరం ఏవైనా పనులమీద బయటికి వెళ్ళినప్పుడు శ్రావణిని వెంట తీసుకువెళ్ళడంలేదు. సాయంకాలం బీచికి వెళ్ళినప్పుడూ, ఏ పనీ లేకుండా ఆటూ ఇటూ తిరిగినప్పుడు మాత్రమే ఆమెను వెంట తీసుకెళ్ళేవాడు. తనకు తెల్సినవాళ్ళెవరికీ ఆమెను పరిచయం చేయటంలేదు. కాంచనకుటీరం మర్యాదల ప్రకారం రాజశేఖరం గెస్ట్ హౌస్ హాలులో వున్నప్పుడు శ్రావణి తెరవెనుకనే ఉంటోంది.

పిల్లి కళ్లు మూసుకొని పాలు తాగుతూ తన నెవ్వరూ చూడటంలేదనుకున్నట్లే రాజశేఖరం, శ్రావణిని వెంట వేసుకొని ఏకాంతంగా తన కాంతతో తాను తిరుగుతున్నానని అనుకున్నా ఆయనకు తెల్సినవారు కొందరు వాళ్లు ఇద్దరూ అలా తిరగడం చూశారు. రాజేశ్వరితో కూడా ఆయన అలా గతంలో తిరగడం ఆ జనం చూశారు. బహుశా శ్రావణి ఆయన రెండో భార్యేమో అనుకున్నారు. అయితే ఎవ్వరూ ఆ విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. మగవాడికి, అందులోనూ ఓ జమీందారుకి భార్య పోతే మరో భార్య రావడం ఎంతసేపు? అనుకున్నారు. ఆడదాని విషయంలో భర్తపోతే మరో భర్త రావడం విడ్డూరంగానీ మగవాడి విషయంలో అది సర్వసామాన్యం!

ఓ రోజు శ్రావణీ, రాజశేఖరం ఏదో సర్కస్ చూడటానికి వెళ్లారు. అక్కడ రాజశేఖరానికి తెలిసిన స్నేహితులు కనపడ్డారు. రాజశేఖరాన్ని సగౌరవంగా పలకరించారు. ఆయన పక్కనేవున్న

శ్రావణిని చూసి— 'వీరెవరు?' అన్నట్టు చూపులతోనే అడిగారు.

ఓ క్షణంపాటు రాజశేఖరం ఇరుకున పడ్డాడు. అంతలోనే తేరుకుని - 'ఈమె శ్రావణి. నా పర్సనల్ సెక్రటరీ!' అని వాళ్ళకు శ్రావణిని పరిచయం చేశాడు.

శ్రావణి మనస్సు చివుక్కుమంది.

సర్కస్ పూర్తి అయ్యేదాకా తనలో తనే మధనపడింది.

ఇద్దరూ గెస్ట్‌హౌస్‌కు తిరిగి వచ్చారు.

రాజశేఖరం కూడా ఆమెను అలా ఎందుకు పరిచయం చెయ్యాల్సివచ్చిందో శ్రావణికి సంజాయిషీ చెప్పుకోవడానికి తహతహలాడజొచ్చాడు. కాని ఏమని చెప్పాలో తెలియటంలేదు. శ్రావణికి తాను తాళి కట్టలేదు. ఆమె ఆయన భార్య కాదు. కాని, తాళి కట్టించుకోకపోయినా భార్యలాగే బ్రతుకుతూ తనని సేవిస్తూన్న ఆడది శ్రావణి. ఆ కృతజ్ఞత ఆయనకు మనస్సునిండా వుంది.

శ్రావణీ, రాజశేఖరం గెస్ట్‌హౌస్‌కు వచ్చాక భోజనాలు చేశారు. పడకగదిలోకి వెళ్లారు. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్లుతూవుండే వారిద్దరి మధ్య నల్లరాయిలాంటి మౌనం ఆవరించింది.

శ్రావణికి ఎంత ఆపుకుందామన్నా ఏడ్పు ఆగటంలేదు. ఒకసారి కళ్ళల్లో తిరిగిన నీళ్ళను పవిట కొంగుతో వొత్తుకుంది.

అది గమనించిన రాజశేఖరం — "అదేమిటి? ఇప్పుడేమైందని నీ కంట కన్నీరు?" అన్నాడు.

"ఏమీ చేయలేనప్పుడు, ఏం చేయాలో తెలియనప్పుడు ఆడది చేయగలిగిన పని ఇదొక్కటే!" అంది శ్రావణి.

"ఛ! అదేమిటి? వాళ్ళకి నిన్ను నా పర్సనల్ సెక్రటరీ అని పరిచయం చేసినందుకేనా ఈ బాధ?"

"మరి ఇంకేమని పరిచయం చేస్తారు! నేను మీకేమవుతానో నాకే తెలియదు. మీకు మాత్రం ఎలా తెలుస్తుంది?"

"ఏదో వూహించుకొని బాధపడకు శ్రావణీ! రాజేశ్వరి వియోగంతో మోడువారిన నా జీవితానికి మళ్ళీ చిగురు తొడిగించావు. నన్ను మనిషిని చేశావు. నిజానికి ఇప్పుడు నువ్వు లేకపోతే ఎందుకు బ్రతకాలో, ఎలా బ్రతకాలో నాకే తెలియదు."

"ఇవి నాలుగుగోడల మధ్య అనే మాటలు. మీరే కాదు. ఏ మగవాడైనా అంతేనేమో!"

"అలా నన్ను అపార్థం చేసుకోకు శ్రావణీ! నా పరిస్థితి కూడా ఒకసారి ఆలోచించు! ఇక్కడ నే నెవరొన్నో అందరికీ తెలుసు. నువ్వెవరివో చాలా మందికి తెలియదు. నా పక్కన నువ్వు నిలబడితే నిన్ను గౌరవిస్తారు. ఆ గౌరవం నీకు నానుంచి వచ్చింది. కాని నాకున్న గౌరవం అంతా నాదికాదు.

తరతరాలనుంచి వారసత్వంగా సంక్రమించిన గౌరవమది. వాళ్లు నువ్వు ఎవరని అడగ్గానే 'నా భార్య' అని చెప్పేననుకో, ఆ తర్వాత నీ పుట్టు పూర్వోత్తరాలు, నీ వంశం, సాంప్రదాయం అన్నీ అడుగుతారు. ఏమని చెప్పమంటావు? జమీందారీ వంశీకులు మరో జమీందారు వంశంలోని పిల్లనే పెళ్లాడాలిగానీ ఏదో ఒక అమ్మాయిని పెళ్లాడితే చిన్నచూపు చూస్తారు. ఒక రకంగా అది వంశానికే మచ్చ. నాకు నేను మచ్చ అపాదించుకోవచ్చు. తరతరాలుగా వస్తున్న వంశ ప్రతిష్ఠకు మచ్చతెచ్చే అధికారం నాకు లేదు. అందుకని నిన్ను అలా పరిచయం చేశాను. ఇప్పటికైనా నువ్వు నన్ను అర్థంచేసుకొంటే సంతోషిస్తాను. నువ్వు అర్థంచేసుకోలేకపోతే, నీకు అర్థమయ్యేలా చెప్పలేకపోయానని బాధపడతాను," అన్నాడు రాజశేఖరం.

"మంచివారే. మిమ్మల్ని బాధపెట్టడానికా మీ జీవితంలో నేను ప్రవేశించింది? నాకు చేతనైనంతవరకూ మిమ్మల్ని సుఖపెట్టడం, నవ్వించడమే నా లక్ష్యంగానీ బాధపెట్టడం నా ఉద్దేశం కాదు! ఆలోచించుకుంటే ఇప్పుడు అర్థమవుతోంది. నేనెవరు అని వాళ్లు మిమ్మల్ని అడిగారుగానీ మీరెవరో అని నన్నే అడిగుంటే 'మీరు నా భర్త' అని నేను మాత్రం చెప్పగలనా? ఏనాడు సృష్టించబడిన పసుపుతాడో అది కట్టించుకున్న ఆడదానికి కట్టిన వ్యక్తిమీద అన్ని హక్కులూ వస్తవి. ఆ తాళి కట్టించుకోకుండా తాను మనసిచ్చిన మగవాడికి ఎన్ని సుఖాలిచ్చినా ఏ హక్కూ వుండదు. తాళికట్టించుకొని పొందే సుఖం కష్టార్జితం. తాళిలేకుండా పొందే సుఖం దొంగసొమ్ము," అంది శ్రావణి.

"నా మాట నమ్ము శ్రావణీ! నిన్ను కించపర్చాలనిగానీ మోసగించాలనిగాని నా ఉద్దేశం కాదు. నీ తృప్తికోసం యీ క్షణంలో తాళి కట్టమంటే కడతాను. కాని ఆ తర్వాత జరిగేదేమిటో తెలుసా? నాకు నువ్వూ, నీకు నేనూ మాత్రమే మిగులుతాం. కాంచనకుటీరం ఛాయలకి పోవడానికి నాకు మొహం చెల్లదు. నీతికీ, న్యాయానికీ, నిష్ఠకూ, త్యాగానికీ ప్రతీకగా నిలబడిన మా రాఘవయ్య ముందు నేను తల ఎత్తుకు నిలబడలేను. అలా వాళ్ళందరికీ దూరంగా నీతోనే నన్ను బతికమంటే రేపే మన పెళ్లి."

"ఛ! అవేం మాటలండీ! నేను అనామకురాల్ని. గాలిలో బతికేదాన్ని. ఇంత నీడనిచ్చారు. హక్కులేకపోయినా నా వాళ్ళనే వాళ్ళను నాకోసం ఆలోచించే వాళ్ళను ఇచ్చారు. అదే పదివేలు. మీ వెనక చరిత్ర వుంది. చరిత్ర నేను గాని నేను చరిత్రగలవారు మీరు. మీ పరిచయమూ, మీ నీడే నాకు కొండంత అండ. ఎక్కడో కొండలోయల్లో

పూచిన పువ్వును నేను. మీ సేవలు చేయడానికి మీ పాదాల చెంతకు చేరాను. అదే పదివేలు! పూలమొక్కకి ఎండి రాలిన పువ్వూ మట్టిపాలే అవుతుంది. స్వామి సన్నిధికిచేరిన పువ్వూ వాడేక మట్టిపాలే అవుతుంది. రెండు పువ్వుల గమ్యస్థానం ఒక్కటే! క్షణికమైన గమ్యం గురించి తగాదా ఎందుకూ, బాధ ఎందుకు?" అంటూ శ్రావణి రాజశేఖ రానికి చేరువైంది.

మబ్బులు తొలగిన తరువాత కాసే పండువెన్నెల్లా ఆ రేయి హాయిగా, తీయగా గడిచిపోయింది. ఇక వారిరువురి మధ్యా అపార్థాలు లేవు. శ్రావణి మనస్సులో హక్కుల తపన లేదు. రాజశేఖరం మనస్సులో అంతస్థుల ఆడంబరం లేదు. అతని దృష్టిలో శ్రావణి తనసొత్తు; శ్రావణి దృష్టిలో రాజశేఖరం ఆమె సర్వస్వం; ఆమె ప్రాణం.

* * *

వర్షాకాలం ప్రారంభమైంది. వేసవి ఎండలకు ఎండిన నేల తొలిజల్లుతో పులకరించింది. బీటలు తీరిన భూమి తడిసి దగ్గరపడింది. కాంచనకుటీరం భూముల్లో వ్యవసాయపు పనులు మొదలయ్యాయి. కొన్ని చేలను నాగళ్లు దున్నుతున్నాయి. కొన్ని చేలలో ఆడవాళ్లు వరినాట్లు వేస్తున్నారు.

రాఘవయ్య, గతసంవత్సరం తాలూకు ఆదాయాలనూ, ఖర్చులనూ లెక్కలు వ్రాసి, సిద్ధం చేశాడు. ఒకసారి లెక్కలు చూసుకొనేందుకు రావల్సిందని వేసవిలో వెళ్ళి మద్రాసులో వుండిపోయిన రాజశేఖరానికి జాబు వ్రాశాడు.

జాబు అందుకున్న రాజశేఖరం కాంచనకుటీరానికి ప్రయాణమయ్యాడు. అతనితోపాటు ప్రయాణమవుతూన్న శ్రావణిని తనవెంట రావద్దన్నాడు.

"ఎందుకని? ఇక్కడే వుండిపోవాలా నేను?" అని అడిగింది శ్రావణి.

"నే నెక్కడ వుంటే నువ్వూ అక్కడే వుంటావు. వెళ్ళి పని చూసుకొని రెండు రోజుల్లో తిరిగి వచ్చేస్తాను. నువ్వులేనిదే నేను మాత్రం వుండగలనా!" అన్నాడు రాజశేఖరం.

"నేనూ మీతో వస్తే రాజేష్‌నూ, చైతన్యనూ, దివాణంలోని అందర్నీ ఓసారి చూసినట్టూ వుంటుంది. మనం వచ్చి అప్పుడే రెండునెలలు కావస్తోంది. నాకూ చూడాలని వుంది," అంది శ్రావణి.

"కొన్ని సుఖాలు కావాలంటే కొన్ని కోర్కెల్ని చంపుకోవాలి శ్రావణీ! తీరా నువ్వు నాతో వచ్చావనుకో! తిరిగి నేను మద్రాసు బయలుదేరితే, నువ్వు నా వెంట వచ్చేదాకా నమ్మకం లేదు."

"అదేమిటీ! నేను మీ వెంట తప్పకుండా వస్తాను."

"నువ్వు రావని కాదు. నా వెంట

నువ్వు ప్రయాణంకాగానే రాఘవయ్యా 'మొన్ననే కదమ్మా వచ్చావు. మళ్ళీ వెళుతున్నావా?' అంటే నువ్వూ మాట్లాడ లేవు; నేనూ మాట్లాడలేను. ఇద్దరమూ కాంచనకుటీరంలోనే వుండిపోతే, ఇద్దరికీ స్వేచ్ఛ వుండదు. అంతా చాటు మాటుగానే సాగాలి. అందుకే నువ్వు ఇక్కడే వుండిపోతే, రెండు రోజుల్లో రెక్కలు కట్టుకుని ఇక్కడ వాలతాను," అన్నాడు నవ్వుతూ శ్రావణి బుగ్గమీద చిటికెవేసి రాజశేఖరం.

శ్రావణి నవ్వుతూ "రాసకేళిలో కూడా ఇంతటి రాజకీయమా?" అంది.

రాజశేఖరం నవ్వుకొని, "రాజకీయం కాదు. కాంతతో ఏకాంతం కోసం కాంతుడు పడే తాపత్రయం. వస్తాను." అని శ్రావణికి చెప్పి రాజశేఖరం కాంచనకుటీరానికి బయల్దేరాడు.

రెండునెలలపాటు ఒక్క క్షణం కూడా రాజశేఖరాన్ని వదలకుండా అతని నీడలో కాలంగడిపిన శ్రావణికి, అతనులేని రెండు రోజులూ రెండు యుగాలుగా గడిచాయి. మూడోరోజు ఉదయాన్నే శ్రావణి అలంకరించుకొని రాజశేఖరం రాకకై వేయి కళ్ళతో ఎదురుచూడసాగింది. కలువలు పగ లంతా నిద్రపోయి చంద్రునికై రాత్రంతా నిరీక్షిస్తాయి. కాని శ్రావణి పగలూ రేయీ కూడా రాజశేఖరం రాకకై నిరీక్షించింది. అతను రాగానే అతని వొడిలో వాలిపోతే అలసట మర్చి పోతుంది. అతనిఆలింగనంలో సేద తీర్చుకుంటుంది.

అనుకోకుండా వస్తానన్న రోజుకి రాజశేఖరం రాలేకపోయాడు. ఆ రోజంతా గాలికి ఆకు కదిలినా రాజశేఖరం అడుగుల సవ్వడేనని శ్రావణి వొళ్ళంతా చెవులు చేసుకొని ఎదురుతెన్నులు చూసింది.

మర్నాడు రాజశేఖరం వచ్చాడు. ఆ రేయీ పగలూ క్షణంలా గడిచి పోయాయి. అతను లేని బతుకు ఎంత దుర్భరమో అర్థంచేసుకుంది శ్రావణి.

కాలం తన దారిన పడిపోతోంది. శ్రావణీ, రాజశేఖరం కాంచన కుటీరానికి దూరంగా దేశమంతా తిరుగుతున్నారు. ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క అనుభూతి.

వర్షాకాలం గడిచింది.

వానలు వెనకట్టాయి. చిరుచలి ప్రారంభమైంది. వరిచేలు పొట్టచేశాయి. గింజలు పాలు పోసుకున్నాయి. శ్రావణి నోరు పులుపు కోరుతోంది. ఆమె కొత్త అందాలు తొడిగింది. అప్పటికి శ్రావణీ, రాజశేఖరం కలకత్తాలో ఉన్నారు.

రాజశేఖరం పక్కలో పడుకొని, అతని ముంగురులతో ఆడుకొంటూన్న శ్రావణి చెక్కిళ్లపై, అతను మృదువుగా నిమిరాడు.

"రోజు రోజుకీ నీ అందాలు మరీ పెరుగుతున్నాయి," అన్నాడు రాజశేఖరం.

"సూర్యరశ్మి తగిలితేనేగా - పచ్చని బంగారం కూడా మరింత మెరిసేది!" అంది శ్రావణి నవ్వుతూ.

"పూతకొచ్చిన మొక్కలు కూడా నీలాగే గుబురుగా వుంటాయి."

"పూతకే కాదు. నేను కాపుకే వస్తున్నాను."

రాజశేఖరం ఆశ్చర్యంగా చూశాడు ఆమె కళ్ళల్లోకి

"ఏమిటలా చూస్తున్నారు! మా అమ్మను నేను ఎరగను కానీ, నేను అమ్మనై అమ్మంటే ఏమిటో తెల్సుకో బోతున్నాను," అంది శ్రావణి.

ఆమె కళ్ళల్లో ఏదో ఆనందం మెరుస్తోంది.

రాజశేఖరం గుండెల్లో ఏదో భయం మొలకెత్తింది. శ్రావణి అమ్మ అయితే తానేం కాబోతూన్నట్టు? ఆ పుట్టబోయే బిడ్డకు తండ్రినని తనకు తెల్సినా, జనానికి ఎలా చెప్పేది? చెప్పకపోతే ఆ బిడ్డకు తండ్రెవరు? తల్లి మాత్రమే వుండి, తండ్రి ఎవరో తెలియని బిడ్డ గతేమిటి? తన రక్తాన్ని పంచుకుని పుట్టిన బిడ్డకు అటువంటి గతి పడితే తాను భరించేదెలా? తల్లినీ బిడ్డనూ కాంచనకుటీరానికి తీసుకువెళ్ళి వీళ్ళిద్దరూ ఎవరని చెప్పాలి? నాకేమవుతారని చెప్ప గలను? — అలా అతని మనస్సు ఊహల సాలెగూడులో విలవిల్లాడింది.

"ఏమిటాలోచిస్తున్నారు?" అంది శ్రావణి

మురిపించాల్సిన సమయంలో నొప్పించడం ఇష్టంలేక —

"అబ్బే! ఏంలేదు? నీకు మగపిల్ల వాడు పుడతాడా? ఆడపిల్ల పుడుతుందా! అని ఆలోచిస్తున్నాను," అని మరిపించాడు ఆమెను రాజశేఖరం.

"అది ఆలోచిస్తే తేలే విషయం కాదుగా! నాకు ఆడపిల్ల పుట్టినా ఫర్వా లేదు, మగపిల్లవాడు పుట్టినా ఫర్వాలేదు. నేను మిమ్మల్ని భర్త అని పదిమందిలో పిలవలేకపోయినా నా పుట్టబోయే బిడ్డకు మీరే తండ్రని మీ మనస్సుకు తెలుసు. మీ నీడను నా బిడ్డ హాయిగా బ్రతకొచ్చు," అంది శ్రావణి.

నెలతప్పినందుకు శ్రావణి ఆనందం గానే వున్నా అదొక సమస్యగా పరిణ మించింది రాజశేఖరానికి.

కాలం గడుస్తోంది

కాలాలు మారుతున్నాయి ప్రకృతి రకరకాల రూపురేఖల్ని కాలానుగుణంగా దిద్దుకుంటోంది

శ్రావణికి నెలలు నిండాయి.

సంక్రాంతి పండుగరోజులవి. పడిన శ్రమ పంట రూపంలో చేతికొచ్చే రోజులవి.

ఇంతవరకూ శ్రావణీ, రాజశేఖరం

కాంచన కుటీరానికి వెళ్ళకుండా దేశమంతా తిరుగుతూనే వున్నారు. మధ్య మధ్య రాజశేఖరం మాత్రం ఒకటి రెండుసార్లు కాంచన కుటీరానికి వెళ్ళివచ్చాడు. ఒక సారి వెళ్ళివచ్చినప్పుడు రాఘవయ్య రాజశేఖరంతో ఏదో మాట్లాడుతూ, "శ్రావణి కాంచనకుటీరాన్ని మర్చిపోయిందా?" అని అడిగాడు.

ఒక్క క్షణం తోచలేదు రాజశేఖరానికి ఏమని సమాధానం చెప్పాలో నని.

"అబ్బే! అదేంకాదు. ఒకసారి వాళ్ళ దేశం వెళతానంటే, వెళ్ళి రమ్మనమని పంపించాను. అన్ని ప్రాంతాలుకూడా చూసి రమ్మన్నాను." అన్నాడు రాజశేఖరం.

"ఒంటరిగానా?" అన్నాడు రాఘవయ్య.

ఆ ప్రశ్నలో శ్రావణి కాంచన కుటీరంలోని అతి ముఖ్యులలో ఒకరు అన్న ధ్వని వుంది; ఆప్యాయతా, అభిమానాలున్నాయి.

"ఒంటరిగాకాదు. కొన్ని ప్రాంతాలకు నేనే తోడు వెళ్ళాను. కాశ్మీర్ వెళ్ళిన తర్వాత పుట్టి పెరిగిన ప్రాంతమే గదా! తోడు అవసరం వుండకపోవచ్చు," అన్నాడు రాజశేఖరం.

అలా రాఘవయ్యకూ, కాంచన కుటీరంలోని జనానికి శ్రావణికీ, తనకూ మధ్యవున్న సంబంధాన్ని రహస్యంగానే వుంచాడు రాజశేఖరం. వాళ్ళిద్దరి మధ్యా వున్న సంబంధం రాఘవయ్యకు తెలిస్తే హర్షించడేమోనన్న అనుమానం రాజశేఖరానికి. కాంచనకుటీరంలోని జనానికీ పట్టణంలోని జనానికీ తన విషయం తెలిస్తే తమవంశ పరువు ప్రతిష్ఠలు తన మూలంగా దిగజారతాయేమోనని అతని ఆవేదన. అందుకే కాంచన కుటీరానికి యజమాని అయినా తన ఇంట్లో తనే దొంగగా, విషయాలను కప్పిపుచ్చి అబద్ధాలకోరుగా కాలం గడపాల్సి వస్తోంది. నిజం చెప్పడంలో ఎంత కష్ట ముందో చెప్పగలిగితే అంత సుఖముంది. అబద్ధం ఆడడం ఎంత సులభమో దాన్ని నిభాయించుకోవడం అంత కష్టం అనుకున్నాడు రాజశేఖరం.

అయినా శ్రావణి విషయంలో ధైర్యంగా నిలబడి నిజం చెప్పే ఉద్దేశం రాజశేఖరానికి లేదు. అతనొక నిర్ణయానికొచ్చాడు.

ఒకరోజు సాయంకాలం మద్రాసు గెస్టుహౌస్‌లో నెలలునిండిన శ్రావణీ, రాజశేఖరం కూర్చున్నారు. తన మనస్సులో ఏ సంఘర్షణ అనుభవిస్తూన్నా శ్రావణిని మాత్రం పువ్వులాగానే చూసుకుంటున్నాడు రాజశేఖరం. ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుని, పల్చని ఆమె అరచేతిని సున్నితంగా నిమురుతూ, "చూలింతకు ఏవేవో కోరికలుంటాయట. నువ్వు ఎప్పుడూ నోరుతెరిచి

నన్ను అడగలేదు," అన్నాడు రాజశేఖరం.

"అడగకుండానే అన్ని కోర్కెలూ మీరు తీరుస్తూన్నప్పుడు నేను అడగాల్సిన పనేముంది?" అంది శ్రావణి.

"అలాకాదు. నువ్వు ఏదో ఒకటి కోరకపోతే నీ కోర్కె తీర్చానన్న తృప్తి నాకు మాత్రం ఎలా వుంటుంది?" అన్నాడు రాజశేఖరం.

"అడిగారు కాబట్టి చెబుతున్నాను. నాకు రెండు కోర్కెలున్నాయి."

"ఏమిటవి?"

"నాకు పుట్టిన నేల వుంది కానీ, పుట్టిల్లు లేదని మీకు తెలుసు. సాధారణంగా తొలికాన్పు పుట్టింట పోసుకోవాలని వుంటుంది ఏ ఆడదానికైనా. అందుకని నాకు పుట్టిల్లు లేకపోయినా నేను పుట్టినచోటే నా బిడ్డా పుట్టాలని నా కోర్కె" అంది శ్రావణి.

"ఇది పెద్ద కోరికా శ్రావణీ! కాశ్మీర్‌కు రేపే ప్రయాణమవుదాం. మరి రెండో కోర్కె ఏమిటి?"

"నేను బిడ్డను కనగానే నాకంటె ముందు మీరే చూడాలి," అంది శ్రావణి. అట్లా అన్నప్పుడు ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

అది గమనించిన రాజశేఖరం ఆమెను పొదవి పట్టుకొని, "నువ్వు బిడ్డను కనే దాకా ఒక్క క్షణం కూడా నిన్ను వొదలను. నీడలా నీ వెంటే వుంటాను. ఇటువంటి సమయాల్లో నవ్వుతూ వుండాలి గాని కన్నీరు పెట్టకూడదు," అంటూ ఆమె కళ్ళు వొత్తాడు.

ఆ క్షణంలో శ్రావణి తల్లి ఒడిలో యిమిడిన పసిపాపలా, అతన్ని హత్తుకు పోయింది.

ఆ మరునాడే శ్రావణీ, రాజశేఖరం కాశ్మీరుకు ప్రయాణమైనారు. దాదాపు అయిదారేళ్ళ తర్వాత తిరిగి తన ప్రాంతాలకు చేరుకుంది శ్రావణి. ఎవరో ఆత్మీయులకు చేరువైనట్లు అనుభూతిని పొందగలిగింది. తాను చిన్నతనంనుంచీ స్వేచ్ఛగా తిరిగిన ఆ కొండవాలులూ, లోయలూ, ప్రకృతి అందాలూ మళ్ళీ చూస్తూ చిరకాల స్నేహితులను చాల కాలం తర్వాత కల్సిన ఆనందంతో ఆమె మనస్సు ఉప్పొంగిపోయింది. ఇప్పుడు తాను గెంతుతూ, తుళ్ళుతూ పరుగులు తీయలేదు. విరగకాసిన గున్నమావిలా ఆమె కదలికలన్నీ చాల హుందాగా వున్నాయి.

కాశ్మీర్‌కు చేరిన వారంరోజుల్లో శ్రావణికి పురుడొచ్చింది. పురిటి సమయంలో రాజశేఖరం ఎక్కువగా ఆత్రుత చెందాడు. చివరికి ఆడపిల్లను కంది.

ఆడపిల్ల పుట్టిందని వినగానే రాజశేఖరం శ్రావణి కోరిక ప్రకారం పిల్లను చూశాడు. మెరుపుతీగెలా మెరిసి




పోతూన్న పసిపాపను చూసి మురిసి పోయాడు.

శ్రావణి పురిటి స్నానంచేసి, హాస్పిటల్ నుంచి రాజశేఖరం వుంటున్న బోట్ హౌస్‌కు వచ్చింది. పసిపిల్ల సంరక్షణ కోసం ఒక నర్సునుకూడా నియమించాడు రాజశేఖరం. అట్లా ఓ నెలరోజులపాటు వారిద్దరూ బోట్ హౌస్‌లోనే వున్నారు.

తొమ్మిది నెలలపాటు తన కంటికి కనిపించకుండా తనలోనే దాగివున్న పాపను నెలరోజులు కళ్ళారా చూసి ఎంతో మమకారాన్ని పెంచుకుంది శ్రావణి. కన్నబిడ్డమీద నానాటికీ పెరుగుతూన్న వాత్సల్యం ఆమె తల్లి మనస్సును పెంచుతోంది. అణుక్షణమూ రాజశేఖరంతో కాలం గడిపే ఆమె, ఇప్పుడు తన బిడ్డతో ఎక్కువసేపు గడుపుతోంది.

తల్లీ బిడ్డల అన్యోన్యతను చూసి రాజశేఖరం ఎందుకో మానసికంగా విలవిలాడిపోతున్నాడు. కొన్ని పరిస్థితుల్లో మనిషి మనస్సు ఒప్పుకపోయినా కొన్ని పనులు చేయాల్సి వస్తుంది. రాజశేఖరం పరిస్థితికూడా అదే. అతను తన మనస్సులోనే పాపపుణ్యాలు బేరీజు వేసుకున్నాడు. పరువుకోసం చేయాల్సిన పాపం అతని దృష్టిలో తప్పనిసరైంది. ఒక నిర్ణయానికొచ్చాడు.

బోట్ హౌస్ కిటికీలోంచి లేక్‌లోని చిరు కెరటాలను చూస్తున్నాడు రాజశేఖరం. నీటినీ కెరటాలనూ వేరుచేయడం సాధ్యమా అనుకున్నాడు.

అప్పుడే శ్రావణి పసిపాపతో అతని దగ్గరకు వచ్చింది.

"చూడండి పాప ఎలా నవ్వుతోందో!"

అంది శ్రావణి పాపను రాజశేఖరానికి చూపిస్తూ.

రాజశేఖరం చిరునవ్వు నవ్వాడు.

మరుక్షణంలోనే అతని మొహం కటికశిలలా బిగుసుకుపోయింది. మనస్సు వజ్రమైంది.

"శ్రావణీ! ప్రతి ఆడదీ తల్లి కావాలని కోరుకుంటుంది. తల్లి అయిన ఆడది కోరుకానేదేమిటి?" అన్నాడు రాజశేఖరం.

శ్రావణి పొత్తిళ్ళలోని పసిపాపను ఓసారి ముద్దాడి, "బిడ్డ సుఖం" అంది.

"ఒకళ్ళు సుఖపడాలంటే మరొకళ్ళు త్యాగం చేయాలిగదూ!"

"తల్లి బిడ్డకోసం చేసింది త్యాగమెలా అవుతుంది? అది తల్లి బాధ్యత. త్యాగమని అందరూ అనుకున్నా, తల్లి తనకు తెలియకుండానే బిడ్డకోసం ఏమైనా చేస్తుంది," అంది శ్రావణి.

"ప్రాణాలనైనా యిస్తుందా?"

"బిడ్డకంటె ప్రాణమెక్కువా?"

"మరి నీ బిడ్డకోసం నువ్వు త్యాగం చేయాల్సివస్తే ఏంచేస్తావు?"

"ఏంచేస్తాను? తల్లి ఏంచేస్తుందో అదే నేనూ చేస్తాను. మా అమ్మను నే నెరగను. అమ్మని ఎరగని నన్ను, అమ్మను చేసింది నా బిడ్డ. ఇప్పుడు అమ్మ అంటే ఏమిటో తెల్సింది నాకు. అమ్మగా నా బిడ్డకోసం ఒక్కక్షణం బ్రతికినా చాలు. కాని నా బిడ్డ కలకాలం చల్లగా వుండాలి."

"చూశావా శ్రావణీ! పాప పుట్టే దాకా నీ సర్వస్వం నాదే నన్నావు. ఇప్పుడు నీ సర్వస్వం పాపకేనంటు న్నావు. నేను నీకెంత దూరమయ్యానో చూశావా?"

"అదెలా! పాపలో మిమ్మల్ని చూసు కుంటున్నాను. నేను పాపకు చేరువుగా వుంటే మీకు చేరువుగా ఉన్నట్లేగా!"

"మరి ఒకవేళ నువ్వు పాపకూ, నాకూ దూరం కావాల్సి వస్తే!"

శ్రావణి ఒక్కక్షణం ఆలోచించి, "గాలికీ నీరుకీ నోచుకోని చెట్టుకూ నాకూ తేడా వుండదు," అంది.

రాజశేఖరం మనస్సు గతుక్కుమంది. ఒక్కసారిగా మనిషిని చంపితే ఎంత పాపమో అతను ఊహించగలడు. కాని ఒక మనిషిని బతికినంత కాలం అనుక్షణం చంపుతూ వుంటే ఎంత పాపమో వూహించలేకపోయాడు. అతని వూహలకు అందలేదు.

కాంచనకుటీరం, తన వంశ ప్రతిష్ఠ, తరతరాలుగా సంక్రమించిన సాంప్రదాయం, నిప్పులాంటి రాఘవయ్య అన్నీ ఒక్కసారి గుర్తుకొచ్చాయి. క్షణం క్రితం కరిగిన మనస్సు క్షణంలోనే బండబారింది.

"శ్రావణీ! నువ్వు సుఖపడాలంటే నీ బిడ్డ అనాధగా బ్రతకాలి. నీ బిడ్డ



అల్లారుముద్దుగా పెరగాలంటే నువ్వు ఏకాకిగా బ్రతకాలి," అన్నాడు రాజశేఖరం ఒక ఋషి శాపంలా.

కాని శ్రావణి అతని మాటల్లో తన బిడ్డకు దక్కిన వరాన్నే చూసిందిగానీ, తనకు తగిలిన శాపాన్ని చూడలేదు.

"నా బిడ్డ ఎక్కడున్నా సుఖంగా ఉంటే చాలు. నేను ఏకాకినైనా బాధ లేదు. ఏ రాయినైనా బాధలేదు."

"అయితే పాపను నా వెంట తీసుకు వెళతాను. నాకు పుట్టిన ఇద్దరు మగ పిల్లలకు ముద్దుల చెల్లెలిగా అల్లారు ముద్దుగా పెరుగుతుంది కాంచన కుటీరంలో. నీ దగ్గర ఏ విషయం నేను దాచలేను. ఈ బిడ్డను నాకు పుట్టిన బిడ్డని మాత్రం కాంచన కుటీరంలో చెప్పను. నాకు దొరికిన బిడ్డని మాత్రమే చెబుతాను. అలా అని మన బిడ్డకు ఏ లోటూ రానివ్వను. నువ్వు జాగ్రత్తగా ఆలోచించుకో: పాపను ఏ అనాధశరణాలయంలోనో జేర్పించి నువ్వు నాతో వచ్చి ఎప్పటిలాగే నా పర్సనల్ సెక్రటరీగా వుంటావో, లేక పాపను నా కప్పగించి నన్ను మర్చి పోయి ఇక్కడే వుంటావో నువ్వే నిర్ణయించుకోవాలి. నిన్నూ, పాపనూ తీసుకువెళ్ళి కాంచనకుటీరంలో ఉన్న పరివారం చూపులకూ, చుట్టూ వున్న జనం గుసగుసలకూ తట్టుకొనే స్థైర్యం నాకు లేదు. ఇప్పుడు నిర్ణయం నీ చేతుల్లో వుంది. ఆలోచించుకొని రేపు చెప్పు," అన్నాడు రాజశేఖరం.

ఒక్క క్షణం శ్రావణి శిలలా వుండి పోయింది. తిరిగి చైతన్యం వచ్చాక ఏమి నిర్ణయించుకుంటుందో, ఏం జరుగు తుందో అని రాజశేఖరం ఎదురుచూస్తు న్నాడు.

———



# ఫారిన్ మొగుళ్లు

## వేములపల్లి మోహన్ రావు

దుబాయ్ కార్ల్టన్ టవర్‌లో ఆ సాయంత్రం పార్టీ మాకు. మర్నాడే జార్జ్ జెనీవా వెళ్లిపోతున్నాడు ఫ్యామిలీతో సహా. అతనికి సెండాఫ్ ఇస్తున్నాం మిత్రులమంతా. అంతా కలిసి పదిమంది కన్నా ఎక్కువ లేం. ఆ పదిమందిలో నలుగుర్ని చుట్టూ చేర్చుకుని ధారాళంగా ఉపన్యసించేస్తున్నాడు మా నానీ. వినే వాళ్ళుంటే గంటలకొద్దీ హరికథలు చెప్పడం వాడిలోని గొప్ప ఆర్టు. నాకు తెలుసు, ఆ పార్టీ అయిపోయేసరికి వాడు కనీసం రెండుమూడు ఆర్డర్లైనా పట్టేస్తాడు. నాకు ఏకాంతం ఇష్టం. దూరంగా కనబడుతున్న ఫ్లోటింగ్ హోటల్ పైన గాలికి ఉయ్యాలలూగే దీపాల తోరణాల్ని తదేకంగా చూస్తున్నాను.

'ఏమిటి ఒక్కడివే నిల్చున్నావ్. నీ గ్లాసేదీ?' అడిగింది మిసెస్ జార్జ్.

'నో. నో. నేను తాగను' అన్నాను స్థిరంగా.

'వాట్?' ఆ గొంతులో ఆశ్చర్యాని కర్థం వీడు మనిషా మృగమా అని.

'ఇంతకు ముందెప్పుడూ తాగలేదా?'

'పెళ్ళికి ముందు తాగేవాణ్ణి. తర్వాత మానేశాను.'

ఆమె కళ్ళలో ఆసక్తి తొంగి చూసింది.

'ఎందుకని? మీ ఆవిడ వద్దందా?'

అవునన్నట్టు తలూపాను.

'అయితే మీ మిసెస్ ఏం చెప్తే అది చేస్తావా?'

ఏ మొగుడూ నేను హెన్‌పెక్డ్ అని చెప్పుకోడు. కానీ సంభాషణను అంతకు మించి పొడిగించడం నాకిష్టంలేక నాకా పరిస్థితి కొంచెం ఇబ్బందిగా ఉండి, తల ఊపాను.

'హేయ్ జార్జ్ 'కమియర్' అందామె.

జార్జ్ దగ్గరగా వచ్చాడు.

'ఇతన్ని చూడు. భార్య తాగవద్దందని మానేశాడు. ఏ విషయంలోనైనా పెళ్ళాం

మాట జవదాటడు. నువ్వా ఉన్నావ్ ఎందుకూ!'

అతనామె మాటలను పట్టించుకోనట్టు నావైపు తిరిగి అన్నాడు.

'ఎప్పుడొస్తోంది మీ మిసెస్?'

'ఇప్పుడెక్కడ! రేపో ఎల్లుండో డ్యూ. డిసెంబర్‌లో వస్తుందేమో?' అన్నాను.

'వాట్?' ప్రళయం వచ్చేసి ప్రపంచం మునిగిపోతున్నంత ఆశ్చర్యపడ్డారు ఇద్దరూ.

'అయితే నువ్వింకా ఇక్కడే వున్నావే' అన్నాడు జార్జ్.

'ఎప్పుడెళ్తున్నావ్?' అడిగిందామె.

నాకర్థం కాలేదు వాళ్ళ హడావిడి. 'ఎక్కడికి వెళ్ళేది? ఊపిరి సలపనన్ని పనులున్నాయి యిక్కడ. వెళ్ళి ఏం చెయ్యను? అయినా డెలివరీ తనకి గానీ నాకా్కదుగా. చాలామంది ఉన్నారక్కడ ఆమెను జాగ్రత్తగా చూసుకోవడానికి.'

దేశద్రోహిని నియంత చూసినట్టుగా చూశాడు జార్జ్.

'రబ్బిష్. నువ్వు లేకపోతే మీ షేక్ జాయెద్ రాజ్యం అల్లకల్లోలమైపోదు. పరిపాలన సక్రమంగానే సాగుతుంది. వ్యాపారాలూ, వృత్తులూ మూలపడిపోవు. అయినా నువ్వుండి చేస్తున్న ఘనకార్యాలేమున్నాయి? ఒకవేళ ఉన్నా అవన్నీ చక్కబెట్టడానికి మీవాడున్నాడుగా.... వెళ్ళు. వెళ్ళు. అక్కడ పెళ్లాం ప్రసవానికి సిద్ధంగా ఉంటే, షికారు కొచ్చిన రాజకుమారుడిలా పార్టీ కొచ్చాడు పెద్దమనిషి.'

'నో. నో. యూ మస్ట్ గో. ఒక స్త్రీగా ఆ అనుభవం ఎలాంటిదో నాకు తెలుసు. ఎంతమంది పక్కన ఉన్నా, ఆ టైంలో భర్త ఉన్న దారి వేరు, ఆ సంతృప్తి వేరు,' అంది మిసెస్ జార్జ్.

'నేనైతే మా నికోలస్ పుట్టినప్పుడు పదిరోజులు ఈమె బెడ్ పక్కనే ఉన్నాను. కావాలంటే అడుగు,' అని ఆమెవైపు చూశాడు జార్జి.

నేనేం మాట్లాడలేదు. మళ్ళీ తనే అన్నాడు నిష్ఠూరంగా.

'మీ ఇండియన్స్ పెళ్లాల్ని పువ్వుల్లో పెట్టుకుని చూస్తారని చెబుతోందిగా మీ చరిత్ర. పెళ్లికి మీరిచ్చే ప్రాధాన్యత, భార్యలకు మీరిచ్చే గౌరవం, అనురాగం, ఆప్యాయత ఏ సంఘంలోనూ లేదని అంటారు. కేవలం ప్రచారమేనన్న మాట.'

'దానికీ దీనికీ సంబంధమేముంది జార్జ్? మేము భార్యను ప్రేమగా చూసుకునే మాట వాస్తవమే. కానీ వేలమైళ్ళ దూరం ప్రయాణంచేసి ప్రసవ సమయంలో తప్పనిసరిగా పక్కనే ఉండాలనుకోవడం ప్రాక్టికబుల్ కాదంటున్నాను నేను.'

'ఏం! ఎందుకా్కదు! నేనే నీ స్థానంలో ఉంటే నెక్స్ట పాజిబుల్

ఫ్లైట్‌లో వెళ్ళిపోయేవాణ్ణి. అది ఎయిరిండియా అయినాసరే!

'ఎయిరిండియాలో మీకేం లోటు చేస్తున్నారు ? ఎటొచ్చీ ఇండియన్స్‌నే కుక్కల్లా చూస్తారుగానీ' మాట మార్చడానికి ప్రయత్నించాను కానీ లాభం లేకపోయింది.

'ఎనీహౌ, నిన్నీ విషయంలో నేను సమర్థించలేను. యూ మస్ట్ బి దేర్. నీ భార్యతో నువ్వు అనుభవించిన ఆనందం ఫలించబోతుంటే దగ్గర ఉండి ఆ కష్టసుఖాల్లో పాలు పంచుకోని నువ్వేం మనిషివి ? ప్రాణికోటిలో ఏ జంతువునైనా తీసుకో. నీలా ఏదీ ప్రవర్తించదు, భావించదు ఈ విషయంలో.'

పెప్సీకోలా గ్లాస్‌లో పోసి నాకందిస్తూ అంది మిసెస్ జార్జి.

'వీళ్ళంతా పెద్ద హిపోక్రట్స్ జాజ్. మిగతా దేశాలకన్నా సాంస్కృతిక పరంగా, నాగరికపరంగా ఓ ఉన్నతమైన స్థానంలో వున్నామని గర్వపడతారు. మా స్త్రీకి సంఘం ఇచ్చే రక్షణ, మిగతా జాతులు ఇవ్వలేవంటారు. మా వివాహాలకున్న స్థిరత్వం, శాశ్వతత్వం లోకానికే ఆదర్శం అని చాటుకుంటారు. మా ఆడపిల్లలు రేప్ చెయ్యబడక పోవడానికీ, డ్రగ్ ఎడిక్ట్స్‌గా మారకపోవడానికీ కారణం, మా సంఘం యొక్క ఔన్నత్యమే నంటారు. కానీ నన్నడిగితే ఇవన్నీ ఆ ఆడపిల్లల బానిసత్వానికి చిహ్నాలు. నిజానికి మానసికంగా చిత్రహింస ననుభవించేది హిందూస్త్రీలే. ఆ హింసకు మూలం ఇలాంటి భర్తలే, బయట పదిమందితో భార్యంటే దేవత అని చెబుతారు. ఆ దేవత చావు బతుకుల్లో ఉన్నా చూట్టానికూడా వెళ్ళనక్కర్లేదనుకుంటారు.'

తల దిమ్మెక్కిపోయింది నాకు. స్త్రీ స్వేచ్ఛకు నిర్వచనం, గంజాయీ, మత్తు మందులూ, పదిమంది పురుషుల చేతిలో నలగడం అని ఆమె భావిస్తోంది. అలా హిందూస్త్రీ ఉండటంలేదని వాపోతోంది. అందుక్కారణం, నాలాంటి వాళ్ళేనని దుమ్మెత్తిపోస్తోంది. ఏమైనా ఈ చర్చ ఇంతటితో ఆగకపోతే నాకు పిచ్చెక్కుతుంది.

'ఓ కే బాబా ! రేపు ఈవినింగ్ ఓ ఫ్లైట్ ఉందనుకుంటాను. దాంట్లో వెళ్తాను సరేనా !'

ఇద్దరి మొహాలూ వికసించాయి. జార్జ్ అన్నాడు.

'దట్స్ గూడ్. అలా వుండాలి. విష్ యూ ఆల్ ది బెస్ట్. మీ మిసెస్‌కు మా శుభాకాంక్షలందజెయ్యి.'

కానీ వాళ్ళకు తెలియదు, ఆ మర్నాడు సాయంత్రం అసలు ఫ్లైటే లేదనీ, ఉన్నా నేను వెళ్ళననీ, ఆర్గ్యుమెంట్ నా చెయ్యిదాటి పోతున్నప్పుడు అలాంటి చిన్న చిన్న అబద్ధాలు నాకు అక్కరకొచ్చే చుట్టాలనీ.



ఇంకా గెస్ట్స్ ఎవరో వస్తుంటే వాళ్ళను రిసీవ్ చేసుకోడానికి అటు వెళ్ళారు భార్యాభర్తలు. నేను తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాను.

డిస్కోలోనుండి జలపాతంలా సంగీతం జారిపడుతోంది. బార్‌లోనుండి అప్పుడే బయటకు వస్తున్నాడు దామోదర్.

'హాయ్ యంగ్‌మాన్, ఎలా ఉన్నావ్' అంటూ ఆప్యాయంగా నా చెయ్యి అందుకున్నాడు. చాలా సామాన్యమైన వాటిని ఎంతో, ఇంటరెస్ట్ కలిగేలా చెప్పడం అతని ప్రత్యేకత. ఫ్లాట్ మార్చి విల్లా తీసుకున్నాడట. ఆ సంగతి అతని భార్యకు ఇంకా తెలియదట. ఎయిర్‌పోర్ట్‌నుంచీ తిన్నగా ఆ ఇంట్లోకి తీసుకుపోతాడుట. కొత్త ఫర్నిచర్, కొత్త కార్పెట్లు, కొత్త టీవీ, అంతా కొత్తగా ఉండటం చూసి అతని భార్య అమాంతం అతన్ని కౌగిలించుకుని మొహమంతా ముద్దుల్తో నింపేస్తుందట. ఏ విషయమైనా తనదగ్గర దాచలేదని ఆమెకెంతో గర్వమట. రెండు నెలల క్రితమే ఈ ఇంట్లోకి మారినా, తనకింతవరకూ ఈ సంగతి చెప్పలేదని పెద్ద షాక్ తింటుందట.

అప్పుడే అతనిభార్య అతన్ని

ముద్దుల్తో ముంచెత్తినట్టు మొహమంతా ఎర్రబడిపోయింది. కొంతమంది మాటల్ని, అభినయాన్ని చూడటాన్ని మించిన ఎంటర్‌టెయిన్‌మెంటు ఇంకోటి ఉండదు.

'మరి నే వెళ్ళొస్తాను' అన్నాడతను.

'అదేమిటి డిన్నర్‌కి ఉండు. గెస్ట్స్‌ని పరిచయం చేస్తాను. కమాన్' అన్నాను.

'నో. నో. చాలా ఇంపార్టెంట్ పని మీద వెళ్తున్నాను. ఇంకోసారెప్పుడైనా!'

'నా మామూలేదీ' అన్నాను నేనతని చేయి పట్టుకుని.

ఒకే ఒక్క క్షణం ఆలోచించాడతను.

'ఆ! వెనకటికో సర్దార్జీ రోడ్డుమీద వెళ్తున్న తన మిత్రుణ్ణి ఆపి, మొన్నీ మధ్య మీ ఇంట్లో ఎవరో చచ్చిపోయారని విన్నాను. నువ్వా, మీ తమ్ముడా ? అని అడిగాడట.'

నా నవ్వుకు ఆనకట్ట పడకముందే అతను వెళ్ళిపోయాడు.

డిన్నర్ పూర్తయి మేము హోటల్ బయటికి వచ్చేసరికి పన్నెండయింది.

'నేను వీళ్ళ కార్లో వస్తాను డియర్. నువ్వు పద,' అంది మిసెస్ జార్జ్.

'ఓకే' అన్నాడతను ఆమె దగ్గరగా వస్తూ. ఇద్దరూ ఆ నడిరోడ్డుమీద ముద్దు పెట్టుకున్నారు. అప్పుడామె నన్ను క్రీగంట చూడటం నేను గమనించక పోలేదు.

మా నానీ నడిగాను మెల్లగా. 'ఇదె మిత్రూ, వీళ్ళు వీధిలో శృంగారాలు. ఎలాగూ ఇంటికే వెళ్తున్నారుగా, అంత లోనే ఇంత విరహమా!'

'అదంతేలే. నీకు తెలీదు' అన్నాడు అక్కడికి వాడికేదో తెలిసి చచ్చినట్టు.

అంతే మరి. జవాబు తెలియనివాడికి అడిగినవాడు లోకువ.

వాళ్ళకు 'బాన్‌వాయేజ్' చెప్పేసి తిరిగొస్తున్నాం.

'రాత్రికి ఇక్కడ పడుకుందామా, వెళ్ళిపోదామా' అన్నాడు నానీ.

'పోదాం రా. రెండు గంటలేగా' అన్నాను.

'నేను రెండు నిముషాలు కూడా డ్రైవ్ చేయలేను. నిద్ర ముంచుకొచ్చేస్తోంది' అన్నాడు ఆవులిస్తూ.

ఇద్దరం సీట్లు మారాం.

'అవునూ, ఇందాక పార్టీలో ఆ గ్రీన్ సూటతను ఎవర్రా! అతనొచ్చినదగ్గర్నుంచీ అబ్జర్వ్ చేశాను. ప్రపంచంలో సమస్తం పోగొట్టుకున్నవాడిలా, విషాదమంతా తన మొహంలోనే నింపుకుని కూర్చున్నాడు అంతసేపూ.'

'అతనిది పాకిస్తాన్. ఇక్కడే ఒక ట్రేడింగ్ కంపెనీలో పనిచేస్తున్నాడు. పేరు సరిగా గుర్తులేదు నాకు. రేపో ఎల్లుండో అతని భార్య, పిల్లలు వస్తున్నారు కరాచీ నుంచి. బహుశా వాళ్ళు గుర్తొచ్చారామో!' అన్నాడు నానీ

వెనకసీట్లో వెల్లకిలా పడుకుని మరోసారి ఆవులిస్తూ.

'పెళ్లాం పిల్లలు వస్తుంటే ఏడుపు మొహం ఎందుకు?"

'ఒరేయ్! నీకు దొరికినట్టు అందరికీ, మా చెల్లెల్లాంటి నోరూ వాయిలేని పెళ్లాలు దొరుకుతారట్రా! వీడి పెళ్ళాం వస్తే ఇప్పటివరకూ ఉన్న స్వాతంత్ర్యం ఊడిపోయి తన ఇల్లే చిన్న పాకిస్తాన్‌లా గందరగోళమైపోతుందని భయమేమో! ఇక నోరు మూసుకుని కారు తోలు.'

!అలాగే అర్జునా! ఇక నీవు శయనింపుము,' అని నే నన్న రెండు నిమిషాలకే వాడు మొదలుపెట్టిన గుర్రు కారుని దదదడలాడించసాగింది.

బెర్నార్డ్ సన్‌లే వాళ్ళు కడుతున్న ఇంటర్నేషనల్ ట్రేడ్ బిల్డింగ్ దగ్గర కొచ్చేసరికి పోలీసులు కారు ఆపేశారు.

నా గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. నాకు లైసెన్స్‌లేదు. ఒక జీవితకాలం పోయినా ఈ ఊళ్ళలో లైసెన్స్ రాదు. జైలు కెళ్ళడానికి సిద్ధపడిపోతూ కారాపాను. కానీ దిగలేదు. పోలీసు దగ్గరగా వచ్చాడు.

'లైసెన్స్?' అన్నాడు.

ఏంచెయ్యాలి? డాష్‌బోర్డు తెరిచి వెతుకుతున్నట్టు నటించసాగాను. రిజిస్ట్రే షన్ కార్డు దొరికింది. అది తీసిచ్చాను. చూసి తిరిగిచ్చేస్తూ మళ్ళీ 'లైసెన్స్ మౌజూద్' అన్నాడు.

తప్పదు. ఛాన్స్ తీసుకోవాలి. శ్రీకృష్ణ జన్మస్థానంలోకి వెళ్లి తిరిగ్గా ఆలోచించుకునేకంటే ఇక్కడ ఛాన్స్ తీసు కోవడమే వివేకం డాష్‌బోర్డులో ఉన్న మావాడి లైసెన్స్ తీసిచ్చాను. మొహం కనబడకుండా కొంచెం చీకట్లోకి లాక్కు న్నాను లైసెన్స్ వేలిడిటీ మాత్రమే చూసినట్టున్నాడు. తిరిగి ఇచ్చేస్తూ 'అబూ ఛాబీ' అన్నాడు

అవునన్నట్టు తలూపాను.

'రో' అన్నాడు చెయ్యి ఊపుతూ.

బ్రతికిపోయిన జీవుణ్ణి అరిచేతిలో పట్టుకుని కారు స్టార్ట్ చేశాను. తప్పి పోయిన ప్రమాదంతో ఏం సంబంధం లేని మావాడు నిశ్చింతగా నిద్రపోతు న్నాడు

నూటడెబ్బై కిలోమీటర్ల ఈ ఎడారి దారి అంతులేని ఆలోచనలకు ఆస్కారమిస్తుంది అప్పుడప్పుడూ ఎదురొచ్చే ఒకటీ అరా కార్లు మినహా యించి, రోడ్డంతా నాకోసం పరిచిన మాయ జలతారులా మెరుస్తోంది, మార్జిన్ దాటి పక్కకు వెళ్తే 'దారి తప్పుతున్నావ్ సుమా' అన్నట్టు, తెల్లగా మెరుస్తూ, టైర్లకింద పలు విచిత్రమైన చప్పుడు చేసే, రోడ్డు మధ్యలో పొదగబడిన క్యాట్ ఐస్. మూసేసిన అద్దాలలోంచి లోపలికి రావాలని విఫల ప్రయత్నం చేస్తూ ఈదురుగాలి. అది రోడ్డుమీదకు లాక్కొచ్చే ఇసుక కెరటాలు. కొంచెం

తలఎత్తి చూస్తే ఎడారికూడా వెన్నెల ఎందుకో అని బద్ధకిస్తున్న మసక చంద్రుడు, సానుభూతి సమ్మెచేస్తున్నట్టు, అతని పక్కన చుక్కలు.

జరిగిపోయిన యుద్ధంలో దారుణంగా చచ్చిపోయిన సైనికుల అస్థిపంజరాల్లా, యాక్సిడెంట్లై, రోడ్డుపక్కకు, ఎడారి లోకి ఈడ్చివేయబడి శిథిలమైపోయిన కార్ల అవశేషాలు. ఇసుకలోకి ఇంకి పోతూ కొన్ని, క్షతగాత్రుల్లా కొన్ని, నిమిషాన్ని పొదుపుచేయబోయి జీవితాల్ని ఖర్చుపెట్టుకోవద్దని హెచ్చరిస్తు.

దూరంగా ఒంటె రోడ్డు దాటుతోంది. బ్రేక్ తొక్కాను. నూటనలభై కిలో మీటర్ల వేగంతో వెళ్తున్న మెర్సిడెజ్ కిక్కురుమనకుండా ఇరవై మీదికి వచ్చే సింది. మావాడు మాత్రం ఢామ్మని సీటు మీదనుంచి కిందకు పడిపోయాడు.

'ఏమైందిరా' గట్టిగా అరిచేశాడు.

'ఒంటె' అన్నాను తాపీగా.

ఎమర్జెన్సీలో ప్రతిపక్షపు ఎంపీలా కిక్కురుమనకుండా మళ్ళీ సీటెక్కి పడుకున్నాడు. వాడే అని ఏమిటి. ఈ ప్రాంతంలో ఏ కారువాడికైనా దాని పేరు చెబితే హడల్. దాన్ని గుద్దేస్తే కారు పచ్చడి, ఒళ్ళు హూనం అవడం అటుంచి జీవిత శేషాన్ని జైల్లో గడప వలసి వస్తుంది. చట్టరీత్యా పగతీర్చుకో గల జంతువు అదొక్కటేనేమో.

మళ్ళీ కారు కదిలింది, మనసులో ఆలోచనల్లాగే ప్రేమ, పెళ్లి, మూన్నాళ్ళ ముచ్చట, విరహం, పిల్లలు అన్నీ ఒక్క సంవత్సరంలోనే. ఒక్క సారి వెనక్కు తిరిగి చూసుకుంటే అమూల్యమైనవాటిని ఎన్నిటినో పోగొట్టుకుంటున్నా మనిపిస్తుంది. ఒక్క డబ్బు మినహాయించి మరేదీ లేని ఈ ఎడారిలో ఎడారిలాంటి నిస్సారమైన జీవితం. అందమైన మాతృభూమి ఒళ్ళో తలదాచుకుందామంటే, ఈ ప్రకృతిని చూసి పరవశించు, అంతేకాని నువు అడిగినా ఏడ్చినా, అన్నం పెట్టలేను అని స్వదేశం ఇచ్చిన సందేశం. ఏ దారి ఎన్నుకోవాలి నాలాంటి సామాన్యుడు?

మిసెస్ జార్జ్ మాటలు గుర్తొచ్చాయి. ఆమె చెప్పినట్టు ప్రపంచంలో అందరి. కన్నా అధమ స్థితిలో, అశాంతితో మానసిక వేదనతో క్రుగ్గిపోయేది భారతీయ వనితేనా? కాదు. కేవలం నా ఒక్కణ్ణి చూపించి వాళ్ళ దేశం మొత్తాన్నే జనరలైజ్ చేసేశారు. కానీ నిజంగానే నే నిప్పుడు ఇండియా వెళ్ళడానికి వీల్లేదు. అదివరకు బెజవాడలో కాలేజీ లెక్చరర్‌గా పనిచేస్తున్నప్పుడైతే క్లాసుకు నలభై సమస్యలే. కానీ ఇక్కడికొచ్చి వ్యాపారంలో దిగాక అవి నాలుగొంద లయ్యాయి. ఎలా వొదిలిపెట్టి వెళ్ళేది?

ఆలోచనలను సశేషించి ఫ్లాట్ ముందు కారాపి మావాణ్ణి లేపాను. అర్ధరాత్రి రెండింటికి బాత్‌రూంలోకి



టవల్ భుజాన వేసుకుని ఎందుకు వెళ్తున్నానో అర్థం కాక మావాడు విచిత్రంగా చూశాడు. పెళ్లయిన బ్రహ్మచారిచేత జీవితం చేయించే సర్కస్‌లో ఓ చిన్న ఫీట్ ఈ నడిరేయి స్నానాలు. అలా షవర్ కింద నిలబడి నప్పుడల్లా, వర్ధమాన రచయితలు గుండెలు బాదుకుని ఘోషించే విధవరాళ్ళ చరిత్రలు గుర్తొస్తాయి నాకు. మా మధ్య పెద్ద తేడా ఏం ఏడ్చి చచ్చింది!

ఎడారిలో పూలు పూయవు కవుల ఊహల్లో తప్ప పువ్వుల్ని తెచ్చి ఎడారిలో వేస్తే బ్రతకవు. మాడిపోతాయి. అందుకే వచ్చిన నెల తిరక్కుండా, బ్రతికుంటే బలుసాకు తింటాను అని మా ఆవిడ మళ్ళీ ఇండియా వెళ్ళిపోయింది, ఉత్తరాల్లో మీరొలకబోసే విరహకవిత్వం చాల్లే ఈ జన్మకి అంటూ. ఆవిడకు తోడు మా కూతురుకుంక ఒకటి. విమానం దిగడంతో మొదలెట్టిన ఏడుపు మళ్ళీ ఎయిర్‌హోస్టెస్‌ను చూసేవరకు ఆపలేదు.

ఆ తర్వాత రెండునెలల కనుకుంటాను

నేను స్విట్జర్లాండ్ వెళ్ళవలసి వచ్చింది. టెలెక్స్ పంపిస్తే, ఎయిర్ పోర్ట్‌కు వచ్చి రిసీవ్ చేసుకున్నాడు జార్జ్.

'ఎలా ఉన్నావు డియర్' అన్నాడు ఆప్యాయంగా కరచాలనం చేస్తూ.

'అయాం ఫైన్. నువ్వెలా ఉన్నావు. మీ నికోలస్. మీ మిసెస్ బాగున్నారా?' అడిగాను.

'ముందు నువ్వు కారెక్కు,' అంటూ ఏవేవో బిజినెస్ విషయాల్లోకి దింపేడు.

ఇంటికి చేరుకున్న తరువాత కూడా మా కెవరూ ఎదురురాలేదు. అంతా అస్తవ్యస్తంగా ఉంది. సోఫాల్లో చెల్లా చెదురుగా పడి ఉన్న విడిచిన బట్టల్ని పక్కకి నెడుతూ,

'కూర్చో' అన్నాడు జార్జ్.

ఎక్కడో, ఏదో పొరపాటు జరిగిందని నా మనసు చెబుతోంది. ఉండబట్ట లేక అడిగేశాను.

అ 'అర్ యూ ల్‌రైట్?'

'అఫ్‌కోర్స్. అయామ్ హండ్రెడ్ పర్సెంట్ అల్‌రైట్.'

డింపుల్ విస్కీని గ్లాసులోకి వంచుతూ అన్నాడతను. ఒకే బ్రాండ్ విస్కీ తాగేవాళ్ళను నే నెక్కడా చూడ లేదు. కానీ జార్జి డింపుల్ తప్ప ఇంకోటి ముట్టుకోడు.

'కొంచెం తీసుకుంటావా' అన్నాడు రెండో గ్లాస్ తీస్తూ

'నో నో అప్పటికీ ఇప్పటికీ నే నేం మారలేదు' అన్నాను.

నా కెందుకో ఆ సమావేశం వెలితిగా, అసంతృప్తిగా ఉంది.

'మీ ఆవిడ ఎక్కడ? నికోలస్ ఏదీ' మళ్ళీ అడిగాను.

'లేరు. ఇక్కడ ఉండటంలేదు. డైవర్స్ తీసుకున్నాం.'

ఐదునెలల క్రితం వాళ్ళిద్దరూ రోడ్డు మీద ముద్దుపెట్టుకుంటున్న సన్నివేశం నా కళ్ళముందు మెదిలింది.

'ఎందుకని?'

'జస్ట్ లైక్ దట్,'

'నో. నో. ఊరికే ఎవరూ వివాహాన్ని విచ్ఛిన్నం చేసుకోరు. సరదాకోసం జీవిత భాగస్వాముల్ని దూరంచేసుకోరు. బలీయమైన కారణాలు లేకుండా ఎవరూ మమతల్ని, అనుబంధాన్ని తెంచుకోరు,' కొంచెం ఉద్రేకంగా అన్నాను.

'కూల్ డౌన్ మై బాయ్. నువ్వు చెప్పేది ఇండియాలో. ఇక్కడ కాదు. ఈ సోషల్ ఎన్విరాన్‌మెంట్ వేరు మీ సాంఘిక జీవితానికి పూర్తిగా విభిన్న మైనది ఇది.'

'సామాజిక జీవనాల్లో వ్యత్యాసం ఉంటే ఉండవచ్చు. కానీ ప్రేమ, అనురాగం, ఆప్యాయత విశ్వజనీన మైనవి ఎంతో అన్యోన్యంగా ఉండే

మీరు కారణం. లేకుండా విడిపోవడమేమిటి!'

'కారణమంటూ ప్రత్యేకంగా ఏమీ లేదు. ఛేంజ్ కావాలనిపించింది మా ఇద్దరికీ. ఎల్లకాలం ఒకే పార్ట్‌నర్‌తో ఎలా కలిసివుండగలం చెప్పు.'

'ఎల్లకాలం ఒకే బ్రాండ్ విస్కీ, ఒకే బ్రాండ్ సిగరెట్లు మాత్రం కాల్చగలవేం.'

'నేను నీతో వాదించలేను. ఆమెనే పిలుస్తాను. మీ రిద్దరూ తేల్చుకోండి. గొప్ప ఫ్రెండ్స్ గదా.'

ఫోన్‌చేసి నే నొచ్చాననీ, తనను చూడాలంటున్నాననీ చెప్పాడు. సాయంత్రం అయిదింటికి వస్తానందామె. అన్న టైంకి సరిగ్గా వచ్చింది. సోఫాలో నా పక్కనే కూర్చుంటూ అంది.

'కొంచెం లావెక్కావ్ మాన్. మీ ఆవిడెలా వుంది. ఇంతకీ మగపిల్లవాడా, ఆడపిల్లా.'

చెప్పాను.

నా కాశ్చర్యం వేస్తోంది వాళ్ళిద్దర్నీ చూస్తుంటే. అసలేమీ జరగనట్టే ఉన్నారు. ఆమె ఎవరో ఆర్కిటెక్ట్‌ను పెళ్లిచేసుకుందట. జార్జికి వచ్చే నెలలో ఎవరో స్టెనోతో పెళ్లట.

'మనం ఎందుకు విడిపోయామో కారణం తెలియాలట తనకి. నేను చెబితే నమ్మడంలేదు,' అన్నాడు జార్జి.

'ఏముంది! రొటీన్‌గా, ఏమాత్రం మార్పులేకుండా సాగిపోయే జీవితంలో థ్రిల్ ఏముంది! అందుకే కొంత వైవిధ్యం కావాలనుకున్నాం ఇద్దరం. దట్సాల్. యూ సీ. మీ దేశంలోలాగా నచ్చినా నచ్చకపోయినా, చచ్చేవరకు ఒకర్నొ అంటిపెట్టుకుని ఉండాలని శాసించదు మా సంఘం. జీవితమనేది కేవలం అనుభవించడానికే. దానికి బలవంతాన పెళ్లిపేరిట ఉరి బిగించి నరకం చేసుకోలేము. అందుకే మేం చాలా లక్కీ ఈ విషయంలో.

'ఏమో తల్లీ. ఎంతో వెనకబడిన వాళ్ళగా మేం భావించే మా కొండ జాతుల్లోనూ ఇంతే. ఎంతో ప్రగతిని సాధిస్తున్నారనుకున్న మీలోనూ అంతే. అయితే మనలో ఎవరదృష్టవంతులనేది భగవంతుడికే తెలియాలి. కానీ ఒకటి. ప్రతి రాత్రీ భర్త పక్కన పడుకోబోయే ముందు 'ఈ మొగుడొదిలేస్తే రేపెలా' అని ఆలోచించవలసిన అవసరం మా స్త్రీకి లేదు. ఆ రకంగా ఆమె చాలా అదృష్టవంతురాలు. వస్తాను. ఏడింటికి ఎపాయింట్‌మెంట్ ఉంది.' బయటపడి ఊపిరి పీల్చుకున్నాను.



# శరన్మేఘం

— నందుల సుశీలాదేవి

ఆ రోజు ఇల్లంతా సందడిగానూ వుంది.

– అందరి మనస్సుల్లోనూ మబ్బులూ కమ్ముకుని వున్నాయి.

రెండేళ్ళ తర్వాత యింటికి తిరిగి వస్తున్న ప్రసాద్‌కి యిష్టమయిన వంట కాలన్నీ గుర్తుకు తెచ్చుకుంటోంది కమల .

– విదేశాలలో సౌకర్యాలకు అలవాటు పడిన అల్లుడికి ఏ లోపం వుండకుండా యింటిని ముందుగానే మార్పులు చేయించాడు రాఘవరావు.

– మద్రాసు చేరిన రాఘవరావుని చూసి ప్రసాద్ ఆదుర్దాగా అడిగాడు.

"భాను రాలేదేం? అసలు తిన్నగా వుత్తరాలుకూడా వ్రాయటంలేదు. ఆ మధ్య స్టవ్ అంటుకుని చీర కాలించనీ ఏవేవో వ్రాసారు. బాగా కోలుకుంది కదా."

ప్రసాద్ ప్రశ్నల పరంపరకి నెమ్మదిగా సమాధానాలు యిస్తూనే వున్నాడు రాఘవరావు.

– తమ వూరు చేరేవరకూ అల్లుడికి సమయోచితంగా ప్రత్యుత్తరాలు యిచ్చేడు.

– అత్తగారికి నమస్కరించి ప్రసాద్ ఆతృతగా నలువైపులా దృష్టి సారించేడు.

భానుమతి జాడలేదు.

"కాళ్ళు కడుక్కో నాయనా!"

ప్రసాద్ ఒక్కసారి విసురుగా అన్నాడు.

"భాను కనపడదేమండీ. నన్నెందుకిట్లా చిత్రవధచేస్తారు. అసలు భాను వుందా...."

అతని కంఠం వొణికింది.

"నాయనా! అంతమాట అనకు బాబూ! ఏమని చెప్పను తండ్రీ. నా కడుపుపంట నాకు దక్కింది నాయనా – అదే పదివేలు...."

ప్రసాద్ అసహనంగా అన్నాడు.

"భాను యింట్లో వుందా?"

వనజ నెమ్మదిగా అంది.

---

**1978 చక్రపాణి ఐదవ అవార్డు పొందిన కథ**

"అక్కయ్య గదిలో తలుపు వేసుకుని కూర్చునివుంది."

రాఘవరావు నెమ్మదిగా లోపలకు వెళ్ళేడు.

"అమ్మా భానూ! వచ్చి ప్రసాద్‌ని పలకరించు తల్లీ."

—భానుమతి వెను దిరగ లేదు. రాఘవరావు కూతుర్ని సమీపించేడు.

"అమ్మా"

భానుమతి నిలువునా వణికింది. మంచంమీద కూలబడిపోయి దిండులో మొహం దాచుకుంది.

కూతురి తలను తన ఒడిలోకి తీసుకున్నాడు ఆ తండ్రి.

ఆనకట్టలు వేస్తున్న శోకవాహిని కట్టలు తెంచుకుని వురకలు వేసింది.

— ఆ తండ్రి ఒడిలో నయాగరా ప్రవాహం పరవళ్ళు తొక్కింది.

—చాలాసేపటి తర్వాత తనను తాను సంభాళించుకుంది భానుమతి.

"లేదు నాన్నా! నేను ఆయనను చూడలేను. మీరే చెప్పండి." రాఘవరావు నెమ్మదిగా లేచి వెళ్ళేడు.

—గది కిటికీలో గుండా దూరంగా సావిట్లో కూర్చున్న ప్రసాద్ మొహం ఒక ప్రక్కగా కనిపిస్తోంది.

—తండ్రి నెమ్మదిగా ఏదో చెప్తున్నాడు.

ప్రసాద్ మొదట ఆసక్తిగా ముందుకు వంగేడు. వాళ్ళ మాటలు భానుమతికి అస్పష్టంగా వినిపిస్తున్నాయి.

ప్రసాద్ పెదవులు బిగునుకోవటం ట్యూబ్‌లైట్ కాంతిలో స్పష్టంగా కనుపించింది.

—నిశ్శబ్దంగా వున్నాడు చాలాసేపు.

—తర్వాత ఏదో మాట్లాడేడు.

—చాలాసేపు క్రింది పెదవి కొరుక్కుంటూ వుండిపోయేడు.

—హఠాత్తుగా లేచి పచార్లు చేయ సాగేడు. తండ్రిమొహం అతి దయనీయంగావుంది.

—అనునయంగా ప్రసాద్‌తో ఏదో అన్నాడు.

ప్రసాద్ వేగంగా రాఘవరావు రెండు చేతులూ అందుకున్నాడు.

— తర్వాత రాఘవరావు కళ్ళు తుడుచుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు.

ప్రసాద్ అశాంతిగా వెనుకకు వాలి కన్నులు మూసుకున్నాడు.

తండ్రి లేచి తనగదివైపు రావటం చూసి వేగంగా కిటికీ తలుపులు మూసి వేసింది భానుమతి.

"అమ్మా! భానూ! అల్లుడు నిన్ను పిలుస్తున్నాడు. తలుపు తెరమ్మా."

—దిండుతో మరింతగా తలను దాచివేసుకుంది భానుమతి.

నోటిలో కొంగు కుక్కుకొని వచ్చే ఏడ్పుని ఆపుకొంటూ జవాబివ్వలేదు భానుమతి.

పావుగంట వరకూ కూతురిని పిలిచి



పిలిచి నిరాశతో వెనుదిరిగాడు రాఘవ రావు

భానుమతి అట్లాగే పరుండిపోయింది – మరుక్షణంలో ఆమెకు అత్యంత ప్రియమైన కంఠస్వరం వినిపించింది – వేళ్ళతో తలుపుమీద మృదువుగా తట్టేడు ప్రసాద్

“భానూ! తలుపుతెరు ప్లీజ్! భానూ! ఏమిటిది పసిపిల్లలా నా దగ్గిర బెరుకు



దేనికి? నేనూ నీ ప్రసాద్‌ని భానూ భానూ !”

మంద్రంగా వున్న ఆ కంఠస్వరం వినగానే ఆమె శరీరం అణువణువునా పులకరించిపోయింది

-నాగస్వరం విన్న నాగినిలా లేచి నిలబడింది సుందరస్వప్నంలో నుండి లేచినట్లుగా నడుస్తూ తలుపుమీద చేతిని వుంచింది

-అంతలో ప్రయత్నం విరమించుకొని తలుపుదగ్గరగా కూలబడి వెక్కి వెక్కి ఏడ్చింది

-ప్రసాద్ నిలువునా చలించి పోయేడు

“భానూ! నా భానూ! నిన్నొకసారి చూడనీ!”

అనునయంగా ప్రార్థిస్తున్న అతని పలుకులు ఆమె అంతరంగాన్ని సూటిగా తాకేయి.

—తనని తాను సంబాళించుకొని తలుపును ఆనుకొని నుంచుంది.

"భానూ...."

ప్రసాద్ ఆవేదనగా పిలిచాడు.

భానుమతి కోమలంగా అంది.

"నన్ను చూసి మీరు భరించలేరు."

"లేదు భానూ! దైవికంగా జరిగిన యీ సంఘటనకు మనం బాధ్యులం కాము. నువ్వు బ్రతికి బాగున్నావు అదే చాలు."

"లేదు.... మీరు నన్ను చూడలేరు. అతి రూపలావణ్య మీ భాను చచ్చిపోయింది. నన్ను నేనే అద్దంలో చూసుకోలేక పోతున్నాను. సౌందర్యారాధకులైన మీరు నన్ను భరించలేరండీ...."

"భానూ!" తీవ్రంగా ధ్వనించింది అతని కంఠం.

"నువ్వు నా భార్యవు. నిన్నేవిధంగానైనా పరిగ్రహించాల్సిన బాధ్యత నాది. నన్ను అనురాగంతో ఆరాధించిన ప్రేమపు రాశివి. నిన్ను నేను భరించలేనా? ఏదో ప్రమాదవశాత్తూ మొహం కాలినందుకునా దానివి కాకుండా పోతావా? వెర్రి భానూ! తలుపుతెరు...."

భానుమతి వేళ్ళకు ఎంతో శక్తి కావలసి వచ్చింది. తలుపు తెరిచింది.

—గది మధ్యగా భానుమతి నుంచొని వుంది.

ప్రసాద్ గుమ్మంలో స్థాణువయ్యేడు. లోపలి గడపలో ఒకకాలు—బయట మరొకకాలు వేసి శిలా ప్రతిమ అయ్యేడు.

అతని కళ్ళల్లో ఆశ్చర్యం—ఆవేదన—జుగుప్స.... నిరాశ—శోకం—అన్నీ సుడులు తిరుగుతున్నాయి.

అతని మస్తిష్కం అల్లకల్లోలమయిపోయింది.

—ఏదీ తన భాను?

రెండేళ్ళన్నా కాలేదు—తను భానుని విడిచివెళ్ళి—

తను వలచి వలపించుకొన్న భాను ఎక్కడ? ప్రమాదవశాత్తూ స్టవ్‌మీద పడి శరీరం కాలిపోయిందని మామగారు చెప్పిన భాను యింత వికృతంగా తయారయిందని తను వూహించలేదు. ఇందుకేనా తనకు యీ విషయాన్ని తెలుపకుండా యిన్నాళ్ళూ మభ్యపెట్టింది?

—మొహం అంతా కాలి తెల్లని మచ్చలు.

—ముందు జుట్టు అంతా ఊడిపోయింది.

—భగవాన్!

తలుపును ఆనుకొని కళ్ళు మూసుకొన్నాడు. ఎదుటిగదిలో నిలువుటద్దంలో అతని ప్రతిబింబం ప్రతిఫలించింది.

తెల్లటి బలిష్ఠమైన శరీరం అతనిది. భానువైపు చూసేడు

అధోవదన అయి అట్లాగే నుంచొని వుంది

ప్రసాద్‌కి భానుని ఒక్కసారి చేతుల్లోకి తీసుకొని వోదార్చాలనిపించింది.

తలెత్తి ముందుకు ఒక అడుగు వేయబోయేడు కాని భాను మొహం... ఆ మచ్చలు వూడిపోయిన ఆ జుట్టు అతనిని అంతదూరంలో నిల్పుతున్నాయి

భాను కళ్ళు అరక్షణంలో సగంసేపు అతని చూపులతో కలిసేయి.

- జుగుప్సా, ఆవేదనా అతని కన్నులలో వానా వల్లప్ప లాడుతున్నాయి.

"భానూ!" పొడిగా అతని కంఠస్వరం పల్కింది. "ధైర్యంగా వుండు" వేగంగా అక్కడినుండి వెళ్ళిపోయాడు.

- వెళ్ళి మంచంమీద వాలిపోయేడు. అతని రెండు కళ్ళూ నీటితో నిండిపోయాయి. ఎట్లా భానుని భరించడం?

ఇరవై ఎనిమిదేళ్ళకే తన జీవితమంతా అంధకార మయిపోవాలా?

- లేదు లేదు తన భాను చచ్చిపోయింది. - భానుతో తిరిగి విదేశాలకు వెళ్లాలనే కోర్కె సమాధి అయిపోయింది.

- తన భాను స్థానంలో వున్న యీ వికృత రూపాన్ని తను పరిగ్రహించలేడు

తల్లీ దండ్రీ లేని తనను పెంచి పెద్ద చేసిన మామయ్య మనస్సు నొప్పించకుండా తన భావం విప్పిచెప్పి తాను ఒంటరిగానే తిరిగి వెళ్ళిపోవాలి. "భగవంతుడా ఏనాటి శాపం యిది నాకు?"

ప్రసాద్ రెండు చేతులతోనూ కణతలు నొక్కుకున్నాడు.

- ఆ రాత్రి యింట్లో ఎవరూ భోజనాలు చేయలేదు.

- మరుసటి దినంనుండీ భానుమతి ప్రసాద్ కంటపడకుండానే యింట్లో తిరగటం మొదలుపెట్టింది.

-పగలంతా ఏదో నవల పట్టుకొని కూర్చోవటం - సాయంత్రం క్లబ్బుకో, రెండో ఆట సినిమాకో వెళ్ళి రాత్రి చాలా కరగిపోయిన తర్వాత ఇంటికి రావటం - తిన్నగా తన గదిలోనికి వెళ్ళి మంచం మీద వాలిపోవటం ప్రసాద్ దినచర్యగా మారింది.

- ఉదయం కళ్ళు తెరిచేసరికి ఎదురుగా బెడ్‌కాఫీ పలకరించేది.

స్నానానికి వెళ్ళాలను కొనేసరికి వేడి నీళ్ళు సిద్ధంగా వుండేవి

స్నానంచేసి తిరిగి వచ్చేసరికి మంచం మీద దుస్తులు పెట్టివుండేవి.

- అనుక్షణం అతని అవసరాలు తీర్చే అస్పృశ్యహస్తం భానుమతిది అని గుర్తుకు వచ్చేసరికి అతని మనస్సు వేదనా భరితమయ్యేది.

- ఆర్ద్రత నిండిన ఆ క్షణాలలో

వేగంగా వెళ్ళి భానుమతిని చూడాలని పించేది.

కాని ఆ కాలిన మచ్చలు వూడిపోయిన జుట్టు - అతని పాదాలను శక్తివిహీనం చేసేవి.

అంతలో అతని మనస్సు కఠినంగా మారిపోయేది.

- భానుమతిని తను భరించడం కల లోని వార్త. కాని ఆ నిజాన్ని భాను తల్లిదండ్రులకు తెలియచెప్పే అవకాశం అతనికి రావటంలేదు.

- ఈ దేశంలోనే వుండిపోవాలో - విదేశాలకు తిరిగి వెళ్ళిపోవాలో తేల్చు కోలేకపోతున్నాడు.

భాను జీవితం ఆర్థికంగా కష్టపడ కుండా తాను చేయగలడు. కాని ఆమె తన జీవితంలో అడుగుపెట్టే అవకాశం మాత్రం మరిలేదు.

- వివిధ రకాలైన ఆలోచనలతో అలసిన అతని మనస్సు విశ్రాంతి కోరి కళ్ళు బలవంతంగా మూసుకొన్నాడు.

- చీకట్లో గడియారం రెండుగంటలు చూపుతోంది.

- మెట్లమీద ఎవరివో పాదాల చప్పుడు మెల్లగా వినవస్తోంది.

- ప్రసాద్ అచేతనంగా అట్లాగే పరుండి వున్నాడు.

నెమ్మదిగా మట్టెల శబ్దం అతని మంచం దగ్గరకు వచ్చి ఆగింది.

- దోమతెర తిన్నగా సర్ది, అతనికి శాలువకప్పి ఒక్క క్షణం నుంచొని వుంది భానుమతి.

- ఆ తర్వాత మెల్లగా కదిలి పోయింది.

ప్రసాద్ రాత్రి మరి నిదుర కంటి మీద వెయ్యలేదు.

- మరో పదిరోజులు గడిచేసరికి ఆ వూళ్ళో కాలం గడపడం దుర్లభమైంది ప్రసాద్‌కి.

ఏమయినా అతి త్వరలో తన నిర్ణయం వెల్లడిచేసి తాను ఆ వూరు వదిలిపోవాలని నిర్ణయించుకొన్నాడు.

అదే ఆలోచనతో పరధ్యానంగా వస్తున్న ప్రసాద్ తనని ఎవరో పిలు స్తున్నట్లు కూడా గమనించకుండా ముందుకు సాగాడు.

- ప్రసాద్ భుజాన్ని కుదుపుతూ అరిచేడు రఘురాం.

"బావగారిక్కి మేం బొత్తిగా నల్ల పూసలుగా మారేం. మీరు వచ్చి యిరవై రోజులు పైగా అయింది. ఇంతవరకూ మా యింటికి వచ్చేరా?

బలవంతంగా నవ్వి అతనిని అనుస రించేడు.

రఘురాం ధారాళంగా మాట్లాడుతూనే వున్నాడు.

"భాను అక్కయ్య మీ కోసమే బ్రతికింది బావగారూ! పిచ్చి అక్కయ్య. తన మొహం కాలినందుకుకంటే మీరు యీ వార్త తెలుసుకొని ఏమవుతారో

నని బాధ ఎక్కువపడింది. అసలు అక్కయ్యకు యీ ప్రమాదం జరిగాక హాస్పిటల్‌నుండి వచ్చిందా. అప్పుడే రెండు రోజులు జ్వరం వచ్చిందని మీ దగ్గర్నుండి ఉత్తరం వచ్చింది. గుర్తుందా? _ తనకు అంత ఘోరం జరిగితే _ అంత జ్వరంలోనూ నిండుగా స్నానంచేసి అమ్మవారి గుడికి వెళ్ళి కుంకుమపూజ చేయించింది _ అక్క ప్రేమ _ మీకు ఎప్పుడూ రక్ష బావ గారూ!...."

రఘురాం యింటి గుమ్మం ఎక్కే వరకూ ప్రసాద్ మౌనంగానే వుండి పోయాడు.

_ భానుమతి పెదతల్లి ప్రసాద్‌ని సాదరంగా ఆహ్వానించింది.

_ పండితురాలూ, సంస్కారి అయిన ఆ వృద్ధురాలంటే ప్రసాద్‌కి అపరిమిత మైన గౌరవం వుంది.

_ ప్రసాద్ టిఫిన్ తీసుకొంటుండగా అంది ఆవిడ.

"అయితే భానును ఎప్పుడు తీసుకొని వెడతావు నాయనా!"

_ ప్రసాద్‌కి పొలమారింది.

గ్లాసులో మంచినీళ్ళు ఎత్తి తాగుతూ మరి మాట్లాడలేదు.

_ అనుభవజ్ఞురాలైన ఆమె అతని అంతరంగాన్ని క్షుణ్ణంగా చదివింది.

_ ప్రసాద్ వైపు వక్కపొడి డబ్బా తోస్తూ అంది ఆవిడ.

"బాబూ! ప్రసాద్! అందం ఎప్పుడూ ఆనందదాయకమైనదీ _ అపేక్షణీయమైన దీను. భగవంతుడు ప్రసాదించిన యీ నేత్రాలు సృష్టిలోని సౌందర్యాన్ని ఆస్వాదించడానికే! నయనానందం తప్ప మన కన్నులు సౌందర్యరాహిత్యాన్ని భరింపలేవు నాయనా! కాని దైహికమైన అందచందాలకంటె ఆత్మగతమైన సౌందర్యం మిన్న నాయనా! భాను నీ శ్రేయస్సుగురించి శ్రమించని క్షణంలేదు బాబూ! నీకు గుర్తుందా ప్రసాద్! నువ్వు యూనివర్సిటీలో చదివే రోజుల్లో నువ్వు క్షేమంగా వుండాలనీ, ఉన్నత శ్రేణిలో రావాలనీ అంత చిన్న పిల్లా శనివారాలూ, వ్రతాలూ చేస్తూ వుండేది. నీకు పదిహేనో ఏట అట లమ్మవొత్తుగా పోయలేదూ. ఊళ్ళో అందరూ నీకు మశూచికం వచ్చిందని కంగారుపడ్డారు. పదేళ్ళ భాను నీ మంచం క్షణం వదిలేదికాదు. అది నీ కోసం పుట్టింది బాబూ! అది పీల్చేవూపిరి నీకోసం _ అది బ్రతికే బ్రతుకు నీ కోసం...."

కళ్ళు రెండూ తుడుచుకొంది ఆవిడ.

ప్రసాద్ శిలలా కూర్చుండిపోయేడు.

ఆవిడ తిరిగి అంది.

"ఈ రోజు జరిగిన యీ అన్యాయానికి అది ఏ విధంగానూ బాధ్యురాలు కాదు బాబూ. ఆ రోజు వంటయింట్లో తల్లికి సాయం చేస్తోంది. ఇంతలో వాకి

ట్లోంచి పోస్ట్‌మేన్ కేక వినిపించింది. నీ దగ్గరనుండి వచ్చే వుత్తరం అందుకోవా లనే తహతహతో వేగంగా పరిగెత్తి నడవబోయి దారిలో స్టవ్‌మీద పడింది. మొహం తిన్నగా మంటమీద పడింది చీర అంటుకొంటే అసలు భాను మనకు దక్కేదికాదు బాబూ! ”

కంఠంలో దుఃఖం సుడులు తిరిగింది ఆవిడకు ప్రసాద్‌కి మనస్సంతా అల్లకల్లోలమయిపోయింది

–అంతలో ఆవిడ తనని తాను సంబాళించుకొంది

“పువ్వువంటి దాని మనస్సు నొప్పించకూడదు ప్రసాద్! అందాలను అనుభవించాల్సిన వయస్సే నీది కాదనను. చదువుకున్నవాడివి. ఆ చదువు మనస్సుకి యిచ్చే సంస్కారంతో సంయమనంతో ఆలోచించు బాబూ! ఈ అందచందాలతో భాను స్వరూపాన్ని కాకుండా అసలు భానుని నువ్వు గుర్తించు ”

ప్రసాద్ నిశ్శబ్దంగా వుండిపోయేడు. ఆవిడా మరి మాట్లాడలేదు.

–నెమ్మదిగా ఆవిడదగ్గర సెలవుతీసుకొని యింటిమొహం పట్టేడు

–తనగదిలోనికి నిశ్శబ్దంగా వెళ్ళబోయేడు ప్రసాద్.

–సన్నగా రోదిస్తున్న స్వరం వినవచ్చింది.

మెట్ల పక్కగుండా భానుమతి వెనుకభాగం కనిపిస్తోంది.

ప్రక్కనే కమలమ్మా, వనజా నుంచొని వున్నారు

భాను వెక్కి వెక్కి ఏడుస్తూ అంటోంది

“ఆయనతో నేను వెళ్ళనమ్మా!”

కమలమ్మ మెల్లగా అంటోంది

“నీకు యిదేం వెర్రి భానూ! మన ప్రసాద్ నిన్ను నిర్లక్ష్యం చేస్తాడని నీ భయమా?”

“లేదమ్మా! ఆయన అటువంటివారు కారు కాని నన్ను చూస్తే ఆయన చిత్రహింస పడతారు. ఆయన అట్లా బాధపడటం నేను చూడలేను. యింక వారితో వుండలేను. అసలు నేను ఎందుకు బ్రతికేనమ్మా!”

ఆ మాతృ హృదయం విలవిల లాడింది. కూతురుని వొడిలోనికి తీసుకొని అంది ఆమె

“నువ్వు వూరుకో అమ్మా! పోనీ అతనితో నువ్వు వెళ్ళవద్దులే. అతను ఏమనుకోని విధంగా నాన్నగారి ద్వారా నేను చెప్పిస్తానుగా! వూరుకో అమ్మా! నువ్వు మాకేం బరువుకాదు ఈ వున్నదంతా మీ యిద్దరి పిల్లలదే. నీకు ఏ విధంగా బాగుంటుందో అదే చేద్దాంనా బంగారు తల్లివిగా–వూరుకో భానూ....”

తర్వాత అతను వినలేదు.

–వేగంగా తన గదిలోనికి వెళ్ళి తలుపులు మూసుకొన్నాడు.

- తను భానుమతిని పరిగ్రహించనని చెప్పడానికి ఎంతో సంశయిస్తున్నాడు.

అత్తయ్యకీ మామయ్యకీ రన భావాన్ని సున్నితంగా ఎట్లా విడమరచి చెప్పాలో ఎన్నో దినాలుగా ఆలోచిస్తున్నాడు.

- తన సమస్యను భానుమతి తీర్చి వేసింది. ఇప్పుడు మామయ్య తనవద్దకు రాబోతున్నాడు.

- అతి సున్నితంగా భాను తనతో రాదని - భానుకి తనతో జీవించాలని లేదనీ - విడమర్చి చెప్పబోతున్నాడు.

ఈ సమస్యతో రాత్రింబవళ్ళు తాను సతమతమవుతున్నాడు.

- చివరకు తనపరంగా కాకుండా భానునుండే యీ సమస్యకు పరిష్కారం లభిస్తోంది.

- భవిష్యత్తులో తనని ఎవరూ నిందించరు. తన ప్రవర్తన ఎవరి దృష్టిలోనైనా విపర్యనగా కనుపిస్తుందనే భయంలేదు.

- సమస్య తీరిన హృదయంతో సంతోషంగా తేలికగా నిట్టూర్చబోయాడు.

కాని ప్రసాద్ వశంకాలేదు.

ఎంతో హాయిగా నిశ్వసించబోయాడు.

కాని గుండెల్లో ఎక్కడో కలుక్కుమంటోంది.

ప్రసాద్ తనని చూసుకొని తానే ఆశ్చర్యపోయాడు.

- ఈ పరిష్కారంకోసమే తను ఎదురు తెన్నులు చూస్తున్నది.

- కాని ఆ బరువుతీరిన క్షణంలో తనలో యీ వేదనా రేఖలేమిటి?

- విసుగ్గా పచార్లు చేయసాగేడు.

భాను తననుండి శాశ్వతంగా విడిపోబోతోంది. ఆమె శిథిలాకృతిని తాను భరింపనవసరంలేదు.

తనకు తానే భానుని దూరం చేయవలసిన అవసరం రాకుండా ఆమె తన మార్గంనుండి తప్పుకొంటోంది

ఈ క్షణం కోసమే తానెంతో తహతహలాడ్తోంది.

కాని ఎదురు చూసిన యీ క్షణాలు తనకేమాత్రం ఆనందకరంగా లేవు.

ఇన్నాళ్ళూ తనను తాను వంచన చేసుకొనే ఆలోచించేడా?

ప్రసాద్ కళ్ళు నీటితో నిండిపోయాయి

భానుమతి అందవిహీనమైన మొహాన్ని చూసి ఆమెనుండి తాను దూరంగా తొలగిపోవాలని వూహించేడు. కాని ఆ వూహ తన భ్రమమాత్రమేనేమో?

ఆమెనుంచి తాను విడిపోవాలనే తన భావనకు తనకి తెలియని వ్యతిరేకత తనలోనే వుంది

_తనకు నిజంగా భానునుండి విడుదల కావాలా?

భాను పెదతల్లి అన్న మాటలు గుర్తుకు వచ్చాయి.

"సంస్కారంతో సంయమనంతో ఆలోచించు...."

నిజంగానే తనకి యీ క్షణంలో ఆత్మపరిశీలన చాలా అవసరం.

_భానుని విడిచిపోవాలని తన అసలు వాంఛ కాదేమో?

_తల బరువుగా అన్పించింది ప్రసాద్‌కు.

తన మనస్థితి తనకే అర్థంకావటం లేదు.

_భోజనాల దగ్గర రాఘవరావు అన్నాడు.

"ప్రసాద్! నువ్వు సెలవు యింకా పొడిగించదల్చుకున్నావా?"

"లేదు మామయ్యా! .... ఇంక వెళ్ళాలి."

రాఘవరావు కాసేపు మాట్లాడలేదు. చివరికి అన్నాడు.

"ప్రసాద్! రేపు వుదయం అన్నీ వివరంగా మాట్లాడుకొందాం...."

భోజనం ముగించి తల వంచుకొని గబగబా తన గదిలోనికి వెళ్ళిపోయాడు ప్రసాద్.

_మర్నాడు వుదయం మామయ్య తనతో సంప్రదింపబోయే సంగతులు తనకు తెలుసు.

_భానుని విడిచి పోవాలని తను ఎంతో ఆరాటపడ్డాడు.

కాని వాస్తవంగా ఆమెను విడవాల్సిన తరుణం వచ్చేసరికి తనలో యింత సంచలనం ఏమిటి? భానునుండి పారిపోవాలని తన మనస్సు ఎన్నో మార్గాలను అన్వేషించింది.

యథార్థానికి భాను తనకు కావాలా?

....లేదు లేదు.... ఆ వికృతాకారాన్ని తాను భరింపలేడు.

....కాదు.... కాదు భాను తనకెంతో బలాన్నిస్తోంది.

_భౌతికమైన భానురూపం కాకుండా మానసికంగా భాను భావన తనకెంతో శక్తినిస్తోంది.

_ప్రసాద్ కళ్ళు వేదనతో జ్వలించాయి.

ఇన్నాళ్ళూ తనని తాను తెలుసుకోలేకపోయాడు. భౌతిక రూపానికి అతీతమైన ప్రేమభావన తన జీవితానికి వూపిరి వంటిది.

భాను భౌతికరూపం ఏమయినా ఆమె తన భాను.... తన ప్రియమైన భాను.

ఆ చల్లని భావన తనకెంతో సేదనిస్తోంది.

_ఎంతో అనాలోచితంగా భానుని విడచిపోవాలని తాను నిర్ణయం చేసుకున్నాడు.

అదే జరిగిననాడు అశాంతితో ఆత్మగ్లానితో తాను జీవితమంతా పరితపించి వుండేవాడు.

అదృష్టవశాత్తూ తన ఆలోచనా క్రమం ఎవరికీ తెలియలేదు.

అదే తన పాలిట వరం.

మర్నాడు మామయ్యను కలసి మాట్లాడి నప్పుడు తన దృఢ నిర్ణయాన్ని విడమర్చి చెప్పాలి.

- రకరకాల ఆలోచనలతో మనస్సు వేడెక్కిపోతోంది ప్రసాద్‌కు.

- అర్ధరాత్రి దాటినా కనులు మూత పడటంలేదు.

- కలత పడిన హృదయంతో అశాంతిగా దిండులో తల దాచుకొన్నాడు.

- ఆ నిశ్శబ్దంలో మెట్లమీద సన్నగా మట్టెల చప్పుడు వినవచ్చింది.

- అట్లాగే నిశ్చలంగా పరుండి వున్నాడు.

మెల్ల మెల్లగా భానుమతి అతని మంచంవద్దకు వచ్చి నిలబడింది.

- అతనికి శాలువ కప్పుతున్న ఆమె చేతి గాజులశబ్దం అతనికి కర్ణ పేయంగా వినవచ్చింది.

- హఠాత్తుగా వులిక్కిపడ్డాడు. అతని నుదుటిమీద ఆమె కన్నీటి చుక్క పడింది.

- అతని మనస్సు ఆర్ద్రతతో నిండి పోయింది.

నిశ్శబ్దంగా అక్కడినుండి కదల బోతున్న భానుని చేయిజాపి హఠాత్తుగా దగ్గరకు లాక్కొన్నాడు.

- ప్రసాద్ చేసిన ఆ పనితో భాను అతని వడిలో వచ్చి వాలిపోయింది.

- వెక్కి వెక్కి ఏడుస్తున్న భాను శిరస్సు నిమురుతూ చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయాడు ప్రసాద్.

ఆప్యాయంగా ఆమె శిరస్సుని వడిలోనికి తెచ్చుకొని ఆమె కన్నీటిని కొనవేలితో మీటేడు.

అతని కంఠం దుఃఖంతో పూడుకొని పోయింది. భాను ఎంత చిక్కిపోయింది!

వెర్రిపిల్ల యిన్నాళ్ళూ ఎంతటి క్లేశాన్ని అనుభవించిందో!

కొత్తగా కాలిన శరీరం కనుక యీ మచ్చలు అవీ స్పష్టంగా వున్నాయి.

మంచి ప్లాస్టిక్ సర్జన్ దగ్గరకు తీసుకొని వెడితే భాను రూపాన్ని ఎంతో తొందరలో చక్కదిద్దవచ్చును.

తాను ఎంతటి అవివేకి?

ఎంతలో అమూల్యమైన భానుని పోగొట్టుకొని వుండేవాడు.

డాక్టర్లు యీమెలోని లోపాన్ని తీర్చలేకపోయినా కూడా తను తన భానుని వదులుకోలేడు.

ప్రసాద్ మనస్సు ప్రశాంతంగా హాయిగా వుంది.

- నెమ్మదిగా భాను శిరస్సుని నిమురుతూ కిటికీలోనుండి చూసేడు.

శరదృతువు వెన్నెల కాంతి విశ్వాన్నంతా ఆవరించి వుంది.

- కొంతసేపటినుండీ కమ్ముకొని వున్న మబ్బులు తప్పుకోవటంతో చల్లటి వెన్నెల కిరణాలు ఆ దంపతుల మీదుగా జాలువారేయి.

---




"శారద ఎక్కడ?"

టేబిల్ దగ్గర కూర్చుని, ఆ నెల జమాఖర్చులు చూసుకుంటున్న కనకమణి యీ ప్రశ్న వినగానే తలెత్తి చూసింది. ఆవిడ కెదురుగా, ప్రసాద్ నిలబడి వున్నాడు. క్షణంసేపు ఆవిడ చకితురాలయినట్లుగా, అతనివైపే చూస్తూండిపోయింది. కొద్ది నెలల క్రితం, అనసూయమ్మ గారింట్లో చూసిన ప్రసాద్‌కి, యీ ప్రసాద్‌కి ఎంతో వ్యత్యాసం కన్పిస్తోంది। ఆ ప్రసాచ్ మనుష్యుల్ని చూస్తే, తల తిప్పుకుని చరచరా వెళ్ళిపోయేవాడు। మనిషి బట్టలు ధరించడంలో, జుట్టు దువ్వుకోవడంలో అశ్రద్ధ, నిర్లక్ష్యం స్పష్టంగా కన్పించేది। ఆ ప్రసాద్ యితనేనా అని ఆశ్చర్యపరిచేటంతగా మార్పు కనిపిస్తోంది। ఇతని ముఖం తేటగా వుంది। ముఖం ప్రశాంతంగా, గంభీరంగా వుంది। చూపుల్లో అనిశ్చతగాని, మాటల్లో తొట్రుపాటుగాని లేనే లేవు.

"నేను శారదతో మాట్లాడాలి. ఒక్క నిముషం పిలుస్తారా?" అతను ఎలాంటి వుపోద్ఘాతం లేకుండా, నిస్సంకోచంగా, నిర్మొహమాటంగా, తను వచ్చిన పని చెప్పేశాడు.

కనకమణి లోలోపల నిటారుగా అయింది! శారద గురించి, అతన్ని ఎలా సమాధానపరచి, గొడవ లేకుండా, యిక్కడ నుంచి పంపటమా అని ఆలోచిస్తూ, పైకి మాత్రం ఎంతో మర్యాదని ప్రదర్శిస్తూ, "కూర్చో," అంటూ కుర్చీ చూపించింది. అతను కూర్చోలేదు. "శారదని పిలవండి." అన్నాడు.

"పిలుస్తాను. కూర్చో."

అతను ఆమె మర్యాదని మన్నిస్తున్నట్టుగా కూర్చున్నాడు.

"శారదతో ఏం పని!" ఎంతో మామూలుగా అడిగింది.

"ఒక్క నిముషం మాట్లాడాలి."

"ఏమిటది?"

"నా పర్సనల్ సంగతి చెప్పాలి."

"ఈ సేవాసదనంలో ఏ ఆడపిల్లకైనా, నాకు తెలియని పర్సనల్ విషయాలు వుండకూడదు అనే రూల్ వుంది! అది నీకు తెలియదేమో! కానీ శారదకి బాగా తెలుసు! నువ్వు చెప్పదలుచుకున్నదేదో నాకు ముందు చెప్పు."

అతని కళ్ళు క్షణంసేపు తీక్షణంగా మారినాయి. చురుగ్గా ఆవిడవైపు చూసినాయి. మరుక్షణమే మళ్ళీ మామూలుగా అయినాయి. కనకమణి, తను చెప్పవలసినదేదో చెప్పేసినట్టుగా, ఫైల్స్ సర్దుకోసాగింది!

క్షణం ఆగి, అతను అన్నాడు. "శారదా, నేనూ పెళ్లిచేసుకోవాలని అనుకున్నాం! శారద అంగీకరించింది! మళ్ళీ మనసు మార్చుకున్నట్టుగా, కబురు చేసింది! దానికి కారణం ఏమిటో నేను స్వయంగా, శారద నోటివెంట వినదల్చుకున్నాను."

కనకమణి మళ్ళీ అతన్ని సుదీర్ఘంగా చూసింది. తర్వాత ఏమనుకుందో ఏమో, బెల్ నొక్కి ప్యూన్‌ని పిలిచింది. ప్యూన్ రాగానే, "శారదని నేను పిలుస్తున్నానని చెప్పు," అంది. అతను వెళ్ళబోతుంటే, వెనకనుంచి పిలిచింది. "చూడు! శారద కోసం అనసూయమ్మగారి తమ్ముడు ప్రసాద్ వచ్చారని, మాట్లాడాలని అంటున్నారని చెప్పు" అంది. ప్యూన్ తలవూపి వెళ్ళిపోయాడు.

కనకమణి మళ్ళీ జమా ఖర్చులు పుస్తకం చూస్తూ అంకెలు కూడుకోసాగింది.

ఆవిడ కెదురుగా కూర్చుని వున్న ప్రసాద్, గుండెల్లో బలంగా వీస్తున్న భావోద్రేకాన్ని, బలవంతంగా నిగ్రహించుకుంటున్నాడు. అతని దృష్టి మాటిమాటికీ, లోపల గుమ్మంవైపు మళ్ళుతోంది! చెపులు, పాదాల అలికిడి కోసం, చీర రెపరెప కోసం, శ్రద్ధగా వేచి చూస్తున్నాయి! ఐదు నిముషాలు గడిచాయి! పది నిముషాలు దొర్లినాయి! గుమ్మంలోనుంచి శారద రాలేదు! కనక

మణి శారదకోసం కబురు పంపినమాటే మర్చిపోయినట్టుగా లెఖ్ఖలు కూడు కుంటోంది. ప్రసాద్ కళ్ళముందు జరగబోయే దృశ్యం కన్పిస్తోంది. ఆ గుమ్మంలోనుంచి శారద వస్తుంది! రాగానే తను లేచి ఎదురువెళ్తాడు. "శారదా! ఏమిటిది? ఎందుకిలా చేసావు?" అంటాడు. శారద జవాబు చెప్పలేనట్టు చూస్తుంది. తను చేయి పట్టుకుని అక్కడనుంచి చరచరా బైటకి లాక్కువెళ్తాడు! కనకమణి లబలబ లాడినా వినడు. శారద మనసులో యింకేమైనా అనుమానాలు, భయాలు వుంటే, చక్కగా, విడమర్చి మళ్ళీ చెబుతాడు! శారదకి ఎలా చెప్పాలో అతను అన్నీ సిద్ధం చేసుకున్నాడు! మొట్టమొదట యిక్కడికి బయలుదేరే టప్పుడు శారదమీద కసిగా, కోపంగా అన్పించినా, క్రమేపీ అది తగ్గిపోయింది! తన్ను చేసుకోవటానికి శారద భయ పడినా, జంకినా, అందుకు ఎంతో అర్థం వున్నదని అతనికి అనిపించింది! శారద వైపు ఆలోచించినకొద్దీ, అతని ఆగ్రహం మంచులా కరిగిపోయింది! శారదకి నచ్చచెప్పటానికి, బ్రతిమలాడు కోవటానికి, సిద్ధమై వచ్చాడతను! అతనికి శారద సాహచర్యం లేకుండా, బ్రతకలేననిపిస్తోంది! ఆ అమ్మాయి తన జీవితంలోకి ఎంతో ప్రశాంతతని తెచ్చింది! స్థిరత్వం ఆపాదించింది! జీవితం అంటే మళ్ళీ మమకారం కలిగేలా చేసింది! యీ ప్రశాంతత, స్థిరత్వం, మమకారం, శారద వెంటే వెళ్ళి పోయినాయి! శారద నిష్క్రమణతో, జీవితం మళ్ళీ చుక్కాని పోయిన పడవలా, జీవితం దిక్కుతోచని నావలా, గమ్యం లేకుండా పోతోంది! ఈ సమాజంలో, ఒకభార్య చచ్చిపోతే మగవాడికి, మళ్ళీ వెంటనే, రెండోభార్యని తీసుకురావాలని ఎందుకు చూస్తారో అతనికి యిప్పుడు అర్థం అవుతోంది! కాస్త జాగ్రత్తగా ఆలోచిస్తే స్త్రీకే కాదు, మగవాడికికూడా, యీ సంసారం పటిష్ట మైన ఆలంబనగా అన్పిస్తుంది!

ఆ కుర్చీలో కూర్చునివున్న ప్రసాద్‌కి గడిచిపోతున్న ఆ క్షణాలు కొన్ని యుగా లుగా వున్నాయి. చిట్టచివరికి ఎలా గయితేనేం, గుమ్మానికున్న పరదా తొలి గింది. అతను చటుక్కున కుర్చీలో నుంచి లేవబోయాడు! కానీ తన భవి ష్యత్‌కి ద్వారంలావున్ని ఆ గుమ్మంలో నుండి, వచ్చింది స్నేహమయి అయిన శారద కాదు! కనకమణిగారు లోపలికి పంపిన ప్యూన్. అతను నేరుగా కనక మణి దగ్గరకి వచ్చి ఒక చీటీ అందించాడు.

ఆవిడ కళ్ళజోడు సరిచేసుకుని దాన్ని చదివింది! తర్వాత నౌకరిని వెళ్ళ మన్నట్టు సౌంజ్ఞ చేసింది! తన వైపు

చూస్తున్న ప్రసాదకి ఆ చీటీ అందించింది. 'ఏమిటది!' అన్నాడతను.

శారదని చూడలన్నారుగా! ఇదుగో సమాధానం. అతను చీటీ అందుకుని చూసాడు. దానిమీద అతని అదృష్టానికి భాష్యం చెబుతున్నట్టుగా, శారద వ్రాసిన గుండ్రటి అక్షరాలు వున్నాయి! "అమ్మా! నాకెవరితో మాట్లాడాల్సినపని లేదు. నేనెవరినీ చూడ దలుచుకోలేదు. శారద."

అది చదవగానే, అతని ముఖంలో రకరకాలుగా మారుతున్న భావ మేఘాలని, కనకమణి కళ్ళజోడులోనుంచి ఆనందంగా, కుతూహలంగా గమనిస్తోంది! "జవాబు విన్నావుగా!"

అతను ఆ కాగితాన్ని వుండగా నలిపేసి కుర్చీలోనుంచి లేచాడు. "ఏ జవాబు అయినా, నేను స్వయంగా, శారద నోటినుండి వినాలి. మీరు శారదని పిలవండి." అన్నాడు.

"ప్రసాద్! మీ ధోరణి అతిగా వుంది. అనసూయమ్మగారి పట్ల గౌరవంతో, నేను యింతవరకూ సహించాను. ఆ మర్యాద నువ్వుకూడా మన్నించి, వెళ్ళిపోతే యిద్దరికీ శ్రేయస్కరం."

"మీరు శారదని, పిలుస్తారా? లేక నేను లోపలికి వెళ్ళనా?"

"నౌకర్లచేత గేటు బైటకి తోయించుకోవాలని వుంటే, లోపలవైపు అడుగు కదులు. ప్రసాద్! మీ అక్క, నేను ఎంతో స్నేహితులం. మా మధ్యవున్న స్నేహాన్ని, నువ్వు చెడగొట్టటానికి తయారవుతున్నావు! నేను శారదని మీ యింటికి పంపింది, కేవలం, మీ అక్కకోసం! నువ్వు పెళ్లిచేసుకోవాలంటే, ఆడపిల్లలే కరువయ్యారా! శారదమీద నేను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను! నా తర్వాత యీ సేవాసదనం బాధ్యత తనకే అప్పగించాలనే నిశ్చయంతో, తనని ప్రత్యేకమైన తర్ఫీదుతో పెంచి పెద్దచేసాను! నువ్వు శారద మంచి మనసు విరిచి, యీ పెళ్లి అనే వ్యామోహంలోకి దింపావు! ఇది నీ స్వార్థం! శారద నీ భార్య అయితే, నీ ఒక్కడికే వుపయోగపడుతుంది! శారద అందరి ఆడపిల్లలాటిది కాదు! ఆశ్రమంలో వుంటే శారదవల్ల, కొన్ని వందలమంది అనాధలకి, ఉపకారం జరుగుతుంది! అసలు మీ యింటికి శారదని పంపడం, యింత బాధకి కారణం అయింది! నువ్వు చదువుకున్నవాడివి! అర్థంచేసుకోగలిగినవాడివి! నీకు పుణ్యం వుంటుంది! శారద విషయం యిక ఎత్తకు!" ఆవిడ చేతులు జోడించి నమస్కరించింది.

ప్రసాద్ ఆవిడవైపే చూస్తున్నాడు. ఆవిడ ముఖంలో ఆగ్రహం, నిస్సహాయత్వం స్పష్టంగా కన్పిస్తున్నాయి.

ఆవిడ తీవ్రంగా అంది. "శారద యిక్కడ లేకపోతే, ఒక్క క్షణం

మాకు జరగదు! శారద వెళ్ళిపోతే, యీ సేవాసదనం మూలపడుతుంది! ఎంతో కష్టంమీద, నీ వ్యామోహపు కోరలనుంచి, నేను శారదని యివతలకి లాగాను! మళ్ళీ నువ్వు కళ్ళెదుటపడి, ఆ అమ్మాయి మనసు క్షోభ పెట్టకు! వెళ్ళు?"

ప్రసాద్ అచేతనుడిలా నిలబడి పోయాడు!

"ఈ పెళ్ళి మీ అక్కయ్యకి యిష్టం లేదు! నా కిష్టం లేదు! ఒకసారి, యిలాగే, ఎవ్వరికీ యిష్టంలేని పెళ్ళి చేసుకుని, నలుగురిలో నవ్వులపాలు అయ్యావు! మళ్ళీ అదే తప్పు చర్విత చర్వణం అవుతోందంటే, నీకు అసలు జ్ఞానం లేదన్నమాటే! పెద్దదాన్ని! అనుభవంతో నా తల పండింది! నీకు బాగా చెబుతున్నాను! నువ్వు పెళ్ళి చేసుకోవాలని అనుకుంటే, నువ్వు అనుసరించే పద్ధతి యిది ఏమాత్రం కాదు!"

ఆవిడ ఫైల్స్ సర్ది, బీరువాలో తీసుకెళ్ళి పెడుతూ అంది. ప్రసాద్ చకితుడైనట్టు చాలాసేపు అలాగే నిలబడి పోయాడు. ఆ తర్వాత మెల్లగా అక్కడ నుండి కదిలి, వెళ్ళిపోయాడు.

అతను సేవాసదనంనుంచి సరాసరి యింటికి రాలేదు. అతని మనసు నిశబ్దంగా, మౌనంగా వుంది! అందులో ఘర్షణ లేదు! టాంక్‌బండ్ దగ్గర బెంచీమీద కూర్చున్నాడు! ఎదురుగా, నీళ్ళు అస్తమిస్తున్న సూర్యకిరణాలతో ఆటలాడుతూ, చేపపిల్లల్లా కదులుతూ, మిలమిల లాడుతున్నాయి! అతని మనసులో మాటిమాటికీ, కనకమణి అన్న ఒకేమాట పదే పదే ప్రతిధ్వనిస్తోంది. "శారద నీ భార్య అయితే, నీ ఒక్కడికే ఉపయోగపడుతుంది! ఈ సేవాసదనంలో వుంటే, కొన్ని వందలమంది అనాధలకి వుపకారం జరుగుతుంది!"

నిజమే! ఆవిడ ఎంత బాగా చెప్పింది! శారద అభిమానం, ఆత్మీయత, తన ఒక్కడికే పరిమితం కాకూడదు! శారద మనసులోవున్న ఆత్మీయత, యీ భూమిని ఆవరించుకున్న గాలి, వెలుగు, నీరులా, అందరికీ, చెందాలి! శారద తనకి స్వంతం కానవసరం లేదు! కాని.... కాని శారదకి తను దగ్గర కావచ్చు.

* * *

ప్రసాద్ ఆ తర్వాత శారదని ముఖాముఖి కలవడానికి చాలా ప్రయత్నం చేసాడు. కానీ ఫలించలేదు. ఒకటి రెండు సార్లు సేవాసదనానికి ఫోన్ చేసాడు. ఫోన్ మోగిన ప్రతిసారీ, కనకమణే తీసింది. 'హలో' అన్న అతని స్వరం వినగాని, ఫోన్ కుక్కేన మూతపడేది! వుత్తరం వ్రాద్దామా అని ఆలోచించాడు! కానీ అది శారదకి సరాసరి చేరుతుందనే నమ్మకం లేకపోయింది! రోజులు గడిచినకొద్దీ శారదని కలవటం

అసంభవం అనే విషయం అతనికి స్పష్టంగా అర్థం కాసాగింది' రాను రాను శారదపైపునుంచి, తనని గుర్తుచేసుకున్నట్లుగా, ఏ చిన్న సంఘటనా జరగక పోవటంతో, శారద తనని మర్చిపోయిందా అనే అనుమానం రాసాగింది। పిల్లల్ని సేవాసదనం పంపించాడు। వాళ్ళు తిరిగి వచ్చారు। శారద సేవాసదనంలో లేదుట। ఎక్కడికి వెళ్ళిందో తెలియదుట।

ప్రసాద్‌కి యిది ఎదురుచూడని దెబ్బ అయింది।

రోజులు గడుస్తున్నాయి। పిల్లలకీ, అతనికీ మధ్యవున్న దూరం తరిగి, మరింత చనువు పెరిగింది। వాళ్ళిప్పుడు నాన్నా, నాన్నా అని పిలుస్తూ అతని చుట్టూనే తిరుగుతున్నారు వాళ్ళ అవసరాలు తీర్చటంలో, వాళ్ళ భవిష్యత్తుకి రూపకల్పన చేయటంలో అతనికి ఎంతో మనశ్శాంతి కలుగుతోంది। శారద జ్ఞాపకాలు ఎంత వదిలివేసుకుందామన్నా వదలటంలేదు। పెరటిలో కూరలచెట్లకి మందులు వేస్తుంటే, వాటికి పిల్లల్తో కలిసి నీళ్ళు పోస్తున్న శారద గుర్తుకు వస్తుంది। శారద పెట్టిన సన్నజాజి చెట్టుకి, అతను పందిరి వేసాడు। ఆ తీగె దాన్ని దట్టంగా అల్లుకుపోయింది। ఎంత దట్టంగా అంటే, ఆ పందిరే కనిపించటంలేదు। ఆ తీగెలు సరి చేస్తుంటే, అతనికి శారద ముంగురులు సవరిస్తున్నట్టే అనుభూతి కలుగుతుంది ఈ యింట్లో శారద చాలా రోజులు వుంది। ప్రతిచోటా, ఎక్కడో ఒకచోట ఆమె చేయిపడి, అందాలు దిద్దుకున్న ఛాయలు కన్పిస్తూనే వుంటాయి। ఇది వరకు, డైనింగ్ టేబిల్ ఎప్పుడూ ఖాళీగా వుండేది। భోజనం చేసినప్పుడు తప్ప, దాని సంగతి ఎవ్వరూ పట్టించుకోరు

శారద వచ్చిన తర్వాత, మూలగా బీరువాలో పడేసి ఖాళీగావుంచిన ఒక సీసా, డైనింగ్ టేబిల్‌మీదకి వచ్చింది దానిలో సగానికి నీళ్ళుపోసి అందులో ఒకటి రెండు పూలు, ఆకులతో రెమ్మలు వుంటాయి ఆ చిన్న అలంకరణ డైనింగ్ టేబిల్‌కే ఎంతో అందం తీసుకు వచ్చింది। శారద వెళ్ళిన తర్వాత పిల్లలు క్రమంగా ఆ అలవాటు మర్చిపోసాగారు ఒకరోజున టేబిల్‌మీద పూలతోవున్న ఆ సీసా కన్పించలేదు 'అది ఏమైంది?' భోజనానికి కూర్చోబోతూ అడిగాడతను "నేనే తీసేశాను అన్నీ పెట్టుకోవటానికి అడ్డుగావుంది" అంది అనసూయమ్మగారు ప్రసాద్ లేచి వెళ్ళి సీసాలో నీళ్ళుపోసి, పూలుపెట్టి తెచ్చి అక్కడ పెట్టాడు అంతేకాదు, పనిమనిషిని పిలిచి రోజూ అందులో పూలు ఉంచాలనే పని పురమాయించాడు

'శారద ఈ ఇంటికి రాకుండావుంటే బాగుండేదేమో' ఈ జ్ఞాపకాలు యిలా

తనని వేధించేవి కావు!' అని అనిపించేది. కానీ ఆ ఆలోచన క్షణికం మాత్రమే! మరుక్షణంలో యీ బాధలో కూడా ఒక ఆనందం వున్నట్టుగా అనిపించేది! శారదకి ఎవరూ అవసరంలేదు. అదెంత అదృష్టం! అనుకునేవాడు.లేదు! లేదు! తను పొరబడుతున్నాడు. శారదకి ఎవరూ అవసరం లేకపోవడం ఏమిటి? అందరూ కావాలి! శారద చూపే ప్రేమ ఏ ఒక్కరికీ పరిమితం కాకూడదు! అందులో స్వార్ధంలేదు! సాటి మనుష్యులేకాదు, మొక్కలు, కుక్కలు, చెట్లు, పువ్వులు అన్నీ శారదకు ప్రియాతి ప్రియమైన వస్తువులే! ఈ ప్రపంచంలో ప్రతి మనిషీ అలా నిస్వార్థంగా. నిష్కపటంగా వుంటే ఎంత బాగుంటుంది! కానీ, అది అందరికీ సాధ్యం అవుతుందా?

శారద అతని గదిని ఎంతో శ్రద్ధగా సర్దేది. గదిలో మంచంమీద పడుకుంటే, అతనికి అదే గుర్తుకు వస్తోంది! పక్కమీద రెండు రోజులకో దుప్పటి మారి, ఎప్పుడు చూసినా నీట్ గా, తెల్లగా వుండేది. పుస్తకాలు ఎక్కడివక్కడ, ఎంతో జాగ్రత్తగా అమర్చినట్లుగా వుండేవి! శారదతోపాటే, ఆ క్రమశిక్షణ, పరిశుభ్రత వెళ్ళిపోయినాయి! కవితకి, కల్పనకి ఎప్పుడూ తమ శరీరం మీద తమకివున్న శ్రద్ధ, మోజు యింటి మీద వుండనేవుండవు. వాళ్ళకి సినిమాల కబుర్లమీదవున్న ఆసక్తి యింక దేని మీదా లేదు. ఒకసారి అతను యింటికి వచ్చేసరికి, ముందుగదిలో పుస్తకాలు చెల్లాచెదురుగా వున్నాయి! కాఫీ తాగిన కప్పులు అక్కడే వున్నాయి! అవతల గదిలో ఇద్దరూ వేణుగోపాల్ తో కూర్చుని కబుర్లు చెబుతున్నారు.'కవితా, కవితా' అంటూ పిలిచాడు.

"ఏమిటి?" అంటూ వచ్చింది.

"ఈ గదిలో ఏమిటిదంతా, ఆ కప్పులెప్పటివి? కాస్త తీయించగూడదూ?"

కవిత ఆకాశం ఊడిపడినంత ఆశ్చర్యంగా చూచింది.

"ఏమిటీ! ఈ మధ్య యింటిమీద నీకు యింత శ్రద్ధ పట్టుకుంది?" అంది ఆరాతీస్తున్నట్టుగా.

యింకోమాట మాట్లాడితే యిక సంభాషణ కుతర్కంలోకి దిగుతుంది! అది ఘర్షణకు మారుతుంది. ప్రసాద్ అక్కడినుండి వెళ్ళిపోయాడు. తనే పని మనిషిని పిలిపించి ఆ కప్పులు తీయించాడు. ఆ పుస్తకాలన్నీ తనే సర్దాడు.

అతను పుస్తకాలు చదవడంలో, రికార్డు వినటంలో తన మనసు లీనంచేసుకోవటానికి ఎంతో ప్రయత్నిస్తున్నాడు! కానీ సాధ్యమే కావటంలేదు! రికార్డ్సు తీసి పెట్టి, అది వింటుంటే హఠాత్తుగా శారద ఎదురుగా కాఫీకప్పుతో నిలబడి నట్టే వుంటుంది శారద చెప్పిన తర్వాతనే అతను సుబ్బలక్ష్మి, మీరాబాయి భజన్లు కొనుక్కువచ్చాడు. ఆ రోజు

అతనికి యింకా బాగా గుర్తుంది। షాపు నుంచి తను ఆ రికార్డ్స్ కొని యింటికి తీసుకువచ్చాడు. తన చేతిలో వాటిని చూడగానే శారద చిన్నపిల్లలా సంబర పడిపోయింది। అప్పటికప్పుడు వాటిని పెట్టి వింది।ఆ పాటలు వింటూ క్షణంసేపు వెనక్కి తల ఆనించి కళ్ళు మూసు కుంది। ఆ సంగీతం ఆస్వాదించటంలో శారద పొందుతున్న తన్మయత్వం అత నికి విచిత్రంగా, కుతూహలంగా అని పించింది। ఆ అమ్మాయి మనసు పాల లాటి స్వచ్ఛతతో వుంది। ఆ అమ్మాయి పొందే ఆనందం అతనికి మరీ మరీ చూడా లని అనిపించింది। తర్వాత, తనకి తెలియకుండానే శారదకి యిష్టమైన పనులు చేసేవాడు। ఆ కళ్ళలో కృత జ్ఞత, ఆనందం, తను తెలియచేస్తున్నానని కూడా తెలియకుండా మూగగా వాటిని ప్రదర్శించే తీరు అతనికి చాలా హాయిగా వుండేది. ఆడపిల్లలు అంటే యిలా వుండాలి అనిపించేది। శారదని చూస్తుంటే శారదతో మాట్లాడుతుంటే, ఒక అనిర్వ చనీయమైన ఆనందం కలుగుతుంది। శారదతో ఎన్ని గంటలు మాట్లాడినా, మానసికంగా ఎలాటి ప్రలోభమైన ఆలో చనా కలుగదు। ఈ ప్రత్యేకత ఆమె వ్యక్తిత్వంలోనిది. ప్రసాద్ మనసులో బలవంతంగా అతను తెచ్చిపెట్టుకున్న వివక్షణాజ్ఞానం, తెగిన గాలిపటంలా నేలకూలింది। శారద కావాలి తనకి। శారదకి తను దగ్గరవుతూ వుండాలి। శారద సమక్షంలో తను అనుక్షణం సేద దీరాలి। ఎలా? ఎలా? యిదే అతనికి జవాబు దొరకని ప్రశ్న అయిపోయింది।

"ఏరా ప్రసాదూ, ఏం చేస్తున్నావు?" అనసూయమ్మగారు లోపలికి రావడంతో, అతను లేచి కూర్చున్నాడు.

"ఇదుగో. నీకు ఉత్తరం వచ్చింది. వేణు వ్రాశాడు" అంటూ ఆవిడ అందిం చింది. ప్రసాద్ దాన్ని అందుకున్నాడు. అతను ఆశించినట్టు ఆవిడ ఉత్తరం యివ్వగానే వెళ్ళిపోలేదు.

"ప్రసాదూ। నీతో మాట్లాడాలిరా నేను" అంటూ కూర్చుంది.

"ఏమిటక్కా, చెప్పు."

"నా మనసు నువ్వు ఎప్పుడు అర్థం చేసుకుంటావో నాకు అర్థంగావటం లేదు."

"పెళ్లి సంగతేగా నువ్వు అనేది?"

ఆవిడ అవునన్నట్టు చూసింది.

"నీకు నేను ఎప్పుడో ఆ జవాబు చెప్పాను। కవిత, కల్పనలతో నా స్వంత చెల్లెళ్ళలా కలసి మెలసి మెలిగాను. నువ్వు యీ విషయం ఎత్తినప్పుడల్లా నాకు చాలా బాధగా వుంటుంది."

"మనవాళ్ళు ఎంతమంది మేన మామలు, మేనకోడళ్ళని చేసుకోవటం లేదు?"

"వాళ్ళందరి సంగతి మనకు వద్దు. కవిత ఎలాగూ చదువుకుంటానంటోంది।

దానిష్టం వచ్చినంతవరకూ చదువుకోనీ. కల్పన గోపాల్‌ని చేసుకుంటానంటోంది. అతనికి కట్నం ఏం కావాలో అడుగు. యిచ్చి పెళ్లి చేద్దాం."

అనసూయమ్మగారు పుస్సురంటూ లేచింది. ప్రసాద్‌లో చిన్నప్పటినుంచీ ఒక మొండితనంవుంది. తను అనుకున్న పని చేసితీర్తాడు. అప్పుడు జయ విషయంలోనూ అంతే అయింది. ఎవరు ఎంత చెప్పినా వినలేదు.

ఆవిడ లేచి వెళ్ళబోయే ముందు అంది— "ప్రసాదూ! ఒక్క విషయం నీకు గట్టిగా చెబుతున్నాను. నువ్వు మళ్ళీ పెళ్లిచేసుకునే ప్రసక్తి లేదంటేనే నేను నా కూతుళ్ళకి వేరే సంబంధం చూస్తాను. తెలిసిందా!"

ప్రసాద్ మాట్లాడలేదు. "నువ్వు వాళ్ళ పెళ్లిళ్ళు అవగానే యింకెవరినో కట్టుకుని యింటికి తెస్తే నేను ఆ మనిషికి యింటిపెత్తనం అప్పజెప్పి, ఒకమూలగా వుంటాననేది కల్లోకూడా జరగని విషయం. బాగా గుర్తుపెట్టుకో!"

"సరే అక్కయ్యా!"

"యీ యిల్లు యిలా నిలబడిందంటే, కేవలం నా కష్టమే కారణం! నువ్వు ఆ సంగతి మర్చిపోతే గుర్తుచేసే అధికారం నాకుంది అనుకుంటున్నాను."

అతను తల ఊపాడు. "నేనెప్పుడూ మర్చిపోను! ఒకవేళ మర్చిపోయినా నువ్వు బాగా గుర్తుచెయ్యి. అవసరం అయితే యీ యింట్లోంచి, నన్ను మెడబట్టి గెంటే అంత అధికారం నీకు వుందని నేను ఒప్పుకుంటున్నాను. సరేనా!" ఆ మాటలు అతను ముఖప్రీతికి అనలేదు. మనస్ఫూర్తిగానే అన్నాడు. జయ వ్యవహారంలో తాను తెచ్చిన ఎగుడు, దిగుళ్ళకి యీ యింటి గౌరవ ప్రతిష్ఠలు చెక్కుచెదరకుండా నిలబడినాయంటే కేవలంఅక్కే కారణం! ఆ కారణం ఆధారం చేసుకొనే ఆవిడ యీ యింట్లో నాకు అధికారం వుందని అంటోంది!

అనసూయమ్మగారు వెళ్ళిపోయిన తర్వాతకూడా ప్రసాద్ అక్కడే కూర్చుండిపోయాడు! "అక్క యీ యింటికోసం తాపత్రయపడిన మాట నిజమే! కానీ అది కేవలం తమ్ముడి జీవితం ఒడిదుడుకుల పాలవుతోందనే, ఆత్మీయతతోనా! కాదు! యిది ఎప్పటికైనా తన స్వంతం చేసుకోవచ్చుననే స్వార్థంతో, తమ్ముడి బ్రతుకు చక్కదిద్దుతున్నాననే నెపంతో ఆవిడ జీవితం సుస్థిరం చేసుకుంది! అతని కాపురం అస్తవ్యస్థం అయితే, అది ఆధారంగా, తన పిల్లల భవిష్యత్తుకి పునాదులు వేసింది! భర్త చేసిన అప్పులు తీర్చింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఆవిడ జీవితం అంతా యిప్పటివరకూ నిశ్చింతగా వెళ్ళిపోయింది! జయ ఒకరకంగా అతని జీవితం పిండుకోవాలని చూస్తే,

అక్కా మరో రకంగా, ఆ పని చేసింది. అటు జయకి, యిటు అక్కకి కూడా తన డబ్బుమీదనే ధ్యాస! జయ స్వార్థం లోకం కళ్ళముందు సుస్పష్టంగా బైట పడింది! అనసూయమ్మగారిది బైట పడ లేదు! అంతే తేడా!

అతను ఇంకొకరిని పెళ్ళిచేసుకో కూడుట! ఆవిడ ఎంత ఖచ్చితంగా చెబు తోంది! ఏం తప్పు చేశాడని, తను ఇంత చిన్న వయసులోనే, వయసుకి మించిన అనుభవంతో, జీవితం శూన్యం చేసుకో వాలి! అక్కకి నిజంగా తనమీద ప్రేమ వుంటే, తన కిష్టమైన శారదని తెచ్చి పెళ్ళి చేసివుండేది! తన చుట్టూ వున్నవారు అందరూ అందరే! వొట్టి స్వార్థపరులు! జయని చేసుకోవటం తన తప్పే! ఆ తప్పుకి తగిన శిక్ష అనుభవించాడు. అక్కడితో ఆ ప్రకరణం ముగిసిపో కూడదా! చెట్టుని నరికితే మళ్ళీ కొత్త చిగుళ్ళు వస్తాయి! అవి శాఖోప శాఖలుగా విస్తరిస్తాయి. ఒకనాటికి, అది ఒకసారి పడిపోయిన చెట్టు అనికూడా ఎవరికీ గుర్తుండదు! మనిషి జీవితంకూడా అలాగే వుండాలి! ఈ జీవితం, ఎక్కడా, ఎవ్వరి కోసమూ ఆగిపోకూడదు! తన స్నేహితుడు విక్రమ్ వున్నాడు. అతనూ, భార్యా ఎంతో అన్యోన్యంగా వుండేవాళ్ళు! వాళ్ళ సంసారం చూస్తే ఎంతో చూడముచ్చట వేసేది! వాళ్ళ అనురాగం చూడలేక దేవతలు యీర్ష్య పడ్డారా అన్నట్లుగా ఆమె కలరా తగిలి మరణించింది! అతడు ఏమయిపోతాడోనని తాను భయపడ్డాడు! కానీ చిత్రంగా అతను ఏమీ కాలేదు! ఆర్నెల్లు తిరగకుండానే యింకో అమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు! ఆ అమ్మాయితో కూడా అతను సుఖంగానే వున్నాడు. ఏమిటి యీ విలువలు? అది విపరీతంగా ఏమీలేదు! ఏ విషయానికైనా, దాని విలువ, మనం చూసే దృక్పథంలో వుంటుందా అన్పిస్తోంది!

ప్రసాద్ పరధ్యాసగా, చేతిలో ఉత్తరం అటూ యిటూ తిప్పుతుండగా అతని దృష్టి దానిమీద పడింది. వేణు ఫారిన్‌నుంచి వ్రాశాడు.

"అయ్యో! ఇంతవరకూ గమనించనే లేదు," అనుకుంటూ చించి చూశాడు.

అందులో ఇలా వుంది.

ప్రసాద్!

మేం క్షేమం. నువ్వు క్షేమం అని తలుస్తాను. నీ ఆరోగ్యం బాగా చక్క బడిపోయిందని, మళ్ళీ మామూలుగా అయ్యావని, మన పాండు చెప్పగా విని చాలా సంతోషించాను. జీవితం అంటే, మిట్టపల్లాల మయం! ఎక్కుతూ దిగుతూ వుండాలి! దేనికీ ఎక్కువ ప్రాధాన్యత యివ్వకూడదు! జీవించడమే మనవంతు అనుకో! ఏదయినా నువ్వు ఆరోగ్యం పొంది మళ్ళీ మామూలు మనిషివి అయి

నందుకు ఆ భగవంతుడికి ధన్యవాదాలు అర్పిస్తున్నాను.

నీకు యిప్పుడు ముఖ్యంగా వ్రాసేదే మంటే మా పిన్నత్తగారు ఒకావిడ హైద్రాబాదులో ఉంది! ఆవిడకు బొత్తిగా ఒంట్లో బాగాలేదు. పెరాలిసిస్ స్ట్రోక్ వచ్చిందని, మమ్మల్ని వెంటనే రమ్మని ఉత్తరం వ్రాసింది. నా ఉద్యోగరీత్యా యిప్పుడు యిండియా రావటం నాకు వీల వదు! ఆవిడకి ఎవరూ లేరు. బాగా ఆస్థి వుంది. అది మాకే వస్తుంది. ఈ సమ యంలో ఆవిడకి అండగా వుండాల్సిన బాధ్యత మాదే అనుకో. కానీ ఒక 20 రోజులవరకూ నాకు రావటానికి వీలు కాదు. నువ్వు వెళ్ళి కాస్త ఆవిడ మంచి చెడ్డలు కనుక్కోవాల్సిందిగా అర్థిస్తు న్నాను! వీలయినంత తొందరలో మేము వస్తాం. మేము వచ్చేవరకూ, నువ్వు ఆవిడని కనిపెట్టి చూడవలెను! నువ్వు ఈ ఉపకారం మాకు తప్పక చేస్తావని నమ్ముతున్నాను! నువ్వు వెళ్ళి ఆవిడను చూసి, వెంటనే పరిస్థితి అంతా నాకు ఉత్తరం వ్రాయగలవు! ఈ ఆపదసమ యంలో నువ్వు తప్ప నాకు యింకెవరూ దిక్కు కనిపించలేదు. నీ ఋణం ఏదో విధంగా తీర్చుకోగలను.

నీ వేణు."

ఆ ఉత్తరం చదవటం పూర్తయే సరికి ప్రసాద్ పెదవులమీద చిరునవ్వు కదిలింది! ఈ ప్రపంచంలో ప్రతి వ్యక్తికీ డబ్బుపైన ఆకాంక్ష! ఆవిడకి డబ్బు లేకపోయినట్టయితే, అలా సుస్తీగా ఉందని రాస్తే వేణు పట్టించుకుంటాడా! అసలు జవాబు వ్రాస్తాడా! ఆ డబ్బే అతను యిలా తాపత్రయపడేట్టు చేస్తోంది! ఛి, ఛీ! అందరూ డబ్బు మనుష్యులే! అందరూనా? ఉహూ! ఈ ప్రపంచంలో డబ్బుని తృణప్రాయంగా చూసేవారు కూడా వున్నారు! అతని కళ్ళెదుట చిరునవ్వుతో శారద మూర్తి సాక్షాత్క రించింది! అదుగో! మళ్ళీ శారద జ్ఞాప కమే!

ఏ విషయం ఆలోచించబోయినా అది శారదకి అన్వయించాలని అనిపిస్తుంది.

అతను లేచి బట్టలు మార్చుకొని, వేణు వ్రాసిన కవరు జేబులో పెట్టుకుని బైలుదేరాడు.

* * *

ఆదర్శనగర్‌లో, వెంకటేశ్వరస్వామి గుడి పాదాలచెంత వున్నట్టుగా వున్న వరసలో ఆఖరి యిల్లు అది! పైకి రంగు వెలిసి పాతబడిన భవనంలా వున్నా లోపలికి అడుగు పెట్టగానే, ఐశ్వర్యం చిహ్నాలు కన్పిస్తున్నాయి. ఇంటి వరం డాలో నడివయసు దాటిన ఆయన, కుర్చీలో కూర్చుని పేపరు చూస్తున్నాడు. ప్రసాద్ ఆయన్ని ఆ యింటావిడ పేరు గురించి అడిగాడు. ఆయన తల ఊగిస్తూ క్రింది భాగంలో తాము అద్దెకి వుంటు న్నామని, పై భాగంలో ఆవిడ వుంటుం

దని చెప్పాడు. పైకి వెళ్ళే మెట్లు ఆ ఇంటిలోనుంచే వున్నాయి! ఆయన చూపిన దారివెంట మెట్లెక్కి పైకి వెళ్ళాడు. అతనికి ప్రయాస లేకుండానే ఆవిడ వరండా దాటగానే కనిపించిన గదిలో, సుస్తీగా పడుకుని కనిపించింది!

ప్రసాద్ ఆవిడకి దగ్గరగా వెళ్ళాడు. కుర్చీ లాక్కుని కూర్చుని వేణు ఉత్తరం వ్రాసిన సంగతి చెప్పాడు. ఆవిడ నోటి మాటకూడా పోయింది! అన్నీ కుడిచేత్తో, కళ్ళతోనూ సైగలే!

"మీకు ఏం కావాలన్నా నేను చూస్తాను. మీరు ధైర్యంగా వుండండి" అన్నాడు.

ఆవిడ కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి!

ఇంతలో డాక్టరు లోపలికి వచ్చాడు. ఆయనవెంట యింతక్రితం క్రింద కనిపించిన ఆయన వున్నాడు. వాళ్ళ వెనక మరో యువతి లోపలికి వచ్చింది! గదిలో చీకట్లు కమ్ముకుంటున్నాయి. అద్దెకున్నాయన డాక్టర్ కి ప్రసాద్ని వేణు స్నేహితుడిగా పరిచయంచేశాడు. డాక్టర్ తో మాట్లాడుతున్న ప్రసాద్ వారి వెనకనుంచి వచ్చి ఆమెతలవైపు వెళ్ళిన యువతిని సరిగ్గా గమనించనేలేదు.

అద్దెకున్నాయన 'చీకటి పడింది' అంటూ లైట్ వేశాడు.

గుమ్మం దగ్గరనుంచి రోగివున్న మంచం దగ్గరకి డాక్టరుగారితోపాటు వస్తున్న ప్రసాద్, గోడదగ్గర ఆవిడ తలవైపు నిలబడివున్న వ్యక్తిని చూడగానే నిశ్చేష్టుడయ్యాడు. 'శారదా!' అతని పెదవులు అస్పష్టంగా కదిలినాయి.

కానీ శారద అతనివైపే చూడడంలేదు. డాక్టర్‌గారు రోగికి యింజక్షన్ యివ్వటంలో, ఆవిడని పట్టుకోవడంలో సాయంచేస్తోంది! డాక్టరుగారు శారద ఆ యింట్లో బాగా అలవాటు అయినట్టుగా చెప్పేస్తున్నాడు. "చూడమ్మా! యీ మందులు గంటకి ఒక్కొక్కటి చొప్పున వేయాలి! ఈ కాప్సిల్స్ రేపటి నుంచి రెండుకంటే ఎక్కువ వాడవద్దు. ఆవిడ నిద్రపోకపోతే రాత్రికి యీ మందు వెయ్యి!"

"అలాగే! సరే" అని తలఊపుతూ శారద ఆ మాటలను శ్రద్ధగా వింటోంది.

ఇంజక్షన్ ఇచ్చిన తరువాత డాక్టరుగారు పది నిముషాలు పైగానే వున్నారు. కానీ శారద ప్రసాద్‌వైపు కన్నెత్తి చూడనేలేదు! అపరిచిత వ్యక్తిలా ఉండిపోయింది. అద్దెకున్నాయన శారదతో "చూడమ్మా శారదా! ఈయన భవానీ ప్రసాద్ అని, ఆవిడ బంధువులు ఫారెన్‌లో వున్నారన్నానే వాళ్ళకి స్నేహితులట! ఈ పూటనుంచి ఈవిడ సంరక్షణభారం నాకు తగ్గింది. ఇకనుంచి ఈయనే చూసుకుంటారు" అన్నారు.

శారద ప్రసాద్‌కేసి అప్పుడే ప్రప్రథ

మంగా చూస్తున్నట్టుగా నమస్కరించింది।

ప్రసాద్ తిరిగి నమస్కరించాలనే ధ్యాసకూడా లేనట్టు చూస్తున్నాడు.

"ప్రసాద్‌గారూ! ఈ అమ్మాయిని నేనే ఏర్పాటు చేశాను। శారద అని, ఇందిరా సేవాసదనంలో వుంటుంది.

కనకమణిగారని, ఆ సేవాసదనం చూసే ఆవిడ నాకు బాగా తెలుసులెండి." ఆయన ఏం చెబుతున్నాడోకూడా అతని చెవులకి ఎక్కడంలేదు.

డాక్టరుగారు, అద్దెకున్నాయన మెట్లు దిగి వెళుతుంటే శారద పంపడానికి వెళ్ళింది। ప్రసాద్ పైమెట్టుమీదే ఆగిపోయాడు.

పది నిముషాల తర్వాత శారద డాక్టరుగారిని పంపి తిరిగి వచ్చింది. ప్రసాద్ యింకా అక్కడే నిలబడి వున్నాడు.

మెట్లు సాంతం ఎక్కి పైకి వచ్చిన శారద అతనికి అభిముఖంగా నిలబడి చిరునవ్వుతో అడిగింది. 'బాగున్నారా?' ప్రసాద్ శారదనే చూస్తున్నాడు. శారదలో రవంతకూడా మార్పులేదు. అదే చిరునవ్వు! అదే సహనం! అదే ప్రశాంతత! ఆ క్షణంలో శారదని పరిశీలిస్తున్న అతని కళ్ళు ఊహించుకున్న దేవతని కళ్ళెదుట నిలబడితే విభ్రాంతి చెందిన పసిబాలుడిలా వున్నాయి!

"ఏమిటలా చూస్తున్నారు?"

"నువ్వేనా! నా కళ్ళని నేనే నమ్మలేకపోతున్నాను!"

"అంత మారిపోయాననంటారా?"

"ఇంత మారకుండా ఎలా వున్నావా అని?"

"అంటే?"

"నిన్ను చూస్తుంటే నాకెంతో సంతోషంగా వుంది। నన్ను చూస్తుంటే నీకేమీ అనిపించడంలేదూ?"

శారద ముఖం క్షణంలో సగంసేపు శూన్యమైంది. కానీ మళ్ళీ వెంటనే తనని నిలపరించుకుంది. "ఆ నం దా న్ని, దుఃఖాన్ని. కోపాన్ని. తాపాన్ని, మనసులో కలిగిన వెంటనే పైకి ప్రదర్శించడానికి మేం అందరిలాంటి ఆడపిల్లల్లా పెరగలేదు కదా?"

ప్రసాద్ చటుక్కున శారద చెయ్యి పట్టుకోబోయాడు. శారద మెరుపులా దూరంగా జరిగింది.

"ఆమెకి మందు యివ్వాలి. ఆమెకి సేవలు చేయడానికే నేను యిక్కడికి వచ్చాను" అంటూ అతని ప్రక్కనుంచి చటుక్కున లోపలకు వెళ్ళిపోయింది।

(ముగింపు వచ్చే సంచికలో)

# వెన్నెల నిండిన కళ్ళు

తల్లి చేసే గిన్నెల చప్పుడుకు మెలుకువ వచ్చింది రాధకి. "అమ్మా ! యింత వేగిరం లేచిపోయావేం? ఇంకా బాగా చీకటిగా వుంది," అంది రాధ, పక్క మీదనించి లేవకుండానే.

"వేగిరం లేవలేదమ్మా. ఆరు దాటింది. పైన బాగా మబ్బుపట్టి, నీకు తెల్లవారనట్టు అనిపిస్తోంది. అన్నయ్య స్టేషన్‌కి వెళ్ళాడు" అంది వర్ధనమ్మ.

తెరచివుంచిన కిటికీలోంచి నల్ల మబ్బులు కనిపిస్తున్నాయి. మబ్బులు ముసురుకోవడం చూస్తే, ఏ క్షణానైనా కుంభవృష్టి కురిసేటట్టు వుంది. దూరంగా ఉన్న రావిచెట్టుమీద పక్షులు కోలాహలం చేస్తున్నాయి. రాబోయే వర్షపాతానికి తమ గూళ్ళ గతి ఏమౌతుందో అని కంగారుపడుతున్నట్టు ! కాకులు 'కావ్ కావ్' మంటూ అవిరామంగా అరుస్తూ, కొమ్మలమీద యిటూ అటూ ఎగురుతూ ఆదుర్దా ప్రకటిస్తున్నాయి.

ఇంట్లో వర్ధనమ్మ హడావిడి కూడా అలాగే వుంది. ఉన్నది ఒక్క గదీ, వంటిల్లూ. గదినిండా సామాను, కుర్చీలు, ఒక బల్ల. కొత్త కోడలు వస్తోంది. ఎలా సర్దుకోవడం? కొడుకూ, కోడలూ గదిలో పడుకుంటే, తనూ, పెళ్ళికాని కూతురు రాధా వంటింట్లో పడుకోవాలి. వంటింట్లో ఉండే చిత చిత. వర్షం వచ్చిందంటే వేరే చెప్పాలా? అన్నిటికంటే యిబ్బంది, గదికీ, వంటింటికీ మధ్య తలుపులు లేవు. ఇన్నాళ్ళూ మధ్య తెర కట్టారు. ఇప్పుడు తలుపులు పెట్టించమంటే, 'వర్షాలు తగ్గనీయండి' అంటారు యింటివారు. తలుపులులేని గదిలో కాపురం చెయ్యడానికి కొత్తకోడలు ఎంత సిగ్గుపడుతుందో? ఇటు పెళ్ళికాని రాధకూ యిబ్బందే!!

బయట ఆటో ఆగింది.

"రాధా, సరళ వచ్చినట్టుంది. లేచి పక్క చుట్టు" అంది వర్ధనమ్మ, ముందు వరండాలోకి వెళుతూ.

సరళ వచ్చి, అత్తగారికి నమస్కారం చేసింది. సత్యంభార్య సామాను దింపించి, లోపలికి తెచ్చాడు. రాధ బయటికి వచ్చి పలకరింపుగా నవ్వి, వదినని ఆహ్వానించింది.

"రామ్మా, ముఖం కడుక్కున్నావా? కాఫీ యిస్తా," అంది వర్ధనమ్మ, ఆప్యాయంగా.

---

కొలిపాక రమామణి

సరళ ముఖం కడుక్కున్నా అంటూ కాళ్ళూ, చేతులూ కడుక్కుని వంటింట్లోకి వచ్చింది. రాధ పీటవాల్చి కూర్చోమంది. వర్ధనమ్మ కోడలి పుట్టింటివారి యోగ క్షేమాలూ, ప్రయాణం వివరాలూ అడుగుతూ, కాఫీ కలిపి, కొడుక్కీ, కోడలికీ యిచ్చింది. రాధ పళ్ళతోముకు రాగానే ఓ గ్లాసు అందించింది.

సత్యం ముందుగదిలో కూచుని పేపరు చదువుతున్నట్టు నటిస్తున్నాడు. గదికీ, వంటింటికీ మధ్యవున్న తెర తొలగించడంతో వంటింట్లో మనుషులు కనిపిస్తున్నారు. వారి మాటలు వింటూ కూర్చున్నాడు. అతని దృష్టి మాటి మాటికీ సరళమీద పడుతోంది. ఆమెని చూస్తున్నకొద్దీ, ఒక్కసారి ముట్టుకోవా లనే కోరిక కలుగుతోంది అతనికి. కాని ఈ చిన్న ఇంట్లో అది సాధ్యమా? రాత్రిదాకా ఆగాలి. ఇంకా ఎన్ని గంటలు? అతను మనసులోనే లెక్కించుకుని నిట్టూర్చాడు.

"సత్యం! ఇవాళ ఆఫీసుకి వెళతు న్నావా? సెలవు పెట్టావా?" అంది తల్లి.

"లేదమ్మా. ఆఫీసుకి వెళతాను" అన్నాడు సత్యం. సెలవుపెట్టి ఏం చెయ్యాలి? మొదటిరోజే భార్యని ఒంటరిగా బయటికి తీసుకువెళ్ళాలంటే సంకోచంగా వుంది....రాధ ఏమనుకుం టుంది?

వర్ధనమ్మ వంట మొదలుపెట్టింది. సరళ గదిలోకి వచ్చి, బట్టలు తీసు కుంటోంది. ఆమె తలలో ఎండిపోయిన సంపెంగలూ, గులాబీ వున్నాయి. అవి తీసి, కిటికీలో పెట్టి జడ విప్పుకుంది. ఆమె చేతులు పైకెత్తి పూలు తీస్తూ వుంటే, సత్యం కళ్ళు అక్కడే చిక్కుకు పోయాయి. అది గ్రహించిన సరళ సిగ్గుతో ముఖం పక్కకి తిప్పుకుంది. ఆమె పెదవులమీద ఒక్క హాస్యరేఖ మెరిసింది.

"రాధా, సరళ తలంటుపోసుకుంటుం దేమో! కుంకుడుకాయలు ఇయ్యి" అంది వర్ధనమ్మ.

సరళ బట్టలు తీసుకుని నీళ్ళగదివైపు నడిచింది. ఆమె తిరిగి వచ్చేదాకా సత్యం పేపరు మొదటి పేజీ తిప్పలేదు.

తల తుడుచుకుంటూ వచ్చింది సరళ. ముఖానికీ, పాదాలకీ పసుపు ఛాయ! రాధ వచ్చి, బొట్టూ, కాటుకా, అద్దం చూపించింది. ఎర్రటి బొట్టూ, కాటుకా దిద్దుకుని, జుత్తు చిక్కుతీసుకుంటోంది సరళ.

"రాధా, నువ్వు కూడా స్నానం చేసెయ్. అన్నయ్యకి మళ్ళీ ఆఫీసు టైమవుతుంది, నేను క్రిందకెళుతున్నా. కూరలబండి వచ్చింది,"అంటూ వర్ధనమ్మ కూరలబుట్ట తీసుకుని వెళ్ళింది.

రాధ బట్టలు పట్టుకుని స్నానాల గదికి వెళ్ళింది. ఆమె తలుపువేసిన చప్పుడవగానే, సత్యం ఒక్క వుదుటున



లేచి, సరళ దగ్గరికి వచ్చి, ఆమెని గాఢంగా కౌగిలించుకున్నాడు.

"ఏమిటిది? ఎవరైనా చూస్తారు," అంది సరళ తడబాటుగా.

"ఈ రెండునిమిషాలే మనకి లభించే' ఏకాంతం. వృధాపోనియ్యకు" అన్నాడు సత్యం ఆమె పెదవులు చుంబిస్తూ.

"మీ రిందాకటినించీ కొంగజపం చేస్తున్నారని తెలుసు," అంది సరళ నవ్వుతూ, అతన్ని తప్పించుకోవాలని చూస్తూ. ఆమెకి భయంతో, ఉద్వేగంతో చిరుచెమటలు పోస్తున్నాయి. ఆమె కళ్ళలో భయం అతన్ని మరింత కవ్వించింది. రెట్టింపు కోరికతో సత్యం భార్యని దగ్గిరకి తీసుకున్నాడు. కాని మరు క్షణమే వర్ధనమ్మ అడుగులు వినబడటంతో వారిద్దరూ విడిపోయారు. సరళ భర్త వదిలేసిన పేపరు పట్టుకుని వంటింట్లోకి పరిగెత్తి, పీటమీద కూర్చుని పేపరు ముందేసుకుంది. సత్యం అలమారా దగ్గిరకి నడిచి, షేవింగ్ సామాను తీసుకున్నాడు.

తువ్వాలు మరిచిపోయి, స్నానాల గదికి వెళ్ళి మరునిమషంలోనే బయటికి వచ్చిన రాధని వాళ్ళిద్దరూ చూడనేలేదు.

చూడకూడనిది చూసినట్టు రాధ

కించపడుతూ, సిగ్గుతో చువ్వాలు లేకుండానే తిరిగి స్నానాలగదికి వెళ్ళి తలుపు వేసుకుంది. కాని ఆమె చాలా సేపటిదాకా తేరుకోలేకపోయింది. సినిమాలో ఎంతోమంది స్త్రీపురుషులని అతి సన్నిహితంగా చూస్తూనేవుంటుంది. అప్పుడు ఉద్రేకంకంటే, ఒక రకమైన జుగుప్సా, వెగటూ కలుగుతుంది. కాని యీ రోజు రాధ మనసు అదోలా అయిపోయింది. మాటిమాటికీ అన్న సరళను గాఢంగా కౌగిలించుకుని, పెదవులమీద చుంబించడమే గుర్తుకు వస్తోంది.

రాధ బయటికి వచ్చేసరికి చుంపరగా మొదలైన వర్షం, ధారాపాతంగా కురవ సాగింది.

"అబ్బాయ్! యీ వర్షంలో ఎలా వెళ్తావ్? ఈ రోజు ఆఫీసు మానెయ్య కూడదా? కోడలు కూడా వచ్చింది," అంది వర్ధనమ్మ, పచ్చడి రుబ్బుతూ.

"ఇంట్లో కూర్చుని ఏం చెయ్యా లమ్మా, వెళ్ళిపోతాను" అన్నాడు సత్యం.

నిజమే కొడుకు ఇంట్లో వుండే ప్రయోజనం ఏమిటి? కొడుకూ, కోడలూ కాసేపు ముచ్చటలు చెప్పుకోడానికి కూడా యీ యింట్లో ఏర్పాటు చెయ్యలేదు.

కాని ఆ రోజు వర్షం నిమిషనిమి షానికీ హెచ్చిందేకాని, తగ్గలేదు. కుంభ వృష్టిగా కురుస్తున్న ఆ వర్షంలో సత్యం బయటికి కదలలేకపోయాడు. పదిగంటల దాకా చూసి, ఆఫీసు బట్టలు విప్పేసి లుంగీ కట్టుకు కూర్చున్నాడు.

ఇంట్లో అందరి భోజనాలు అయ్యాయి. వర్ధనమ్మ వంటింట్లో పని అవగానే, గుడ్డపెట్టి తుడిచింది. కాని వంటిల్లు తడిగానే వుంది. తలుపులు వేసేస్తే యింట్లో తడి ఆరదు. తెరిచి పెడితే, జల్లుకొట్టి మరింత తడి యింట్లో. చేసేదిలేక నలుగురూ ముందుగదిలోకే చేరారు. రాధా, సరళా కాసేపు కబుర్లు చెప్పుకుని, చివరికి చెరో పుస్తకం పట్టుకుని చాపలమీద వాలారు. వర్ధనమ్మ వంటింటి గుమ్మానికి చేరువగా ముడుచుకుని పడుకుంది. సత్యం పడక కుర్చీలో వాలి, కళ్ళకి చెయ్యి అడ్డం పెట్టుకుని ఆలోచనలలో పడ్డాడు.

పెళ్ళికి ముందు సత్యం ఎన్నో ఆలోచనలు చేసాడు. కాని యిలాంటి సమస్య వస్తుందని ఎక్కువగా ఊహించ లేదు. అతనిని వేధించిన సమస్యల్లా రాధ పెళ్ళి. చెల్లెలి పెళ్ళికానిదే తను చేసుకోకూడ దనుకున్నాడు. కాని రాధకి ఒక్క సంబంధమూ నిశ్చయం కాలేదు. అతనికి చిన్నప్పటినించి కమ్యూనిష్టుల వైపు కొంచెం మొగ్గు వుంది. వారి సాహిత్యమంతా చదివి, జీర్ణించు కున్నాడు. అతనికి కులవ్యవస్థ అంటే అయిష్టం. కట్నాలు యిచ్చి పుచ్చు కోవడం అసహ్యం. కట్నాలు యివ్వ

కుండానే పెద్దచెల్లి పెళ్ళి చేసాడు. అయితే బావగారు కావలసినవాడు. మేనత్త కొడుకు. సత్యంమీద అభిమానంతో అతని చెల్లెలిని వివాహమాడాడు. కాని రాధకి ఆ అదృష్టం కలిసి రాలేదు. కట్నాలు లేకపోయినా, లాంఛనాలు కావాలంటారు పెళ్ళికొడుకువారు. డబ్బు ఏ రూపంలో ఇస్తేనేం? ఇద్దరు స్త్రీ పురుషుల కలయిక ప్రకృతి సహజం. సృష్టికి మూలం. దానికి యీ డబ్బు పిశాచం అడ్డు ఎందుకు? సత్యం తనకి కట్నం, కానుకలు వద్దన్నాడు. వివాహంలో ధనం ఏ రూపంలోనూ గ్రహించనన్నాడు. అతని ఉన్నత భావాలు తెలిసిన ఆడపిల్లలుగల కుటుంబీకులు సత్యంచుట్టూ తిరిగారు. రాధ పెళ్ళికానిదే తను చేసుకోదలచుకోలేదు సత్యం. కాని ఎన్నాళ్ళు? అతనికి ముప్పై దాటాయి. ఆడకైనా, మగకైనా పెళ్ళికో వయసుంది. అతృతపడింది తల్లి. కూతురుకోసం, కొడుకు పెళ్ళి ఎన్నాళ్ళు ఆగుతుంది? తనకి కూతురూ, కొడుకూ సమానమే. రాధకి పెళ్ళివేళ ఎప్పుడు కలిసివస్తే అప్పుడే చేస్తుంది. సత్యాన్ని ఒప్పించి, పెళ్ళి చేసింది వర్ధనమ్మ.

పెళ్ళికానంతసేపూ వుండే వాంఛ వేరు. అప్పుడు ఎలా వుండగలిగేదో కాని, సత్యం యిప్పుడు సరళని చూస్తూ, కోరికతో వేగిపోతున్నాడు. ఆమె పొందుకోసం తహతహ ఎక్కువైంది. క్షణాలు యుగాలలా గడుస్తున్నాయి. కాని గంటలు గడిచినా, చీకటిపడినా, తనకి సరళతో ఏకాంతం ఎలా లభిస్తుంది?

వర్ధనమ్మ ముడుచుకుపడుకుందే కాని, కంటిమీదకి కునుకు రాలేదు. కొడుక్కి బలవంతంగా పెండ్లి చేసింది. కాని యీ సమస్యని ఎలా పరిష్కరించడం? గది ఏర్పాటు ఎలా? నిన్న రాత్రంతా ఆలోచించి గుమ్మానికి క్రింద మేకులు కొట్టి, తెరలకి తాళ్ళు కట్టి, మేకులకి బిగించి, తెర ఎగరకుండా వుంచవచ్చు, తలుపువేసినట్టే వుంటుంది అనుకుంది. కానీ యీ రోజు యీ కుంభవృష్టి కొంప ముంచుతోంది! రాత్రి తానూ, కూతురూ ఎక్కడ పడుకుంటారు? ఇటు కొత్త కోడలు – అటు వయసు వచ్చిన కూతురు! కోడలికి ఎంత సిగ్గుగా వుంటుందో, రాధకి అంత సంకోచంగా వుంటుంది. కాని ఏం చెయ్యడం? భగవంతుడా !! అనుకుంది నిట్టూరుస్తూ. గంటలు గడుస్తున్నకొద్దీ ఆమెకి తన అసహాయతమీద కోపం వస్తోంది. క్రొత్తగా పెళ్ళైన వారిద్దరినీ తాను వంచించినట్టు బాధ కలుగుతోంది.

సరళకి పుస్తకంలో అక్షరాలు గజిబిజిగా కనిపిస్తున్నాయి. మాటిమాటికి భర్త రూపం కనిపిస్తోంది. ఆమెకి ఉదయం భర్తచేసిన పని గుర్తుకువచ్చి, ఒకవైపు భయం, రెండో వైపు తీయని

ఊహా కదులుతున్నాయి. ఈ వర్షపు రాత్రి తమకి ఏకాంతం లభించడం అసంభవం. పాపం, అత్తగారూ, రాధా ఎక్కడికి వెళతారు? కాని సత్యం వాంఛ తనకి తెలుసు. అతని ఉత్తరాలలోనే అతని ఆతృత బయటపడుతోంది. ఏ రాత్రో, అందరూ పడుకున్నారని చెప్పి తన పక్కన చేరినా ఆశ్చర్యపోనవసరం లేదు. సరళకి తల్చుకున్నకొద్దీ భయం వేసింది. తానతన్ని ఎలా ఆపగలదు?

రాధ పుస్తకం ప్రక్కన పెట్టి, ప్రక్కకి తిరిగి కళ్ళు మూసుకుంది. ఆమె తలంతా గందరగోళంగా వుంది. నూతన దంపతులకి మధ్యగా, తనూ, తల్లీ!! సరళా, అన్నా ఏమనుకుంటు న్నారో? తల్లీ, కూతురూ పానకంలో పుడకల్లా వున్నారని తిట్టుకుంటున్నా రేమో! తానేం చెయ్యగలదు? వారిద్దరి మధ్యా ఎలా అడ్డు తొలగగలదు? ఎక్కడికి వెళ్ళగలదు?

అన్నగారిలాగే, రాధకీ కొంత ఆధునిక భావాలు వున్నాయి. కట్నం, కానుకలు లేకుండా తన పెళ్ళి జరగాలి. చేసుకునేవాడు డబ్బుకోసం కాకుండా తనని చూసే చేసుకోవాలి. రాధకి కాబోయే భర్త భోగభాగ్యాలమీద పెద్ద ఆశలు లేవు. అతను వుద్యోగస్తుడై, స్వతంత్రుడై, ఆమెని పోషించగల స్థితిలో వుంటే చాలు.

ఆమె కోరికలు చిన్నవైనా, రాధకి అనువైన- సంబంధం ఒక్కటీ రాలేదు. ప్రతివారూ, డబ్బుపరంగా ఏదో ఆశతో వున్నవారే. ఏమీ లేకపోతే పెళ్ళి పెద్ద ఎత్తున ఘనంగా చెయ్యండి అంటారు. తన పెళ్ళి పేరుతో అన్న కష్టార్జితం వృధాకావడం రాధకి యిష్టంలేదు. ఆమె బి.ఎ. చదివింది. కాని వుద్యోగం ప్రయత్నం ఒక్కటీ ఫలించలేదు. ప్రతి వుద్యోగానికీ రికమెండేషన్ కావాలి. లంచం కావాలి. 'నా తెలివితేటలూ, చదువూ చూసి వుద్యోగం ఎందుకు యివ్వరు?' అని బాధపడేది రాధ. చెల్లెలి వుద్యోగంకోసం యింకొకరి కాళ్ళుపట్టుకోవడం కాని పని సత్యానికి. ఇటు వుద్యోగం, అటు వివాహం లేకుండా మిగిలిపోయింది రాధ. 'నా కొడుక్కి లోకంలేదు' అనుకుంటుంది లోకజ్ఞానంతో అనుభవాలు పండిన వర్ధనమ్మ.

రాధకి విజయన్ గుర్తుకు వచ్చాడు. అతడు సత్యం స్నేహితుడూ, ఒక రకంగా శిష్యుడూ. ఒకసారి సత్యం రాధతో అన్నాడు. "నువ్వా విజయన్ పెళ్ళి చేసుకోకూడదా? అతనికి నువ్వంటే అభిమానమే." ఆమె కొంచెం తికమక పడింది. విజయన్ హరిజనుడు. తనకీ, అతనికీ పొత్తు కుదురుతుందా? "ఎందుకు కుదరదు రాధా! అతను చదువు కున్నాడు. వుద్యోగస్థుడు. మంచివాడు. నిన్ను బాగా చూసుకోగలడనే ధైర్యం



వుంది నాకు" అన్నాడు సత్యం. రాధ ఏం మాట్లాడలేదు. పుస్తకాలలో చదవటం వేరు, నిజంగా కార్యరూపంలో చేసి చూపడం వేరు.

చెల్లెలి మౌనాన్ని అర్ధాంగీకారంగా గ్రహించి సత్యం తల్లిముందు కదిపాడు ప్రసంగాన్ని. వర్ధనమ్మ ముఖం చిట్లించింది. "సత్యం, మనం ఎంతగా అన్ని కులాలవాళ్ళూ ఒక్కటే అన్నా, నిజానికి కలవడం కష్టం. వాళ్ళ భోజనం మన భోజనం వేరు. వారి ఆచారవ్యవహారాలు, మనవీ వేరు. పోనీ ఇవన్నీ కాదనుకున్నా, మనవాళ్ళంతా నాలుగు మాటలూ అంటారు" అంది.

"అమ్మా, నువ్వనుకునే కులాలు ఇప్పుడు లేవమ్మా.వున్నవి రెండే కులాలు మన సంఘంలో. డబ్బు ఉన్నవాళ్ళూ, డబ్బు లేనివాళ్ళూ. డబ్బంటే తక్కినవన్నీ కప్పబడిపోతాయి. అతను హరిజనుడు. ప్రభుత్వం వారికి యిస్తున్న కేటాయింపులతో తొందరగా ప్రమోషన్స్ వచ్చి, మా అందరికంటె విజయన్ ముందుకు పోగలడు. ఒక్కసారి అతను పెద్ద వుద్యోగస్తుడయ్యాడంటే, అతని పరపతి పెరుగుతుంది. సంఘం అతని చుట్టూ తిరుగుతుంది. ఇంక భోజనం అంటావా? అది భార్యాభర్తలిద్దరూ పరిష్కరించుకోవాలి. కొత్త సమాజం పునాదులేర్పడాలంటే కొంత త్యాగం, కొంత సర్దుబాటూ తప్పదు," అన్నాడు సత్యం.

కాని వర్ధనమ్మ సమ్మతించలేదు. రాధ మౌనంవహించడం చూసి, సత్యం మళ్ళీ ఆ ప్రసంగం తీసుకురాలేదు.

ఈ రోజు రాధకి విజయన్ గుర్తుకు వస్తున్నాడు నల్లగా పొడవుగా

నుదుటిమీద మచ్చతో వుంటాడు విజయన్. కాని అతను మాట్లాడుతూ వుంటే అతని మంచితనం, సహృదయతా ఎదుటి మనిషిని ఆకర్షిస్తాయి. రాధ అతని కెదురుగా కూర్చుని ఎన్నోసార్లు మాట్లాడింది. వాదించింది. కాని విజయన్ ఏనాడూ అసభ్యంగా కాని, హేళనగా కాని మాట్లాడలేదు.

పాలవాడి కేకతో లేచింది వర్ధనమ్మ. వర్షం తగ్గుముఖం పట్టింది.

ఎవరి ఆలోచనలతో వారు లేచారు. నిశ్శబ్దంగా వర్ధనమ్మ యిచ్చిన టీ తాగి, పనులలో పడ్డారు. వర్ధనమ్మ రాత్రి వంట ప్రయత్నం చేసింది. సరళా, రాధా ముఖాలు కడుక్కుని, జడలు వేసుకున్నారు. వర్షం తగ్గడం చూసి సత్యం బయటికి తిరగడానికి వెళ్ళాడు.

సత్యం వస్తూనే చేతిలోవున్న అరటి పళ్ళు తల్లికి యిచ్చాడు. వర్షం నిలిచి పోయింది. వర్ధనమ్మ తొందరగా భోజనాల హడావిడి ముగించి, వంటిల్లు శుభ్రంచేసింది. పొడిగుడ్డ పెట్టి రెండు మూడుసార్లు తుడిచింది. గోడ ప్రక్కగా ఆరినవైపు చాప పరిచి తనకీ, కూతురికీ పక్క పరిచింది.

రాధా, సరళా కబుర్లు చెప్పుకుంటున్నప్పుడు, సత్యాన్ని ముందు వరండాలోకి పిల్చి గుసగుసలాడింది వర్ధనమ్మ. "సత్యం, గుమ్మానికి క్రింద మేకులు కొట్టాను. తెరగుడ్డకి తాళ్ళు కట్టాను. రాత్రి ఆ మేకులకి తాళ్ళు కట్టెయ్. తెర కదలదు."

సత్యం తల్లి మాటలు వింటూ సిగ్గు పడ్డాడు. అన్నగారు గదిలోకి రాగానే, రాధ వంటింట్లోకి వచ్చి, తల్లి పక్కన పడుకుంది. వర్ధనమ్మ లైటు ఆర్పింది. తల్లీ, కూతుళ్ళకి ఆ ప్రక్క యిరుకుగానే వుంది. ప్రక్కగదిలో నూతన దంపతులు వున్నారని ఊహించుకోగానే రాధకి ఏదోలా వుంది. పక్కగదిలోంచి సవ్వడి లేదు.

"అమ్మా" అంది రాధ.

"వూఁ."

"నే నొక మాట చెప్తాను. ఏమీ అనుకోవు కదా!"

"వూఁ" వర్ధనమ్మ ఆశ్చర్యపోయింది.

"నేను విజయన్ని పెళ్ళి చేసుకుంటా."

వర్ధనమ్మ మాట్లాడలేదు. రాధ ఇలాంటి మాట చెపుతుందని ఆమె వూహించలేదు.

"నీకు నా పెళ్ళి సమస్యా తీరుతుంది, అన్నకి గది సమస్యా వుండదు." రాధే మళ్ళీ అంది.

వర్ధనమ్మకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. భర్తపోయిన తరువాత ఎన్నో సమస్యలు వచ్చాయి. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. అన్నీ నెట్టుకు వచ్చింది. కాని యీ చిన్నకూతురు పెళ్ళి సమస్య తనని పెనుభూతంలా పీడిస్తోంది.

"విజయన్ మంచివాడమ్మా, అన్నయ్యకి మంచి స్నేహితుడు."

నిజమే. అతను మంచివాడే. కాని అతని కులం!! తన పిల్లలతోపాటు తనూ మారాలి. క్రొత్త సంఘానికి పునాదిరాళ్ళు ఎవరో ఒకరు వెయ్యాలి. ఆ పునాది వేసేవారిలో తన కుటుంబం ఎందుకు ఒకటి కాకూడదు!! పునాదిరాళ్ళలో తన కూతురు సౌఖ్యం నలిగిపోవచ్చు. లేదా ఉన్నతంగా, ఆదర్శంగా లేచి నిలబడవచ్చు. క్రొత్త ప్రయోగాలు ఆచరణలో పెట్టినప్పుడు యీ సంశయం తప్పదు. కులస్థుడికి యిస్తే మాత్రం రాధ సుఖసంతోషాలతో కాపరం చేసుకుంటుందనే భరోసా ఎక్కడ? పెళ్ళే ఒక జూదం. వారి వారి అదృష్టాన్నిబట్టి వివాహం ఫలిస్తుంది.

అతనిది ఏ కులమైతే నేం! విజయన్‌ది మంచితనమే కులం.

"సరేనమ్మా, రేపు అన్నయ్యతో మాట్లాడుతా." వర్ధనమ్మ రాధ తలమీద చెయ్యివేసింది.

రాధకి చాలాసేపటిదాకా నిద్ర పట్టలేదు. పక్కగదిలో లైట్లు ఆర్పడం సత్యం మెల్లిగా వచ్చి పరదా తాళ్ళు బిగించడం కనిపెడుతున్న రాధ పెదవుల మీదకి నవ్వు వచ్చింది. ప్రొద్దుటినించీ వున్న సంక్షోభం ఆమె మనసులోంచి మాయమైంది.

ఆమె కళ్ళముందు సరళా, సత్యం కనిపించారు. కాని కాసేపటికే వారిద్దరి బొమ్మ చెదిరిపోయి, విజయన్, తనూ కనిపించారు. ఆ బొమ్మలో విజయన్ గుండెలమీద తలపెట్టుకుని రాధ సుఖ నిద్రలో వుంది. అతని చెయ్యి, ఆమెని పొదివి పట్టుకుంది.

కిటికీలోంచి ప్రశాంతమైన ఆకాశం, నక్షత్రాలూ కనిపిస్తున్నాయి. చంద్రుడు పైకి వస్తూ వెన్నెల రేస్తున్నాడు. రావిచెట్టు కొమ్మల చిగుట్లు వెన్నెలలో తళ తళ మెరుస్తున్నాయి. చెట్టుమీది పక్షులన్నీ గూళ్ళలో వెచ్చగా సుఖ నిద్రలో వున్నాయి.

కళ్ళలో వెన్నెల నింపుకుని, చక్కగా కళ్ళు మూసేసింది రాధ. ఇక ఆ వెన్నెల ఆమె కళ్ళలో కాపురం చేయాలనే ఆశతో.






# మొగలిరేకు

## యామిని

(గత సంచిక తరువాయి)

"అది ఇప్పుడు ఆలోచించలేవు!.... అయినా మన వాదనల వలన ప్రయోజనం ఏమిటి?"

రామమోహనరావులో బలవంతంగా పెనగట్టుకున్న శక్తి హఠాత్తుగా మాయమైనట్లుంది.

"నువ్వు ఇచ్చినమాట తప్పడంవలన నా కూతురు బ్రతుకు..." కంఠం వణుకుతూంది.

"బహుశా నేను బలహీనుణ్ణేమో!... కాని ఈ పెళ్లిమాత్రం జరగదు...." కేశవరావు తల తిప్పుకున్నాడు.

కీలు విరిగిన బొమ్మలా కూలబడిన మొగుణ్ణి చూడగానే కళ్ళు తుడుచుకుంది లక్ష్మిదేవి. దుఃఖం ఆగిపోయింది. అడగకుండానే విషయం తెలిసిపోయింది. కాలం ఇలా గడవకుండా ఆగిపోవడానికి వీలులేదు. ఏదో జరగాలి! ఈ పరిస్థితి మారాలి! ఏదో ఎవరో చెయ్యాలి!

వెంటనే ఆవిడ మనసులో మెరుపు లాంటి ఆలోచనవచ్చింది. తమ్ముడి కోసం వెదికింది. నెత్తిమీద నిలచిన అపకీర్తి తొలగిపోయినట్లే తోచింది.

"తమ్ముడూ! నువ్వన్నట్లు చివరకు నీకే రాసిపెట్టి ఉందేమోరా! మా పరువు నువ్వే కాపాడాలిరా! రుక్మిణిని పెళ్లి చేసుకోరా," అంది.

"ఇంత ధనవంతులు, ఇంతటి స్నేహితులు నిలబెట్టలేని మీ యింటి పరువును దిక్కులేనివాణ్ణి నేనెలా నిలబెట్టగలనక్కయ్యా! నా సాధ్యం కాదు," అన్నాడు నరసింహం.

"చచ్చిన పామును చంపకురా! ఈ ఒక్క సాయం చెయ్యరా." తమ్ముడి చేతులు పట్టుకుంది లక్ష్మిదేవి.

"నన్ను క్షమించు అక్కయ్యా!" నరసింహం అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

లక్ష్మిదేవి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. ప్రపంచాన్ని గురించి ఇన్నాళ్లా అర్థంకాని విషయమేదో అర్థం అవుతూన్నట్లనిపించింది ఆవిడకి.

తిరిగి మొగుడున్న గదిలోకి వెళ్ళింది. రామమోహనరావు అలాగే కూర్చు న్నాడు.

సరిగా అదే సమయంలో బయటనుంచి ఇంట్లోకి వస్తూన్న ఫిడేలు మాస్టారు కృష్ణ మూర్తి కనబడ్డాడు.

మహాప్రవాహంలో తల మున్కలుగా కొట్టుకొనిపోయే మనిషి నీటిలో తేలే వస్తువువైపు ఈదుకెళ్ళినట్లు అతనివైపు పరుగెత్తికెళ్ళింది.

శుభ సందర్భానికి ధరించిన ఆవిడ వస్త్రాలూ, నగలూ, చెదిరిన బొట్టూ, కనీళ్ళూ కాటుకతో అలుక్కొని పోయిన ఆవిడ ముఖం చాలా విపరీతంగా తోచింది కృష్ణమూర్తికి. అన్నాళ్ళూ అమాయకు డుగా వెర్రివాడుగా కనబడ్డ కృష్ణమూర్తి ఆ క్షణంలో ఆవిడ కళ్ళకి ఈ రాక్షస ప్రపంచంలో మిగిలి ఉన్న ఒకే ఒక మనిషిగా కనబడ్డాడు.

"మేష్టారూ! మమ్మల్నీ కష్టంనుంచి మీరే గట్టెక్కించాలి. ఇవి చేతులుకావు. కాళ్ళు! కాదనకండి!"

అతనికేమీ అర్థంకాలేదు. కాని ఆవిడ పరిస్థితి చూస్తే మాత్రం గుండెలు తరుక్కుపోయేటట్లుంది. ఒక వేళ తన ప్రాణాలిమ్మంటే మాత్రం ఎలా కాదనగలడు!"

"చెప్పండి! నేనేంచెయ్యగలను!"

"మా అమ్మాయి రుక్మిణిని పెళ్లి చేసుకోవాలి."

కృష్ణమూర్తి ఆలోచన నిలచి పోయింది. ఆ సందర్భానికి అయిన వాళ్ళందరూ అప్పటిదాకా పంచుకున్న 'షాక్' అతని మెదడులోకి ప్రవే శించింది. అతను ఏం విన్నాడో ఏం జవాబు చెప్పాలో తెలీలేదు. ఆలోచించు కోనిస్తే నే ఎక్కడ కాదంటాడోనని భయం పుట్టింది లక్ష్మీదేవికి.

"ఉదయం ఆరుగంటలకు ముహూ ర్తం. ఈ ముహూర్తానికే పెళ్లి జరిగి పోవాలి! అపుననండి. మీ సహాయానికి జన్మంతా ఋణపడిఉంటాం."

"నన్నాలోచించు కోనివ్వండి." తను మాట్లాడగలిగిన ఒక్కవాక్యం మాట్లాడేడు కృష్ణమూర్తి.

మళ్ళీ లక్ష్మీదేవి మొగుడిదగ్గర కెళ్ళింది.

"ఫిడేలు మాస్టారు కృష్ణమూర్తిగారు రుక్మిణిని పెళ్లి చేసుకుంటానన్నారు. ఈ ముహూర్తానికే పెళ్లి చేసేద్దాం," అంది లక్ష్మీదేవి.

మొదటిసారిగా చలనం వచ్చింది రామమోహనరావులో.

## 4

తలుపుతీసిన మాణిక్యం అర్ధరాత్రి పూట కృష్ణమూర్తిని చూసి ఆశ్చర్య పోయింది.

"రాధతో మాట్లాడాలి." అన్నాడతను నిర్వికారంగా.

ఆమె ఆశ్చర్యంలోనుంచి కోలు

కొనే లోపలే అతను లోపలికి వెళ్ళి పోయేడు. మాణిక్యం వెనకాలే వెళ్ళింది.

జరిగిందంతా చెప్పేడు కృష్ణమూర్తి.

"ఏం ఆలోచించుకున్నారు?" రాధ అడిగింది.

"నాకు తెలియటంలేదు."

"మీకు రుక్మిణి అంటే ఇష్టమా?"

"నేనెప్పుడూ ఆ దృష్టితో ఆలోచించలేదు. కాని నా విషయం ముఖ్యం కాదు. ఆమెకు ఈ ముహూర్తానికి పెళ్లి కాకపోతే ఇన్నాళ్ళూ ఓ అంతస్తుకూ హోదాకూ అలవాటుపడినవాళ్ళు ఏమయి పోతారో...."

"అయితే చేసుకోండి."

"నీకు కష్టంగా ఉందా?"

"నాకు మీరెవరితో ఉన్నా కష్టంగానే ఉంటుంది. కాని ఈ కులంలో ఈ జన్మ ఎత్తినందుకు ఇన్నాళ్ళు ఈ బతుకు బ్రతికి నందుకు మిమ్మల్ని నేను చేసుకో లేను...."

"కాని నిన్ను మరచిపోవడం నా కెంత కష్టమో నాకు తెలీదు."

"తెలుసు. కాని ఒక్కమాట గుర్తుంచుకోండి. ఒకరి రక్షణ కోసం మీ రిది చేస్తున్నప్పుడు మీ సుఖం ప్రసక్తే లేదు. వాళ్ళ పరువూ మర్యాదా నిలబెట్టడం కోసమేకదా మీ రీ పని చేస్తూన్నది! దాన్ని నిలబెట్టడం కోసమే మీరు మళ్ళీ ఈ గుమ్మం తొక్కకూడదు...."

"రాధా!"

"నేను కోపంతో అంటున్నానని అనుకోవద్దు. నాకు ఎప్పుడూ మీ చేతుల్లో వాలిపోవడం ఇష్టమే. కాని మీరు ఇందులో ఓడిపోవడం నాకిష్టంలేదు.... ఇంకో విషయం మీ బిడ్డని నేను కడుపులో దాచుకున్నాను. బిడ్డను కని ఇద్దరం సవ్యంగా ఉంటే ఏడాదికోసారి ప్రతీ పుట్టినరోజుకూ ఒక్కసారి మిమ్మల్ని చూసుకోనివ్వండి. ఒకవేళ నేను మిగలకపోతే బిడ్డనిమాత్రం మీరు ఎలాగో తీసుకొని వీటన్నింటికీ దూరంగా ఉంచండి! అంతే! మీరు వెళ్ళిరండి."

"రాధా!" కృష్ణమూర్తి గాఢంగా కౌగిలించుకున్నాడు. రాధ చెక్కిళ్ళమీద నుండి కన్నీళ్ళు దారం తెగిన పూసల్లా జారిపోయేయి.

కృష్ణమూర్తి వెళ్ళగానే మాణిక్యం రాధ మీదకి పెద్దపులిలా లేచింది. తన కళ్ళల్లో కారం చల్లిందంది. వెంటనే కడుపు దింపించుకోమంది.

రాధ ఎదురు తిరిగింది. ఇప్పుడామె కృష్ణమూర్తి విషయంలో తల్లికి భయపడనవసరంలేదు. ఎలాగూ అతని పొందుతానే దూరం చేసుకుంది. అందుకనే స్పష్టంగా మనసులో మాట చెప్పేసింది.

"ఇన్నాళ్ళూ నీ మాట తుచ తప్ప కుండా విన్నాను. ఇకముందు కూడా నీ వ్యాపారం అడ్డులేకుండా సాగాలంటే నా మాటకూడా నువ్వు వినవలసి ఉంటుంది. నేనీ బిడ్డని కని తీరాలి. ఒకవేళ నా

కడుపులో పిండానికి నువ్వు కీడు తలపెడితే నా ప్రాణం నేనే తీసుకుంటాను. నాకు నా బిడ్డ కరువయిన రోజే నీకునీ బిడ్డ కూడా కరువై పోతుంది. అదీ కాక, ఆయన ఎప్పుడిక్కడికి వచ్చినా ఏమాత్రం అమర్యాద జరిగినా ఆ రోజుతో నీకూ నాకూ సరి!"

దాంతో మాణిక్యం నోటికి తాళం పడింది.

## 5

కాలచక్రంలో అయిదేళ్ళు తిరిగి పోయేయి.

రుక్మిణి పెళ్ళయిన రోజునుంచీ నరసింహం ఇంట్లోంచి మాయమయ్యేడు. ఎక్కడికి వెళ్ళేడు ఎందుకు వెళ్ళేడు అన్న విషయం ఎవరూ పట్టించుకోలేదు.

రామమోహనరావు సుప్రీంకోర్టుకు అప్పీల్ చేసేడు. ఈ లోపులో ఆయన లాయరు హైకోర్టు ఇచ్చిన తీర్పును క్షుణ్ణంగా పరిశీలించి ఏడాది కొంత నియమితమైన డబ్బును ఖర్చుచేసుకుంటూ మిగిలిన ఆదాయం అంతా కోర్టులో డిపాజిట్ చేయవలసి ఉంటుందన్న విషయం చెప్పేడు.

ఏదో కోటలాంటి ఆ యింట్లో గుట్టు బయట పడకుండా కాలక్షేపం అయిపోతూంది.

రుక్మిణికి ఓ మగపిల్లవాడూ ఆడపిల్లాను. పిల్లవాడికి మూడేళ్ళు, పిల్లకి ఇంకా ఏడాది నిండలేదు.

రాధ పనసపండులాంటి కొడుకును కంది. పంచప్రాణాలూ వాడిమీద పెట్టుకొని పెంచుకుంటూంది.

మాణిక్యం నాలుగునెలలు మంచం పట్టి కన్నుమూసింది. కన్నతల్లి కనుక ఆ రోజు కన్నీరు కార్చినా రాధకు ఓ పెద్ద బరువు మనసులోంచి దింపినట్లయింది. మకాం మార్చలేకపోయినా మనసు పూర్తిగా మారిపోయింది. వృత్తిలో నుంచి తప్పుకుంది.

రాధతో ఒప్పుకున్న ప్రకారంగా కృష్ణమూర్తి రాధ కొడుకు ప్రసాదు పుట్టినరోజుకు తప్పక ఆమె యింటికి వెడతాడు. ఆమెతో మనసువిప్పి ముచ్చటించి ఓ గంట ఫిడేలు వాయించి వచ్చేస్తాడు.

ఇంటివగ్గర ఏదో చీకటిలో చేసిన తప్పుకు పిల్లలు పుట్టడమే కాని కృష్ణమూర్తి, రుక్మిణీ ఇద్దరు పరిచయస్తుల కంటే సన్నిహితంగా రాలేకపోయేరు. కృష్ణమూర్తికి అందుకనే ఏమాత్రం భావావేశం కలిగినా కళ్ళు మూసుకొని రాధను మనసులో ప్రతిష్ఠించుకొని ఫిడేలు తనచేతిలోకి తీసుకొని తన ప్రపంచంలోకి వెళ్ళిపోతాడు.

ఆ రోజు ప్రసాదుకు అయిదేళ్ళు నిండేయి. ఆ రోజుకోసం ఎదురుచూస్తూ కృష్ణమూర్తి వారం రోజులుగా సరిగా నిద్రపోలేదు. పిచ్చెక్కిన వాడిలా ఎప్పుడూ ఫిడేలు వాయిస్తూ హార్మ్యం

టూంటే ఒకటిరెండుసార్లు రామమోహన రావు కొంచెం వినుకున్నాడు కూడాను.

మధ్యాహ్నం మూడు గంటలకు పల్లపు వీధిలోకి వెడుతూన్న కృష్ణ మూర్తిని చూసి ఆశ్చర్యపోయాడు రామ మోహనరావు. వెంటనే తన కూడా ఉన్న పాలేరు సింహాద్రికి కనుసైగ చేసేడు. సింహాద్రి కనబడకుండా కృష్ణమూర్తిని వెంబడించి రాధ యింట్లో అద్దెకుంటున్న బంగారి ఇంట్లో దూరేడు. కృష్ణమూర్తి వెళ్ళగానే రాధ పాదాలపై పడిపోయి కన్నీళ్ళతో అభిషేకంచేసింది. మనసులో ఉన్న విరహమంతా మాటల్లోకి అనువదించి చెప్పింది. ఆప్యాయంగా తాను చేసిన పిండి తినిపించింది.

"నాన్నకు దండంపెట్టు!" అని పసివాణ్ణి తీసుకొచ్చి పాదాలమీద పారేసింది.

కృష్ణమూర్తి హృదయం అనురాగంతో కరగిపోయింది.

రాధ ఫిడేలు తీసుకొచ్చి చేతికిచ్చింది.

"నను పాలింపగ నడచివచ్చితివా..." త్యాగరాయ కృతి వాయించమంది. రెప్పలార్పక తనవైపే ఆరాధనతో చూస్తూన్న రాధ కళ్ళతో కళ్ళు కలిపి కృష్ణమూర్తి ఫిడేలు తీగెల మీదకు కమాను ఆన్చేడు.

భూమిలోంచి జలగా పుట్టి నిండిన ...ఘ్నులాగా గదంతా సంగీతంతో ...యింది. రాధ సర్వం మరచి మోహనరాగంలోని మాధుర్యంలో పరవశించిపోయింది.

"....వనజనయన నీదు మోము చూచుటే...." హెచ్చుస్థాయిలో రిషభం, గాంధారం చుట్టూ తిరిగి దానితో ఐక్యమైపోయిన భ్రమ కలిగిస్తూంటే దేహాలు వేరయినా మనసులు ఏకమైపోయి భావావేశంతో ఆనందబాష్పాలు రాధ చెక్కిలిమీదనుంచి దొర్లిపోయాయి.

ఏడాదికి ఇటువంటిరోజు ఒక్కటే చాలు ననిపించింది కృష్ణమూర్తికి. ఇంటికి వెళ్ళేసరికి చీకటి పడిపోయింది.

వీధి వసారాలో రామమోహనరావు ఆకలిగొన్న పులిలా తిరుగుతున్నాడు.

కృష్ణమూర్తి వసారాలోంచి తన గదిలోకి వెళ్ళబోతున్నాడు.

"కృష్ణమూర్తీ!" ఉరిమినట్లు పిలిచిన మామగారి పిలుపువిని ఉలిక్కిపడి అటు తిరిగి "పిలిచేరా?" అన్నాడు కృష్ణమూర్తి.

"అవును. ఇప్పుడు నువ్వెక్కడినుంచి వస్తున్నావు?" పగలబోయే అగ్నిగోళంలా ఉన్న మామగారిని చూసి తడబడ్డాడు కృష్ణమూర్తి. మాట రాలేదు. నేలచూపులు చూసేడు.

"పల్లపు వీధినుండా?" రామమోహనరావు అడిగేడు.

"అవును."

లోపలనుంచి లక్ష్మీదేవి, రుక్మిణి వచ్చి నిలబడ్డారు.

"రాధ యింటిదగ్గర్నుంచా?"

"అవును."

"దాని కోసం ఫిడేలు వాయించి వస్తున్నావా?"

"అవును."

"దాని కొడుకు నిన్ను 'నాన్నా!' అని పిలిచేడా?"

"పిలిచేడు."

"వాడు నీ కొడుకేనా?"

"అవును."

తక్షణం ఈ యింట్లోనుంచి వెళ్ళిపో! నువ్వొకప్పుడు ఈ యింటికి సంబంధించిన వ్యక్తివన్న మాట మరచిపో!" అన్నాడు రామమోహనరావు. అతని గొంతు చీలిపోతున్నట్లనిపించింది.

"ఏమండీ!" అంటూ భర్త దగ్గరకు రాబోతూన్న రుక్మిణిని "రుక్మిణీ! లోపలకు పో!" అని బాధగా గుండె చేత్తో పట్టుకొని అరుస్తూన్న తండ్రిని చూసి భయపడి ముందడుగు వేయలేక పోయింది.

లక్ష్మీదేవి భర్తను పట్టుకుంది.

కృష్ణమూర్తి కట్టుబట్టలతో బయటకు వెళ్ళిపోయాడు.

అరగంట క్రితమే తన యింటిలోంచి వెళ్ళిన కృష్ణమూర్తిని మళ్ళీ వాకిట్లో చూసి ఆశ్చర్యపోయింది రాధ.

"ఏమిటండీ ఇది?" అంది.

"వచ్చేసేను రాధా! ఎప్పటికీ నీతో ఉండాలని వచ్చేసేను."

"ఎంతపని చేసేరండీ!"

"నేనేం చెయ్యలేదు. అంతా వాళ్ళే చేసేరు. నేను ఒకప్పుడు వాళ్ళమనిషినన్న మాటే మరచిపొమ్మన్నారు...."

"ఎందుకు?"

"నన్నింకేమీ అడగొద్దు."

"రండి. లోపలకు రండి."

ఆ రాత్రి రాధ మనసు ఒకవైపు ఆందోళనతోనూ మరోవైపు ఆనందంతోనూ ఊగిసలాడింది.

చివరకు జరిగింది విన్నతరువాత తమ తప్పేమీ లేకపోయినా ఇలా జరగడం దైవసంకల్పమేనని సరిపెట్టుకుంది.

కృష్ణమూర్తి అసావేరి రాగంలో "రారా మా యింటి దాక...." భైరవిలో "....ఉపచారము చేసేవారున్నారని మరువకురా...." వాయిస్తూంటే తన మనసులో భావాన్నే చెప్తూన్నట్లు తన్మయత్వం చెందింది.

మనసులకు అన్నిరకాలైన సంకెళ్ళూ తెగిపోగానే ఆ రాత్రి రాధా, కృష్ణమూర్తీ సుఖసాగరంలో మునిగితేలేరు.

## 6

భార్యా వియోగంతో పూర్తిగా మనసు చెదిరిపోయి మరేదో చివరి దెబ్బ కోసం ఎదురు చూస్తూన్నట్లు రోజులు నెట్టుకొస్తున్నాడు రామమోహనరావు. చివరకు అదీ రానేవచ్చింది. సుప్రీం కోర్టుకూడా తనకు వ్యతిరేకంగా తీర్పు

చెప్పిందని తెలిసిన తర్వాత వివరాలు తెలుసుకోకుండానే అతను కన్ను మూసేడు.

ఇంతటి విపరీత పరిస్థితుల్లో కృష్ణమూర్తి ముందుకొచ్చి అన్నీ కలుగజేసుకొని చివరికి ఆ కోటలోంచి భార్య పిల్లలతోనూ వద్దంటూంటే కూడా వచ్చిన పనిమనిషి సీతాలుతోనూ ఓ పెట్టెడు బట్టలతోనూ బయటికొచ్చి ఊరి చివర చిన్న ఇంట్లో తల దాచుకున్నాడు.

మనసు తెరిపి అయ్యేటట్లు పూర్తిగా ఏడవడానికి కూడా సమయం దొరకని రుక్మిణి ఆ రాత్రి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. ఓదార్చబోయిన కృష్ణమూర్తిని పట్టలేని ఉక్రోషంతో అనరాని మాటలంది. తన బ్రతుకంతా అతడే నాశనం చేసేడంది. పిల్లలకింత విషంపెట్టి తాను తిన్నా వదిలిపోయేదంది. తనకు ఒక్క నిముషం బ్రతికుండడమే ఇష్టంలేదంది. తానింక కొన్నిరోజులు బ్రతికుండాలంటే తనవేపు చూడనే వద్దంది. కృష్ణమూర్తి పూర్తిగా దెబ్బతిన్నాడు. బాధ్యత వదుల్చుకొని రాధ దగ్గిరకు పోలేకా సహకరించని భార్య బాధ్యత తీసుకోలేకా మధనపడ్డాడు. చేయని నేరాలకు నిందలు భరించలేకపోయాడు.

తెల్లవారేసరికి నిర్జీవంగా ఉన్న కృష్ణమూర్తి శరీరాన్ని చూసి రుక్మిణి చేష్టలు దక్కి నిలబడిపోయింది. ఇది తెలిసిన రాధ అందరిలోనూ అతన్ని అవమానపరచినట్లు అవుతుందని రాలేక ఒక్క సారయినా చూడకుండా ఉండలేకా గట్టుమీద పడిన చేపలా గిలగిలలాడింది. వలవలా ఏడ్చింది. ఆస్థి ఉన్నన్నాళ్ళు చెరువులో కప్పల్లా చేరిన బంధువులు ఒక్కరుకూడా ముఖం చూపించకపోయేసరికి బంధుకోటి మీద అసహ్యం పుట్టింది. కళ్ళు మూసుకొని నిద్రపోతూన్నట్లున్న భర్తముఖాన్ని చూస్తూంటే తానే ఏదో తప్పుచేసినట్లు అనిపించింది. అసలు భర్తముఖాన్ని అంత పరిశీలనగా ఒక్కసారయినా బ్రతికుండగా చూసేనా అనిపించింది. అతని శవంమీదపడి ఘోరున ఏడవడం మొదలు పెట్టింది. కాని ఆ శవం కదిలే మార్గం కనబడలేదు.

చివరకు మింగలేని దుఃఖాన్ని దిగమింగుకొని రాధే ఊళ్ళో ఒకరిద్దరి దగ్గరకు వెళ్ళి బ్రతిమాలి కృష్ణమూర్తి అంత్యక్రియలకు ఏర్పాటు చేసింది. అప్పుడే అలుముకుంటూన్న చీకట్లలో చితిమంటల వెలుగులో పసివాడిని అక్కున చేర్చుకొని దిక్కులేనిదానిలా విలపించింది రాధ.

పదిహేను రోజులు గడిచేయి. అన్నీ అయిపోయేయి. ఏది ఎలా జరిగిందో రుక్మిణికి తెలియదు. ఎవరో వచ్చేరు. ఏదో చేసేరు. అంతే!

ఆ రోజు పెరటి గుమ్మంలో కూర్చుని పిల్లని ఒళ్ళో వేసుకుని పాలి

స్తూంది ఎందుకో భర్త పదేపదే దీనంగా గుర్తుకొస్తున్నాడు. అతని మనసేమిటో అసలు తనకు అర్థం కానేలేదు. విలువ తెలియకనే విలువైన వస్తువేదో చేజే తులా పోగొట్టుకున్నట్లుంది.

అడుగుల చప్పుడయితే తలతిప్పి చూసింది. మసకచీకట్లో మనిషి గుర్తు తెలీలేదు. అందంగా ఎత్తుగా ఉందామె. ముఖం మాత్రం దిగులుతో చిన్నబోయి ఉంది.

ముందుకువంగి ఆమె రుక్మిణి కాళ్ళ దగ్గర కొంతడబ్బు పెట్టింది. రుక్మిణికి కొరడాతో కొట్టినట్లు అయింది.

"రాధ నువ్వేనా?" అని అడిగింది.

"అవును." అంది రాధ తలవంచు కొనే.

"ఏం తల్లీ! నేను ఇలా కూడా ప్రాణంతో ఉండడం ఇష్టలేదా నీకు!.."

రుక్మిణి మాటలు ఇంక వినలేక పొంగి వస్తూన్న దుఃఖాన్ని దాచుకుంటూ గిరు క్కున వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది రాధ.

ఆ డబ్బు చూస్తే తేళ్ళూ జెర్రులూ వొళ్ళంతా పాకినట్లనిపించింది రుక్మిణికి. సీతాలుకిచ్చి పంపించెయ్యాలని అను కుంటూ చీకటిపడినా చాలాసేపు అలాగే కూర్చొని కూర్చొని ఇంట్లోకి వెళ్ళింది రుక్మిణి.

ఇంట్లో ఉన్న ఆఖరు సోలెడూ వండి ఆ రోజు పిల్లలకు పెట్టి తాను తిన కుండానే పడుకుంది.

తెల్లవారగానే సీతాలు వెళ్ళి సరుకులు తీసుకువచ్చింది. మధ్యాహ్నం భోజనంచేసి లేవబోతూ గూట్లోపెట్టిన డబ్బు తీసుకెళ్ళి రాధ కిచ్చేసి రమ్మని రోషంగా సీతాలుతో చెప్పింది రుక్మిణి.

ఆ డబ్బుతోనే సరుకులు తీసుకొచ్చే నని సీతాలు చెప్పగానే తెల్లబోయింది.

నెలరోజులు గడిచేయి.

మరో రోజు సాయంత్రం పెరట్లో ఎవరో తారట్లాడుతూన్నట్లు అనిపించ గానే అటు వెళ్ళిన రుక్మిణికి మళ్ళీ రాధ కనబడింది. రుక్మిణిని చూడగానే డబ్బు పెరటి అరుగుమీద పెట్టేసి తొందరగా వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది రాధ.

అక్కడే గంటల తరబడి అర్థంలేని ఆలోచనలతో కూర్చుని చివరకు డబ్బు తీసుకొని లోపలకు వెళ్ళింది.

ఆరు నెలలు అలాగే గడిచి పోయేయి.

ఓ రోజు రాధ డబ్బిచ్చి వెడుతూంటే ఆగమంది రుక్మిణి. రాధ ఆగింది.

"కూర్చో!" అంది రుక్మిణి.

రాధ దూరంగా కూర్చుంది. రుక్మిణి రాధను తేరిపార చూసింది. ఆమె అందా నికి ఆశ్చర్యపోయింది. రాధ తల వంచు కొనే ఉంది.

"ఎందుకు మాకిలా సాయంచేస్తు న్నావు?" అంది రుక్మిణి.

"మీరు ఇబ్బందిలో ఉన్నారని."

"ఈ డబ్బు నేను తిరిగి ఎప్పటికీ ఇయ్యలేకపోవచ్చు."

"ఇయ్యనక్కరలేదు."

"నీ కెందుకు ఇంత అభిమానం!"

"ఇది ఆయన సంసారమని."

"ఆయన సంసారానికి నీ వలన ఎంత కీడు జరిగిందో తెలుసా?"

"మీ కన్నీ తెలియవమ్మా! మీ పెళ్ళికి ముందే ఆయన నా వాడు. పీటలమీద పెళ్ళి ఆగిపోయినప్పుడు మీ అమ్మగారు ఆయనను బ్రతిమాలగా ఆ రాత్రి నా అనుమతి తీసుకొని మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నారు. అప్పటికే ఆయన బిడ్డ నా కడుపులో ఉన్నాడు. తర్వాత మీ పరువు నిలబెట్టాలనే ఉద్దే శంతోనే ఆయనను విడచి ఉండలేని నేను నా గడప తొక్కొద్దన్నాను. కాని ఏడాదికోసారి మాత్రం నా ముందు కూర్చొనివెళ్ళమన్నాను.అంతేనమ్మా...." రాధ కళ్ళల్లో నీళ్ళు చూడగానే రుక్మిణి హృదయం ద్రవించిపోయింది.

అందరి కళ్ళు తమమీదే ఉన్నాయని ఆరునెలల తర్వాత రాధా రుక్మిణీ ఆ వూరు విడచి పిల్లలతో వెళ్ళిపోయేరు.

## రెండవ భాగం

## 1

విందు ముగిసింది. విందు అయ్యే లోపల మాలిని నాలుగైదుసార్లు రాజా రావుగారి దగ్గరకొచ్చి వడ్డించి కొసరి కొసరివేసి ఎంతో మర్యాద చూపించింది.

ఆ తర్వాత లాన్స్‌లో కుర్చీలు వేసుకొని కూర్చొని మాట్లాడుతూండగా

మెల్లగా నరసింహం అసలు విషయం బయటపెట్టేడు.

"మా అమ్మాయి మాలినికీ మీ అబ్బాయి ఆనంద్‌కీ ఈడూ జోడూ కుదిరి చూడ ముచ్చటగా ఉంటారను కుంటున్నాను మీరు మాలినిని చూసే ఉంటారు!...."

"అమ్మాయికేం! బంగారుబొమ్మ."

"మరయితే...."

"చేసుకొనేది అబ్బాయిగా! వాడినో సారి అడిగి చూద్దాం! వాడు సరేనంటే నా అభ్యంతరం ఏమీలేదు," అన్నాడు రాజారావు.

నరసింహం మనసు తేలికపడింది.

"అయితే అబ్బాయినోసారి తీసు కొస్తే బాగుంటుంది," అన్నాడు.

"చూద్దాంలెండి! నేను వాడితో మాట్లాడి మీకు చెప్తాను." అంటూ రాజారావు లేచేడు.

మాలిని మళ్ళీ వచ్చి ఎంతో వినయంగా నమస్కరించింది. రాజారావు ఈసారి ఆమెను పరిశీలనగా చూసి

మార్చి నెల యువ

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 25.00

ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి




గమనిక : వ్యాఖ్యలు పోస్టుకార్డు మీదనే వ్రాయాలి.
జనవరి 20 వ తేదీ లోపు మాకు చేరాలి.

తృప్తిగా అర్థయుక్తంగా నవ్వేడు నరసింహం వైపు చూసి.

నరసింహం క్రొండెక్కేసేడు.

ఆనాడు దిక్కులేనివాడుగా బావగారింట్లో చేరి అప్రయోజకుడుగా బ్రతికిన నరసింహం ఏదో చేతనైన వ్యాపారం చేతపట్టి తానూ బావగారి అస్తంత ఆస్తి సంపాదించేడు. శ్రీమంతుడు రాజారావుతో వియ్యమందితే దానికో గుర్తింపు కలుగుతుంది.

రాజారావు కొడుకు ఆనంద్ బ్యాంకులో ఆఫీసరు.

ఆ రాత్రి భోజనాల దగ్గర రాజారావు కొడుకుదగ్గర పెళ్లి మాట తీసుకొచ్చేడు. ఇప్పుడేం తొందర అని ముందు దాటెయ్యబోయిన ఆనంద్ సంబంధం వివరాలు విని మనసులో మాట చెప్పెయ్యడం మంచిదని ఆలోచించి చెప్పేసేడు. తను పని చేస్తూన్న బ్యాంకు ఎదురుగా ఉన్న ఆఫీసులో పనిచేస్తూన్న సుశీల అనే అమ్మాయిని తాను వరించినట్లు చెప్పి ఆ సంబంధంకోసం ప్రయత్నం చెయ్యమని సూచించేడు.

మర్నాడే వివరాలు తెలుసుకొని రాజారావు వెతుక్కుంటూ రుక్మిణి ఇంటికి వచ్చేడు. సుశీలను చూడగానే పేరుకు తగిన పిల్ల అనిపించింది. వెంటనే సంబంధం ఖాయం చేసుకొని తాంబూలాలు పుచ్చుకున్నారు.

‘రుక్మిణి సంతోషానికీ, రాధ సంతోషానికి అంతులేదు. మగపిల్లలిద్దరూ ఏదో ఉద్యోగాలు చేసుకుంటున్నారు. వాళ్ళ దారి వేరు. సుశీల ప్రస్తుతానికి ఉద్యోగం చేస్తూన్నా ఏ యింటి కెడుతుందో అన్న ఆలోచన పీకుతూనే ఉంది. వెదకబోయిన తీగె కాలికి చుట్టుకున్నట్లయింది. పదిరోజుల తర్వాత ఆనంద్ పిల్లను చూసుకోడానికి ఎప్పుడొస్తున్నాడని అడుగబోయిన నరసింహం చేతిలో రాజారావు శుభలేఖ పెట్టేటప్పటికి నరసింహం పై ప్రాణం పైనే పోయింది.

“ఈ రోజు పిల్లలకి మనం చెప్పవలసిందేంలేదండి! వాళ్ళ అవసరాలు వాళ్ళే చూసుకుంటారు! మనం ఊరికే పెద్దరికం నిలబెట్టుకుంటూ సరేననడమే.” అని మాటల సందర్భంలో రాజారావు అన్నప్పుడు చేసేదిలేక సై అంటూ తాళంవేసేడు నరసింహం.

“ఇవన్నీ మనసులో పెట్టుకోక పెళ్లికి తప్పక రావాలి సుమా! ఎవరికెక్కడ ఘటనో అక్కడ అవుతుంది. చేరవలసిన చోటికి వాళ్ళను చేర్చడంలో మనం నిమిత్తమాత్రులం ....” అని రాజారావు అంటూంటే వెళ్లొస్తానని లేచేడు నరసింహం. రాధ కొడుకు ప్రసాదూ, రుక్మిణి కొడుకు శ్రీనివాసూ ఒక్కగానొక్క చెల్లెలు సుశీల పెళ్లి ఘనంగా జరిపించేరు. పెళ్లికి వచ్చిన నరసింహం రుక్మిణిని చూసి ఆశ్చర్యపోయాడు.

ఇక్కడకూడా తనకు రావలసినదాన్ని ఆమె రానీకుండా చేసినట్లు ఊహించుకొని మనసునిండా ఉక్రోషం పెంచుకున్నాడు.

ప్రసాదును చూడగానే సంగీతం మాస్టారు కృష్ణమూర్తి గుర్తుకొచ్చేడు.

అదే రూపం, అదే రంగు, అదే పొడవు! వేషం మార్చుకొని వచ్చినట్లుగా ఉన్నాడు.

"మీ అబ్బాయి అంతా వాళ్ళ నాన్న పోలికే!" అన్నాడు ప్రసాద్‌ను రెప్పవాల్చకుండా చూస్తూ.

రుక్మిణి గుండె గతుక్కుమంది.

ఈ లోపులో 'అమ్మా' అంటూ ఏదో పనిమీద శ్రీనివాసు అక్కడికి వచ్చేడు. నరసింహం ఆశ్చర్యంగా చూసేడు.

"నీకు ఇద్దరు కొడుకులా?" అన్నాడు రుక్మిణితో.

"లేదు. ఒక్కడే. వీడే మావాడు," అంది శ్రీనివాస్‌ను చూపించి.

"మరి వాడు..." అంటూ ప్రసాద్‌ను చూస్తూ ఉండిపోయాడు నరసింహం.

వెంటనే అతని మనసు పని చెయ్యడం మొదలుపెట్టింది. తాను బావగారిల్లు విడిచినప్పటినుంచి విన్న కథలన్నీ గుర్తుకొచ్చేయి. ఆనాడు తాను సంగీతం మాస్టారు కృష్ణమూర్తిని మేజువాణిలో కూర్చోపెట్టిన దృశ్యం గుర్తుకొచ్చింది. రాధ గుర్తుకొచ్చింది. కృష్ణమూర్తి ద్వారా రాధకు రుక్మిణి పెళ్ళి కాగానే పిల్లవాడు పుట్టేడన్న విషయం గుర్తుకొచ్చింది. ఆ తర్వాత విన్న

కథలూ తెలిసిన నిజాలూ ఎక్కడికక్కడ చక్కగా ఇమిడిపోయేయి.

వికృతమైన ఆలోచనలతో నరసింహం ముఖం వెలిగింది. ఆ రాత్రి ఎందుకో రుక్మిణి సరిగా నిద్రపోలేక పోయింది. రాధకీ విషయం తెలీనేలేదు.

## 2

పోలీసు స్టేషను బయట అంతా గోలగా ఉంది. మధ్యలో ఎవరో స్త్రీ కంఠం వినబడుతూంది.

ప్రసాద్‌కి ఉద్యోగంలో చేరిన నెల రోజులకే ఈ గోలంతా అలవాటయింది. అధికారంతో దర్పంగా మాట్లాడుతూ స్టేషనుకు తెచ్చిన నేరస్థులపట్ల కాస్త నీచమైన భాష ఉపయోగించడం అక్కడ మామూలే. కాని వాళ్ళ కంఠాన్ని మించి అరుస్తూన్న స్త్రీ కంఠమే ఆశ్చర్యం కలిగించింది.

బెల్ నొక్కేడు. కానిస్టేబుల్ లోపలకు వచ్చేడు.

"ఏమిటా గోల?" అని అడిగేడు.

"బయట ఎవరో అమ్మాయి వచ్చి గోలచేస్తూంది సార్!"

"ఇటు లోపలికి తీసుకురా!" అన్నాడు.

మరు నిముషంలో ఆమె లోపలకు వచ్చింది.

ఇరవై ఏళ్ళుంటాయి. ఎరుపూ తెలుపు రంగులు మార్చి కుట్టిన బెల్ బాటమ్ తొడుక్కుంది. తేనెరంగు కూలింగ్ గ్లాసెస్. బిగించి మొదట్లో ఎర్రరిబ్బను చుట్టి గుర్రపు తోకలా వది లేసిన జుట్టుతో ఆ అమ్మాయి ఆడగుర్ర ప్పిల్లలా ఉంది. ఓ చేతిలో చిన్న లెదర్ ఫైల్ ఉంది. లోపలకు వస్తూనే గ్లాసెస్ తీసింది. కోపంతో ముఖం ఎర్రబడిఉంది. చూపులు బాణాలు వదుల్తూన్నట్లున్నాయి ప్రసాద్ ఒక్క నిముషం చూపు మరల్చు కోలేకపోయేడు.

"గుడ్ మార్నింగ్! ప్లీజ్ టేక్ యువర్ సీట్!" అన్నాడు ప్రసాద్ మర్యాదగా తనముందున్న కుర్చీ చూపించి.

ఆమె కూర్చుంది. మెల్లగా ప్రసాద్ విషయం తెలుసుకున్నాడు. అంతకు ముందు రోజు ఆ స్టేషన్‌లో ఒక పోలీసు ఆఫీసరు అవినీతికి పాల్పడిన నేరస్థు రాళ్ళున్న సెంటర్‌కు వెళ్ళి వాళ్ళతో అమర్యాదగా ప్రవర్తించేడని ఆ సెంటర్ అధికారిణి నేరారోపణ చేసింది. ఈ అమ్మాయి జర్నలిస్టు. పేరు అరుణ. ఆ ఆఫీసరు వివరాలకోసం ఇక్కడకు వచ్చింది. స్టేషను సిబ్బందితో ఘర్షణ జరిగింది.

(సశేషం)

Printed and Published by A. Chandra Sekhar Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Public Garden Road, Hyderabad-500 001. Editor: A. SUDHAKARA RAO



సంక్రాంతి పావడం

